# అవతారిక

మన సనాతన (హిందూ)మతము అపారపారావారము వంటిది. అంత పురాతనమైనదిగాని, అంత విశాలమైనదిగాని, అంత అగాధమైనదిగాని, అంత అనిర్వాచ్యమైనదిగాని వేఱొకమతము లోకములో లేదు. తక్కిన మతములవలె దీని తత్త్వమునంతయు బైబిలు, ఖురానువంటి ఏదో యొక్క గ్రంథమూలమున గ్రహించుట శక్యముకాదు.

శ్రీమద్వివేకానందస్వాములవారు హిందూమతస్వరూపమును అధికారపూర్వక వాక్కులతో పాశ్చాత్యఖండవాసుల కెఱిగించి, దానికి లోకసమ్మానమును, లోకవ్యాప్తిని కలిగించినపిదప ఈ మతభావములను గ్రహించు కుతూహలము లోకములో అత్యంతముగా ప్రబలినది. ఆ కుతూహలమును తీర్చుటకై శ్రీ స్వాములవారి యుపన్యాసములలోను, రచనల లోనుగల ప్రసక్తభాగములను క్రోడీకరించి మేము "Hinduism"(హిందూ మతము) అను గ్రంథమును ప్రకటించితిమి; మాయావతిలోని అద్వైతాశ్రమమువారు "Essentials of Hinduism" (హిందూమతములోని ముఖ్యాంశములు) అను గ్రంథమును ప్రకటించిరి. ఈ గ్రంథము లెందఱో పాఠకుల నాకర్షించుచున్నవి. కావుననే అందొకటి మూడుముద్రణములను, ఒకటి నాలుగుముద్రణములను, అందినది.

ఆంగ్లపాఠకుల కింత ఆదరణపాత్రములైన ఈ గ్రంథములను మా ఆంధ్రపాఠకులకుకూడ అందజేయు కోరికచే వానిని (పునరుక్త భాగములను సాధ్యమైనంతమట్టుకు విసర్జించి) ఒకటిగాచేర్చి ఆంధ్రానువాద రూపమున నిప్పుడు ప్రకటించుచున్నాము.

మా ఆంగ్లపాఠకులవలెనే ఆంధ్రపాఠకులుకూడ దీని నాదరింతురు గాక.

శ్రీ రామకృష్ణమఠము,
మైలాపూరు, మద్రాసు - 4
15-8-1955

ప్రకాశకులు

ఓం

# హిందూమతము

## హిందూమతము : దాని విశ్వజనీనత

(1893 వ సంవత్సరమున షికాగోలో జరిగిన సర్వమతమహాసభలో చదువబడిన వ్యాసము)

చారిత్రకయుగమునకు పూర్వమే ఉద్భవిల్లి, ఇంత దనుక నిలిచియుండు మూడు మతము లిప్పుడు లోకమున కలవు. అవి హిందూమతము, జొరోస్ట్రియన్ మతము, యూదియా మతము. ఈ యన్నిటికిని భయంకరములగు దెబ్బలు తగిలినవి. ఆ దెబ్బ లన్నిటికిని ఆగి అవి ఇప్పటికిని సజీవములై నిలిచియున్నవి. వాని నైసర్గికబలమున కిది ప్రబలనిదర్శనము. కాని, యూదియామతము తన పుత్త్రిక యగు క్రైస్తవమతమును తనలో విలీన మొనర్చుకోజాలక పోవుటయేగాక, సర్వవిజయశీల యగు ఆ పుత్త్రికచేత తన జన్మభూమినుండి తఱుమగొట్ట బడినది. అత్యుదాత్త మగు జొరోస్ట్రియన్ మతపు పురాతనౌన్నత్యమును లోకమున కెఱిగింప కొలదిమంది 'పార్సీ'లుమాత్ర మిప్పుడు — చెఱువు

పట్టు చెలములవలె — మిగిలియున్నారు. హిందూదేశమున నూటికి నెన్నో మతశాఖ లొకదాని వెనుక నొకటి పొడసూపి, వేదప్రతిపాదితమతము నామూలాగ్రముగా ఉజ్జీ హాసించి, కాలద్రోయ జూచినవి. కాని ప్రళయకాల మగు భూకంపముచే సముద్రతీరజల మొకింతతడవు వెనుకకు మరలి పోయినను, నిర్నిరోధప్రవాహరూపమై, తొల్లింటికన్న సహస్రగుణాధికబలముతో మరల మోహరించి, సముద్రతీరమును ముంచివైచునట్లు, ఈ మాతృమతము ఆ అల్లకల్లోల మొకింత అడగినపిదప మరల విజృంభించి, ఈ విభిన్నమతశాఖ లన్నిటిని తన మహత్తరమూర్తిలోనికి ఆకర్షించుకొని, విలీన మొనర్చుకొనెను.

హిందూమత మత్యంతవిస్తృతరూపమైనది. మహోన్నతగగనమార్గమున కెగసి, అచట విహరించు వేదాంతమతాంతర్గత పారమార్థికభావములు మొదలు — వేనితో పోల్చిచూచినచో, † ఈ ఆధునిక భౌతికశాస్త్ర ప్రతిపాదనములు ప్రతిధ్వనిరూపములుగా తోచునో అట్టి పారమార్థికభావములు మొదలు—అత్యధమరూప విగ్రహారాధనము, తత్సంబంధ మగు సర్వతోముఖ పురాణకథాజాలము వఱకును గల వివిధ మతశాఖాభావములు, బౌద్ధుల అజ్ఞేయవాదము, జైనుల నాస్తికవాదము : ఈ యన్నింటిలో ప్రతిదానికిని హిందూమతమునం దొక స్థానము కలదు.

అగుచో, పరస్పరసంబంధ మేమియు లేక, మిక్కిలి దూరదూరములై కానిపించు ఈ కిరణరేఖ (Radii) లన్నియు

నాకటిగా నీరుకు కేంద్రస్థాన మెచట కల దను ప్రశ్న బయలుదేఱు చున్నది. పరస్పరము కేవలవిరుద్ధములుగా — పొందుపఱచుట కసాధ్యములుగా — కానిపించు ఈ విభిన్న భావము లన్నిటికిని ఆధారభూత మగు సామాన్యక్షేత్ర మెద్ది? ఈ ప్రశ్నమునకు సమాధాన మిచ్చుటకు నే నిప్పుడు ప్రయత్నింతును.

హిందూమతమున కాధారభూతము లగు వేదములు ఈశ్వరవాణి (Revelation) రూపము లైనవి. వేదము లాద్యంతరహితము లని హిందువుల సిద్ధాంతము. ఆద్యంత రహిత మగు గ్రంథ మొకటి కల దను మాట నా శ్రోతలకు హాస్యాస్పదముగా తోచును. కాని, వేదము లనగా గ్రంథ ములు కావు. అవి వివిధజిజ్ఞాసువులచే, వివిధకాలములందు, కనిపట్టబడిన పారమార్థికధర్మసూత్ర సముదాయముయొక్క నిక్షిప్తస్థానము. గురుత్వాకర్షణధర్మము (The Law of Gravitation) మానవు లెఱుగకముందుకూడ ఎట్లు ప్రవ ర్తిల్లుచుండి, వా రందఱును మఱచినకూడ ప్రవర్తిల్లు చుండ గలదో, అట్లే పారమార్థికలోకధర్మములుకూడ శాశ్వత ములు. ఆత్మ లన్నిటికి పరస్పరముగను, ఆత్మలకును ఆత్మల యొక్క జనకునికిని, గల ధార్మిక, నైతిక, పారమార్థిక సంబంధము లిట్లే మానవు లెఱుగకపూర్వమునుండియు ప్రవర్తించు చుండినవి; వారు మఱచిననుగూడ, అవి ప్రవర్తిల్లుచునే యుండును.

ఈ ధర్మములు కనిపట్టినవారిని ఋషు లందురు. వారు సిద్ధపురుషులుగా మాచే సన్మానింపబడుదురు.

కొందఱు స్త్రీలు ఈ ఋషులలో అత్యగ్రస్థానము వహించి యుండిరని మీకు తెలుప సంతసించుచున్నాను.

ఈ ధర్మములకు అంతము లేకపోవచ్చును గాని, వానికొక ఆది ఉండితీఱవలెనుగదా అని కొందఱు పలుకవచ్చును. సృష్టి ఆద్యంతరహిత మని వేదసిద్ధాంతము. విశ్వశక్తియొక్క సమష్టిపరిమాణము ఎప్పుడును సుస్థిరమై — హెచ్చుతగ్గులు లేక — నిలిచియుండు నని భౌతికశాస్త్రము నిరూపించిన దట. ఏమియు లేని సర్వశూన్యకాల మొకప్పు డుండెనేని, ఇప్పుడు అభివ్యక్తరూపమున కానిపించు ఈ శక్తి యంతయు అప్పు డెచ్చట నుండెను? ప్రసుప్తరూపమున భగవంతునియం దుండె నని కొందఱి సమాధానము. అట్లగుచో, భగవంతు డొక్కొకసారి ప్రసుప్తావస్థయందును (Potential) ఒక్కొకసారి సక్రియావస్థయందును (Kinetic) ఉండును. అనగా అతడు "సవికారుడు" (మార్పులు చెందువాడు) అగును. మార్పులు చెందున వన్నియు సంయుక్తపదార్థములు (compounds). సంయుక్తపదార్థము లన్నిటికిని వియోగము (destruction) అను మార్పుసిద్ధము. కావున భగవంతుడు నశించును! ఇది అసంగతము కదా. కావున సృష్టి లేని కాలమే లేదు — సృష్టికి 'ఆది' లేదు.

ఉపమానరూపవివరణ మొనర్తునేని, సృష్టికర్తయు, సృష్టియు రెండు రేఖ లనియు, అవి ఆద్యంతరహితములై, సుస్థిర మగు సమదూరముననే సాగుచుండు ననియు చెప్ప

వచ్చును. భగవంతుడు నిత్యజాగరూకుడు, నిత్యకార్యశీలుడు. అతని శక్తి అవ్యక్తము (chaos) లోనుండి జ్యోతిర్మండలముల నొకదాని వెనుక నొకటి కల్పించి, కొన్నాళ్లు నడువజేసి, ఆ పిదప లయ మొందజేయుచుండును. "ఈశ్వరు డీ సూర్య చంద్రులను పూర్వకల్పములలోని సూర్యచంద్రులవలె సృజించెను" అను భావము గల వాక్యమును ప్రతిబ్రాహ్మణ బాలుడు అనుదినము వల్లించుచుండును.

నే నిచట నిలుచుండి, కన్నులు మూసికొని, నా ఉనికిని గూర్చి 'నేను', 'నేను', 'నేను' అని భావింప జూచుచో, నా మనోనేత్రము నెదుట గోచరించు భావ మేది? ఒక శరీర భావమే గదా. అనగా, నేను సంయుక్తభౌతికపదార్థరాశి మాత్రుడనేనా? 'కాదు' అని వేదములు చాటుచున్నవి. నే నొక దేహమున నివసించు ఆత్మనుగాని, దేహమును కాను. దేహము మరణించును గాని నేను మరణింపను. నే నిప్పు డీ దేహమునం దున్నాను. ఇది పతన మొందును. కాని నేను బ్రదికియే యుందును. పూర్వముకూడ నే నుంటిని. ఆత్మ సృజింపబడినది కాదు. సృష్టి యనగా వస్తువులయొక్క సంయోగము. సంయుక్తపదార్థము లన్నియు కాలాంతరమున వియుక్తత నొందుట సిద్ధము. అనగా ఆత్మ సృజింపబడిన దయ్యేనేని, అది మరణింపవలసిన దగును. కొందరు సుఖులై జన్మింతురు; పరిపూర్ణారోగ్యభాగ్య మనుభవింతురు; వారి రూపము మనోజ్ఞమై, బుద్ధి బలిష్ఠమై యుండును; లోపము ఏదియు లేక వలసిన దంతయు వారికి లభించుచుండును.

నాజీకొందఱు నిర్భాగ్యులై జన్మింతురు. కొందఱికి కాలు సేతు లుండవు. కొందఱు మతిహీనులై పుట్టి, మర్దశయం దెల్లట్లో దినములు వెళ్లబుచ్చుకొనుచుందురు. వీరందఱును సృజింపబడినవారే అయినచో న్యాయశీలుడును, దయామయుడును అగు ఈశ్వరుడు ఒకనిని సుఖజీవిగాను, మఱొకనిని కష్టజీవిగాను ఏల సృజించును? ఇట్టి పక్షపాతము నత డేల చూపును? ఈ జన్మమున కష్టము లనుభవించువారు మఱొక జన్మమున సుఖము లనుభవింతు రని వాదించినను, సమస్యా పరిష్కారము కానేకాదు. న్యాయశీలుడును, దయామయుడును, అగు ఈశ్వరునిచే పరిపాలింపబడు రాజ్యములో ఈ జన్మమునమాత్ర మొక డేల దుర్దశ ననుభవింపవలెను?

మఱియు సృష్టికర్త యొకడు కల డను వాదము సృష్టిలో వైపరీత్యము లేల కలవు అను ప్రశ్నమునే యెదు ర్కొనజాడక, సర్వశక్తిమంతుడగు నొక నిరంకుశప్రభుని యొక్క క్రూరాత్మకమగు నిష్ఠురాజ్ఞనుమాత్రమే ప్రతిపా దించును. కావున మానవుని కష్టసుఖములకు మూల కారణము లతని జన్మమునకు పూర్వమే యెప్పడియుండవలె ననుట స్పష్టము. ఇవియే అతని పూర్వకర్మములు: స్వయం కృతములు.

మానవులయొక్క నుఐశ్వరీరముల పోకడలు (tendencies) వారికి వంశపరంపరాగతములై సంక్రమించిన లక్షణవిశేషములుగా (aptitudes) నుండరాదా? ఇచట సమాంతరరేఖలవలె నిలిచియుండు రెండు వస్తువులు కలవు:

ఒకటి మానసికము, రెండవది భౌతికము. మన స్వభావ విశేషము లన్నిటికిని భౌతికపదార్థము నందును తత్పరిణామము లందును తృప్తికర మగు సమాధానము లభించుచో, ఆత్మ యనున దొకటి కల దని ఊహించుటకే అవసర ముండదు. కాని, చింతనాశక్తి (Thought) భౌతికపదార్థమునుండి ఉత్పన్నమైన దని నిరూపించుట అసంభవము. తత్త్వవిచార మూలమున సర్వైక్యభావము (కల దంతయు ఒక పదార్థమే అను భావము) అనివార్య మని యేర్పడినచో, ఆ యేక పదార్థము భౌతిక మని తలచుటకన్న ఆత్మరూపమైన దని తలచుట — తార్కికదృక్పథమునుండిగాని, వాంఛనీయతాదృక్పథమునుండిగాని — ఏ మాత్రమును హీనము కాదు. కాని ప్రస్తుత మీ రెంటిలో ఏదియూ అవసరము లేదు.

శరీరములకు కొన్ని లక్షణవిశేషములు వంశపరంపరాగతములై సిద్ధించు ననుట నిర్వివాదాంశమే గాని, ఇది యొక విశిష్టలక్షణము గల మనస్సు ఒక విశిష్టవిధమున ప్రవర్తించుట కవసరమగు భౌతికాకృతివిశేషమునకు మాత్రమే వర్తించును. పూర్వకర్మఫలముగా ఆత్మకు కొన్ని సంస్కారవిశేషములు లభించును. ఏదో యొక విశిష్ట సంస్కారము గల ఆత్మ — తుల్యగుణములు గల వస్తువులకు పరస్పరాకర్షణము స్వభావసిద్ధము గనుక — ఆ విశిష్టసంస్కారమును ప్రకటించుటకు ఏ శరీరము అర్హతమమై యుండునో, ఆ శరీరమును ధరించి జన్మించును. ఇది భౌతికశాస్త్రమునకు పూర్ణముగా అనుగుణ మగు భావము. ఏలన, సర్వమునకు

అభ్యాసమే కారణభూత మని భౌతిక శాస్త్రముల మతము. అభ్యాసము ఎట్లేర్పడును? ఒక్క పనినే మాటి మాటికి చేయుచుండుటవలననే గదా. కావున, అప్పుడే జన్మించిన ఆత్మయందు చూపట్టు స్వాభావికాభ్యాసములు పునఃపునరాచరణమువలననే సిద్ధించియుండు నని చెప్పక తప్పదు. ఆ అభ్యాసములు ఈ జన్మమున ఆర్జించుకో బడినవి కావు గనుక, పూర్వజన్మములనుండి వచ్చియుండ వలెను.

మఱొక సూచన కూడ కలదు. పైని చెప్పబడిన దంతయు సత్య మని అంగీకరించినను, నా పూర్వజన్మ వృత్తాంత మేమియు నాకేల జ్ఞప్తి లేదు అను ప్రశ్న బయలుదేఱును. దీనికి సమాధానము చెప్పుట సులభమే. నేనిప్పుడు ఇంగ్లీషులో మాటలాడుచున్నాను. అది నా మాతృభాష కాదు. నిజమునకు నా మాతృభాషలోనిమాట యొక్కటైనను నా స్మృతిపథమున నిప్పుడు లేదు. కాని ప్రయత్నించితినేని ఆమాటలు గుంపులుగుంపులుగా చొర బాఱును. దీనినిబట్టి మానసికమహాసముద్రముయొక్క పైభాగముమాత్రమే మన స్మృతిపథమునందు గోచరరూప మున నుండు ననియు, దాని గర్భాంతరాళమున మన అను భవము లన్నియు నిక్షిప్తములై యుండు ననియు స్పష్ట మగుచున్నది. ప్రయత్నశీలుడవై పోరాడుము. అవన్నియు మరల గోచరరూప మొందును. నీ పూర్వజన్మముకూడ నీ జ్ఞప్తిలోనికి వచ్చును.

ఇది ప్రత్యక్షరూప మగు సాక్ష్యము—వివాదముల కెడమీయనిది. సిద్ధాంతములకు నిరూపణమే గదా పరమ ప్రమాణము. "స్మృతిసాగరగర్భాంతరాళమున డాగి యుండు విషయములను సైతము పైకి ఉబుకజేయు నిగూఢ మార్గమును మేము కనిపట్టితిమి. దాని ననుసరించినచో, మీ పూర్వజన్మవృత్తాంత మంతయు మీకు పరిపూర్తిగా జ్ఞప్తికివచ్చును; ఎవరైనను సరే, ఆ మార్గము ననుసరించి, దానిచే మేము చెప్పిన ఫలము సిద్ధింప దని నిరూపింపుడు చూతము" అని మా ఋషులు లోకప్రజల కందఱికిని ప్రతిజ్ఞాపూర్వకముగా చాటుచున్నారు.

అనగా, హిందువు తా నొక ఆత్మ యని విశ్వసించును. "అతనిని ఖడ్గములు ఛేదింపజాలవు, అగ్ని దహింపజాలదు, నీరు తడుపజాలదు, గాలి శోషిలజేయజాలదు". ప్రతి ఆత్మయు నొక వలయాకృతి (circle). దానికి పరిధియే (circumference) లేదు. కేంద్రము (centre) మాత్రము శరీరమున నుండును. మరణము అను మాట కర్థము ఈ కేంద్ర మొక శరీరమునుండి మఱొక శరీరమునకు మాఱుట: ఇది హిందువులయొక్క విశ్వాసము. ఆత్మ భౌతికనియమము లకు లోబడినది కాదు. స్వతస్సిద్ధముగా అది ముక్తము, నిర్నిబద్ధము, పావనము, శుద్ధము, పరిపూర్ణము. కాని యెట్లో అది భౌతికపదార్థమునకు అంటగట్టబడి, తాను భౌతికపదార్థ మనియే భావించుకొను చుండును.

ముక్తమై, పరిపూర్ణమై, విశుద్ధమై యుండు ఈ ఆత్మవస్తువు భౌతికపదార్థమున కిట్లేల లోబడియుండును

అనునది తెలుపవలసిన ప్రశ్న. పరిపూర్ణ మగు ఆత్మ తాను అపరిపూర్ణ మను భ్రాంతిలో నెట్లు చిక్కుగలదు? హిందువులీ ప్రశ్నకు ఉత్తరమే లేదని చెప్పి తప్పించుకొన జూతు రని కొందఱు తలతురు. కొందఱు తత్త్వవిచారపరులు అసమగ్రపరిపూర్ణత గల పురుషుల నొకరినో కొందఱినో ప్రతిపాదించి, పెద్ద పెద్ద పారిభాషిక నామములు ప్రయోగించి, తమ అజ్ఞతను కప్పిపెట్ట జూతురు. కాని, నామప్రయోగ మెట్లు వివరణము కాగలదు? ప్రశ్న యథాప్రకారము నిలిచియే యుండును. పరిపూర్ణవస్తువు అసమగ్రపరిపూర్ణ ముగా నెట్లు కాగలదు? విశుద్ధమును, అఖండమును అగు పదార్థము అణుమాత్రముగానైన తన స్వభావమును ఎట్లు కోల్పోగలదు? కాని హిందువు అకృత్రిమస్వభావుడు. అతడు కుతర్కములను నాశ్రయించి తప్పించుకొన జూడడు. సమస్యను పురుషోచితవిధమున నెదుర్కొను ధైర్య మతనికి కలదు. ఆ సమస్య కతని సమాధాన మిది: "పరిపూర్ణవస్తు వగు ఆత్మ తాను అపరిపూర్ణమైన దని తలచుకొనుటయు, తాను భౌతికపదార్థముతో చేరి దానిచే నియమింపబడినదని తలచుకొనుటయు ఎట్లు సంభవించెనో నాకు తెలియదు". కాని అట్లు సంభవించినమాట మాత్రము సత్యము. తాను శరీరమే యని తలచుకొనుట ప్రతివాడును ఎఱిగిన విషయమే. అతడట్లు తలచుకొను టెట్లు తటస్థించెనో వివరించుట కతడు ప్రయత్నింపడు. "అది భగవదిచ్ఛ" అనుట సమాధానమే కాదు. "నేను ఎఱుగను" అని హిందువు పలుకు మాట కన్న ఈ సమాధానమున నేమియు ఆధిక్యము లేదు.

ఇప్పటికి తేలిన దిది : జీవాత్మ నిత్యము, అమృతము, పరిపూర్ణము, అనంతము; మరణ మనగా దాని కేంద్ర మొక శరీరమునుండి మఱొక శరీరమునకు మారుట మాత్రమే; మన ప్రస్తుతస్థితి మన పూర్వజన్మకర్మముచేత నిర్ణయింపబడినది; అట్లే భవిష్యత్స్థితియు ఇప్పటికర్మముచేత నిర్ణయింపబడును; జన్మజన్మములకు మధ్య, మరణమరణము లకు మధ్య, ఆత్మ 'వ్యాకోచ' మొందుటో, 'సంకోచ' మొందుటో జరుగుచుండును. కాని మఱొక ప్రశ్న కలదు: మనుష్యుడు తుపానులో చిక్కిన చిఱు నావవలె, నొక క్షణమున నురుగులుగ్రక్కు మహాకల్లోలశిఖరమునకు ఎగజిమ్మబడుచు, అనంతర క్షణమున ఆవులించుచుండు అగాధములోనికి భీషణవేగముతో కూలద్రోయబడుచు, సత్కర్మదుష్కర్మవశుడై, తత్ప్రతిభావముచే ఇటు నటు దొరలుచుండు వాడేనా? పూర్తిగా భగ్నమై, ఇక బాగు పడు ఆసయే లేక పడియుండు పడవవలె, నిర్దాక్షిణ్యమై, అత్యుగ్రరూపమున, సర్వదా విజృంభించుచుండు కార్య కారణమహాతరంగరాశిలో అవశుడై చిక్కియుండు వాడేనా? తన నిర్నిరోధగమనమున కడ్డువచ్చువాని నన్నిటిని నుగ్గు నూచముగా అడగద్రొక్కివైచుచు — భర్తలను కోల్పోయి వాపోవు భార్యల కన్నీటివెల్లువలను, తండ్రులను కోల్పోయి వాపోవు బిడ్డల హాహారవములను, సరకుసేయక — సాగి పోవుచుండు ఉద్దండ రథచక్రములక్రింద నుంపబడిన క్షుద్ర కీటకము వంటివాడేనా? ఈ భావము హృదయవిదారకమే గాని, ప్రకృతినియమ మట్టిది! నిరాశోపహతము లైన

హృదయాంతరాళములనుండి “ఆశ లేనేలేదా?”, “తప్పించు
కొను మార్గమే లేదా?” అను ఆర్తధ్వనులు చెలరేగి
వెలువడి, కరుణాస్వరూపునియొక్క సింహపీఠియొద్దకు
వినిపించెను. ఆశాసందేశ మచ్చటినుండి దిగివచ్చి యొక
వేదఋషి నావేశింప, నత డీ శుభవర్తమానమును
ఉచ్చైస్స్వరముతో లోకమునకు ప్రకటించెను: “అమృత
పుత్రులారా! వినుడు; దివ్యధామ (అత్యున్నతక్షేత్ర)
వాసులారా! మీరును వినుడు. భ్రాంతికిని అంధకారమున
కును ఆవలనుండు ఆ పురాణపురుషుని నేను కనుగొంటిని.
మన మీ మరణపరంపరనుండి విముక్తుల మగుట కతని
నెఱుగు టొక్కటే మార్గము”. “అమృతపుత్రులారా!”
ఎంత మధుర మగు పేరు! ఎంత ఆశాజనక మైన పేరు!
సోదరులారా, మిమ్మును ఆ మధురనామముతో —“అమృత
పుత్రులారా!” అని పిలువనిండు. నిత్యానందస్థితికి ఉత్తరాధి
కారులై గదా మీరు జన్మించితిరి! అవును, హిందువు
మిమ్మును “పాపులు” అనుట కంగీకరింపడు. మీరు
ఈశ్వరుని బిడ్డలు; అతని అవ్యయానందమును పాల్గొను
వారు; పావనులు; పరిపూర్ణులు; భూమిపై విహరించు
దేవతలు — “పాపులా”? మనుష్యులను ఆ పేర బిలుచుట
పాపము! మానవప్రకృతినే అప్రతిష్ఠపాలు చేయజూచు
అపవాదోక్తి అది! ఓ సింహములారా, లెండు; మీరు
గొఱ్ఱె లనెడి భ్రాంతిని విదిర్చివైచుకొనుడు. మీరు
ఆత్మలు — నిత్యములును, ముక్తములును, ఆనందమయము
లును, ఆద్యంతరహితములును అగు ఆత్మలు; భౌతిక

వస్తువులు కారు; శరీరములు కారు. భౌతికపదార్థము మీ దాసి గాని, మీరు దాని దాసులు కారు.

కావున వేదములు ప్రతిపాదించునది నిష్ఠుర నియమములయొక్క ఘోరసందోహమును కాదు. కార్యకారణరూప కారాగారమున అనంతనివాసమునుకూడ కాదు. ఈ నియమముల కన్నిటికిని ప్రభువై, భౌతికపదార్థములలోని, భౌతిక శక్తులలోని, ప్రతి అణువునందును నిలిచి దీపించుచుండువా డొకడు కల డనియు, "అతని ఆజ్ఞవలననే వాయువువీచును, అగ్ని దహించును, మేఘములు వర్షించును, భూలోకమున మృత్యువు విహారమొనర్చును" అనియు అవి ప్రతిపాదించును.

అతని తత్త్వ మెట్టిది?

అతడు సర్వవ్యాపి, పరిశుద్ధుడు, రూపరహితుడు, సర్వశక్తిమంతుడు, దయామయుడు, కేవలుడు. వేదఋషులతని నిట్లు కీర్తించిరి: "నీవు మా తండ్రివి, మా తల్లివి, మా ప్రియమిత్రుడవు; బలమున కంతటికిని నీవే మూలాధారమవు — మాకు బలమును ప్రసాదింపుము. జగద్భారము నంతయు వహించు మహాత్ముడవు నీవు — ఈ స్వల్ప జీవిత భారమును వహించు శక్తిని మా కిమ్ము". అతనిని మన మెట్లు ఆరాధింపవలెను? అతనిని ప్రేమించుటే అతని నారాధించుట. "ఏకైకప్రియునిగా — ఇహపరములందు గల సర్వమున కన్నను ప్రియతరవస్తువుగా — అతని నారాధింపవలెను.

ఇదియే వేదములందు ప్రతిపాదింపబడిన ప్రేమసిద్ధాంతము. భగవదవతారమూర్తిగా హిందువు లారాధించు శ్రీకృష్ణు డీ ప్రేమసిద్ధాంతము నెట్లు విస్తృతపఱచి పరిపూర్ణ రూపమున బోధించెనో చూతము.

నీటియం దుద్భవించియు, నీటిచేత తడియకయుండు తామరాకువలె మానవుడు లోకమున జీవింపవలె నని అతని బోధ. అనగా తన హృదయమును ఈశ్వరమగ్నముగాను, హస్తమును కార్యమగ్నములుగాను ఉంచుకొని మానవు డీలోకమున జీవింపవలెను.

ఇహముననో పరముననో ప్రతిఫల మపేక్షించి ఈశ్వరుని ప్రేమించుట మంచిదే; కాని నిష్కామప్రేమ — ప్రియవస్తువు గనుకనే ప్రేమించుట — అంతకన్న శ్రేష్ఠము. ఈ ప్రార్థనమును చూడుడు: "ప్రభూ, నాకు భాగ్యముగాని, బిడ్డలుగాని, పాండిత్యముగాని వలదు. అది నీ యిచ్ఛయేని, ఎన్ని జన్మములైన ఎత్తుదును: కాని నేను నిన్ను ప్రతిఫలాపేక్షారహితముగా — అస్వార్థప్రేమయే పరమార్థముగా నెంచుకొని — నిన్ను ప్రేమించు చుండునట్లు మాత్ర మనుగ్రహింపుము". శ్రీకృష్ణుని శిష్యులలో నొకరు — ఆ కాలమున హిందూదేశచక్రవర్తిగా నుండినయతడు — శత్రువులకు ఓడి, రాజ్యమును కోల్పోయి, హిమాలయ ప్రాంతపు అరణ్య మొకదానిలో, తన రాణివాసముతో కూడ, నివసింపవలసి వచ్చెను. అచట నొక నాడు రాణి ఆయన నిట్లు ప్రశ్నించెను: "లోకమున గల ధర్మనిష్ఠాపరు

బందులలో అగ్రగణ్యు లగు మీ కిట్టి ఘోరవిపత్తు లేల తటస్థించినవి?'' అందుకు యుధిష్ఠిరు డీ క్రింది సమాధానము చెప్పెను : ''ప్రేయసీ, ఈ హిమాలయములను చూడుము. ఎంత ఉదాత్తవైభవముతో, ఎంత సౌందర్యమహాత్మ్యముతో, విరాజిల్లుచున్నవో! వానియందు నా కత్యంతప్రేమ. అవి నా కేమియు ఈయవు. కాని ఉదాత్తతను, సౌందర్యమును ప్రేమించుట నాకు సైజము. కావుననే నేను వానిని ప్రేమించుట. అట్లే ఈశ్వరునిగూడ నేను ప్రేమింతును. సౌందర్య మంతటికిని, ఉదాత్తత కంతటికిని అతడే మూలము. ప్రేమార్హ మగు వస్తు వాత డొక్కడే. అతనిని ప్రేమించుట నాకు స్వాభావికము. కావుననే నేనతనిని ప్రేమించునది. అతనియొద్ద నే నేమియు కోరను. దేనికై కూడ అతనిని ప్రార్థింపను. అతని కెచట ప్రీతియో, అచట నన్నుంపనిమ్ము. నా ప్రేమకు ప్రేమయే పరమార్థము. నా ప్రేమ వాణిజ్యవస్తువు కాదు.''

ఆత్మ దివ్యవస్తు వనియు, ప్రస్తుత మది భౌతికపదార్థ బంధములచే కట్టువడియున్నను, ఆ బంధములు తెగిపోయినతోడనే దానికి పరిపూర్ణత సిద్ధించు ననియు వేదములు చెప్పుచున్నవి. ఈ భావము ననుసరించి అవి ఆ సిద్ధికి ''ముక్తి'' అని పేరిడినవి — అపరిపూర్ణతాబంధములనుండి ముక్తి; మరణక్లేశములనుండి ముక్తి.

ఈశ్వరునికృపవలనగాని ఈ బంధవిచ్ఛేదనము కలుగదు. ఆ కృప చిత్తశుద్ధి గలవారికి మాత్రమే లభించును.

అనగా, ఆ లబ్ధి చిత్తశుద్ధిపై నాధారపడియుండును. ఆ కృప యెట్లు వర్తించును? చిత్తశుద్ధి గలవాని కతడు సాక్షాత్కరించును. చిత్తశుద్ధి గలవారును నిష్కలంకు లగువారును ఆతనిని చూతురు — అవును, ఈ జన్మముననే చూచితీఱుదురు. హృదయవక్రత్వ మంతయు అప్పుడు చక్కబడును. అప్పుడుగాని అది చక్కబడదు. సంశయము లన్నియు అప్పుడు తీఱిపోవును. భయంకరము లగు నిమిత్తానియమములకు మానవు డా పిదప వశవర్తియై యుండడు. ఇదియే హిందూమతములోని కేంద్రభావము. ఇదియే దానికి ప్రాణప్రాయ మైనది. మాటలను, సిద్ధాంతములను నమ్ముకొని హిందువు కాలము గడప నొల్లడు. ఈ యింద్రియగోచర ప్రపంచమునకు అతీతమైనవి ఏవైన నున్నచో, వాని నతడు ప్రత్యక్షముగా చూడగోరును. భౌతికము కానట్టి ఆత్మ యొకటి తనయం దున్నచో, దయాపరిపూర్ణు డగు విశ్వాత్మకు డొక డున్నచో, తా నతని సాన్నిధ్యమును చేరగోరును. తా నతనిని చూచితీఱవలెను. అప్పుడుగాని సంశయములు నిశ్శేషముగా నశింపవు. కావున ఆత్మయొక్కయు, భగవంతునియొక్కయు ఉనికినిగూర్చి నిరూపించుటకుగా హైందవసిద్ధపురుషులు చేయు పని "నేను ఆత్మను చూచితిని", "నేను భగవంతుని చూచితిని" అని పల్కుటయే. అట్లు చూచుటచేత గాని పరిపూర్ణత సిద్ధింపదు. హిందూమత మనగా ఏదో యొక సిద్ధాంతమునో, అభిప్రాయమునో, విశ్వసించుటకై పోరాడుటయు, ప్రయత్నించుటయు కాదు: దానిని ప్రత్యక్షముగా అనుభవించుట. అది నిర్దేశించు

నది విశ్వాసము కాదు — 'స్థితి'యు, 'సిద్ధి'యు (**Being and becoming**).

హిందూమతముయొక్క ఉద్దేశము నిరంతర సాధనాభ్యాసముచేత పరిపూర్ణత నందుట, దివ్యత్వము సాధించుట, భగవంతుని చేరుట, భగవంతుని దర్శించుట, పరిపూర్ణత నందుట — ఊర్ధ్వలోకమున నుండు జగత్పిత వలె పరిపూర్ణుడగుట : ఇదియే హిందువులయొక్క మతము.

పరిపూర్ణతను సాధించినపిదప మానవుని విషయ మేమగును? అతని జీవితము నిరతిశయానందపరిపూర్ణమై విరాజిల్లు చుండును. మానవునికి సుఖప్రదముగా నుండదగు ఏకైకపదార్థ మగు భగవంతుని సాన్నిధ్య మొందుటచే, అతడు అనంతమును, అఖండమును అగు సుఖ మనుభవించుచు, ఆ సుఖానుభూతిలో నిమగ్నుడై యుండును.

ఇంత మట్టుకు హిందువు లందఱిలో ఏకీభావము కలదు. హిందూదేశములోని వివిధశాఖలవా రందఱును ఈ మతమును పాటింతురు. కాని పరిపూర్ణత అనగా అఖండత్వము గదా. అఖండవస్తువులు రెండు మూడు ఉండనేరవు. మఱియు అఖండవస్తువునకు గుణము లుండజాలవు. వ్యక్తిత్వముకూడ ఉండజాలదు. కావున ఒక జీవాత్మ పరిపూర్ణమును, అఖండమును అయినప్పుడు, అది బ్రహ్మముతో ఐక్యమొందవలెను; తన తత్త్వముయొక్కయు, తన అస్తిత్వముయొక్కయు వాస్తవికతా పరిపూర్ణతలే భగవంతుడు, అఖండసచ్చిదానందము : అను జ్ఞానమును అది అను

భవపూర్వకముగా పొందవలెను. ఈ జ్ఞానసిద్ధిని ఎందరో వ్యక్తిత్వమును కోల్పోవుటగాను, దారుప్రాయత్వమును శిలాప్రాయత్వమును పొందుటగాను, వర్ణించియుండుట మేము పలుమారులు చదివియున్నాము!

“పిల్లకాకి కేమి తెలియును వింటిదెబ్బ పోటు!”

ఈ వర్ణనములు ఏ మాత్రమును సరియైనవికావని నేను సాక్షిగా చెప్పగలను. ఈ స్వల్పశరీరము తన దను జ్ఞానము సుఖకరమేని, రెండు శరీరములు తన వను జ్ఞానము ఇంకను ఎక్కువ సుఖకరమై యుండి తీరవలెను. ఈ ప్రకారము తన శరీరముల సంఖ్య అధిక మగుకొలది సుఖానుభూతియు అధిక మగుచు పోయి, అది విశ్వప్రజ్ఞానరూపమొందినపుడు ఆనందపరిపూర్ణత సిద్ధించును.

కావున ఈ అనంతవిశ్వవ్యక్తిత్వము లభింపవలెనన్నచో, క్లేశమయమగు ఈ క్షుద్రకారాగృహముచే పరిమితమైయుండు వ్యక్తిత్వము అంతరింపవలెను. నేను జీవముతో ఐక్యము నొందినప్పుడే నాకు మరణము నిలిచిపోగలదు; సుఖముతో ఐక్యము నొందినప్పుడే దుఃఖము నిలిచిపోగలదు; జ్ఞానముతో ఐక్యము నొందినప్పుడే పొరపాటులన్నియు నిలిచిపోగలవు. హేతుబద్ధవిచారము చేసినచో, ఈ నిర్ణయము అనివార్య మని తెలియవచ్చును. భౌతిక వ్యక్తిత్వము కేవల భ్రాంతిజనితభావ మనియు, నిరవకాశ వ్యాప్తిగల భౌతికమహాసముద్రమునందు నా శరీర మొక నిరంతరపరిణామవశమై యుండు స్వల్పవస్తు వనియు, నా

రెండవ ప్రతిరూపము (**Counterpart**) అగు జీవాత్మతో దీని కైక్యము (అద్వైతము) ప్రతిపాదించు టొక్కటే భౌతిక శాస్త్రసమ్మతము కాగలదనియు నా నిరూఢభావము.

శాస్త్రవిచార మంతటికిని ఏకీభావమును సాధించుటే లక్ష్యము. పరిపూర్ణైక్యమును సాధించిన శాస్త్రమున కిక పురోగమన ముండజాలదు. గమ్యమును చేరిన పిదప పురోగమన మెట్లుండగలదు? కావున సర్వభౌతికద్రవ్యము లకుమూలమై, వానియన్నిటి నిర్మాణమును సాధ్యపఱచునదై యుండు ఏకైకవస్తువు లభించుటతోడనే రసాయనశాస్త్ర పురోగమనము నిలిచిపోవును. సర్వ భౌతికశక్తులకును మూలమై అవన్నియు తనరూపాంతరములుగా నుండు ఏకైక భౌతికశక్తిలభించుటతోడనే, భౌతికవిజ్ఞానశాస్త్రవ్యాపారమాగి పోవును. అట్లే పారమార్థికవిద్యయు పరిణామోన్ముఖ మగు ఈ అనిత్యజగత్తునం దుండు ఆ నిత్యపరిపూర్ణజీవి నొక్కని; నిరంతరపరిణామశీలమగు ఈ జగత్తునకు సుస్థిరాధారభూతు డగు ఆ శాశ్వతు నొక్కని; జీవాత్మ లన్నియు ఎవనియొక్క మాయావృతరూపములో ఆ పరమాత్మునొక్కని: కనుగొనినతోడనే పరిపూర్ణత్వ మందును. నానాత్వమును, ద్వంద్వత్వమును అతిక్రమించినపిదపనే పరమైక్యభావము సాధింపబడును. పారమార్థికవిద్య దానిని దాటి పోజాలదు. శాస్త్రవిచార మంతటికిని పరమార్థ మిదియే.

కాలపరిపాకమున సర్వశాస్త్రములు ఈ నిశ్చితార్థమునకే వచ్చుట సిద్ధము. శాస్త్రజ్ఞు లిప్పుడు **Creation**

(సృష్టి) అను మాటకు బదులు **Manifestation** (వ్యక్తీకరణము) అను మాటను వాడుచున్నారు. ఈ మార్పును గాంచి హిందువు సంతసమందును. యుగయుగాంతరములుగా అతడు తన హృదయపేటికయందు నిక్షిప్తమొనర్చుకొని యుండిన ఈ భావము ఆధునికభౌతికశాస్త్రజ్ఞుల పరిశోధనలచేత నిరూపింపబడి, వారిచేత ఇంకను విశదతరరూపమునను, ఇంకను బలీయస్తరవాక్కులతోను, పునరుద్ఘాటింపబడుట కాతడు సంతసింపడా!

తత్త్వవిచారపరుల యన్వేషణములనుండి మన మిప్పుడు పామరజను లనుష్ఠించు మతమునకు దిగుదము. హిందూదేశస్థులు ఏకేశ్వరారాధకులుగాని అనేకేశ్వరారాధకులుకా రని మీరు ప్రప్రథమముననే ఎఱుగవలెను. ప్రతి దేవాలయమునకు పోయి చూచినచో, ఆయా విగ్రహము లన్నియు ఈశ్వరగుణగణము లెల్ల —సర్వగతత్వము సహా— కలవిగనే, ఆనామము లన్నిటితోను, పూజింపబడుట కానవచ్చును. కావున దీనికి అనేకేశ్వరారాధన మను పేరు చెల్లనేరదు. ఏకేశ్వరరారాధానమేగాని, ఇతరేశ్వరాభావము ప్రతిపాదింపబడదు అనుటకూడ పొరపాటే. "రోజాపూవున కింకొక పేరు పెట్టినను, పరిమళలోపము కలుగదు." వేళ్లు వివరణములు కావు.

నేను పసివాడనుగా హిందూదేశమున నున్నప్పుడు ఒక క్రైస్తవప్రచారకు డొక జనబృందమునకు మతబోధ చేయుచుండుట చూచితిని. అత డప్పుడు పల్కుచుండిన

మధురోక్తులలో ఈ వాక్యరత్న మొకటి : "మీ విగ్రహ మును నేను కఱ్ఱతో కొట్టినచో. అది యేమి చేయగలదు?" శ్రోతలలో నొక శ్రీ ప్రశ్నమునకు తీక్ష్ణరూపమగు ఈ ప్రతి ప్రశ్న వేసెను : "మీ దేవుని నేను దూషించినచో అత డేమి చేయగలడు"? "నీవు మృతినొందినప్పుడు నిన్నాయన శిక్షించును" అని బోధకుడు బదులుచెప్పగా, "నీవు మృతి నొందినప్పుడు మా విగ్రహముకూడ నిన్ను శిక్షించును" అని హిందువు మాఱుపలికెను !

పండ్లనుబట్టి చెట్టుయొక్క గుణము నిర్ణయింపబడ వలెను. నీతి యందును, పారమార్థికత యందును, ప్రేమ యందును లోకమున నసమానులై యుండు గుణోత్తరులు నాకీ విగ్రహారాధకు లనబడువారిలో కానిపించినప్పుడు "పాపమునుండి పావనత్వ ముద్భవించునా?" అను ప్రశ్న నాకు స్ఫురించును.

మూఢవిశ్వాసములు మానవునకు ప్రబలశత్రువులే గాని, మతవిషయక మూర్ఖాభినివేశ మంతకన్న ప్రబల శత్రువు. క్రైస్తవుడు 'చర్చి' కేల పోవును? సిలువ పవిత్ర ముగా ఎన్నబడు టేల? ప్రార్థన లర్పించునప్పుడు ముఖమును ఆకసమువంక కేల త్రిప్పుదురు? 'క్యాథొలిక్' శాఖవారి 'చర్చి'లో అన్ని ప్రతిమ లేల యుండును? ప్రొటస్టెంట్ శాఖవారు ప్రార్థన లర్పించునపుడు వారి మనస్సులలో అన్ని ప్రతీకములు (పవిత్రవస్తువుల ఆకృతులు) ఏల యుండును? సోదరులారా, ఊపిరి పీల్చక మన మెట్లు జీవింపజాలమో,

అట్లే మానసికాకృతి యొకటి లేనిది మన మే వస్తువును గూర్చిగాని తలంపజాలము. సంసర్గన్యాయమును (Law of Association) బట్టి భౌతికరూపము మానసికభావమును, మానసికభావము భౌతికరూపమును ఉత్పత్తి చేయును. కావుననే హిందువు ఆరాధనకాలమున నొక బాహ్యరూపము నుపయోగించుకొనును. ఆరాధించు మూర్తిపై తన మానసమును నిలుపుట కది తోడ్పడు నని యతడు చెప్పును. ఆ రూపము భగవంతుడు కాడనియు, అది సర్వవ్యాపకము కాదనియు, మీకు తెలిసినట్లే అతనికిని తెలియును. ఇంతకును "సర్వవ్యాపకము" అనగా అనేకులకు — ఇంచుమించుగా ప్రపంచజను లందఱికిని — అగు అర్థమేమి? అది యొక శబ్దమాత్రమే, చిహ్నమాత్రమే! భగవంతునికి భౌతిక వైశాల్యము కలదా? లేనిచో మనము సర్వవ్యాపకశబ్దము నుపయోగించినప్పుడు విశాలాకాశమునో, స్థలాకృతినో తలంతుము. అంతయే.

మన మనోనిర్మాణనియమములచే అనంతత్వమును మన మెట్లో యొక తెలుగున వినీలాకాశాకృతితోనో, సాగరాకృతితోనో ఎట్లు కూర్తుమో. అట్లే పవిత్రత్వము నొక చర్చి యొక్కయో, మసీదుయొక్కయో, సిలువయొక్కయో రూపముతో కూర్చుట మనకు నైజము. పావనత, పరిశుద్ధత, సత్యము, సర్వవ్యాపకత్వము మొదలగు భావములను వేర్వేఱు విగ్రహములతోను, రూపములతోను, హిందువులు జతపఱచిరి. కాని అం దొక విశేషముకలదు.

కొందఱు ఆస్తికధర్మజీవన మనగా కొన్ని సిద్ధాంతముల యొక్క వైజ్ఞానికాంగీకార మనియు, లోకహితకార్యాచరణ మాత్రమనియు భావించి, తమ జీవితకాలమునంతయు తమ మతాదర్శముననే బంధించియుంచి,అంతకన్న ఉన్నతతరభావ ముల నందుకొనక యుండగా, హిందువుయొక్క ఆస్తికధర్మ జీవనపు మూలభావము పరమార్థసిద్ధి: మానవుడు ఈశ్వర సాక్షాత్కార మొంది, తానీశ్వరత్వము సాధింపవలెను— విగ్రహములు, దేవాలయములు, చర్చీలు, శాస్త్రగ్రంథ ములు: ఇవన్నియు పారమార్థిక బాల్యదశయందు సహాయ మాత్రములుగా నుపకరించునవి; వీని కతీతుడై మానవుడు పురోగమించు చుండవలెను.

ఈ పురోగమనమున నత డెచ్చటను ఆగిపోకూడదు. "బాహ్యారాధనము, మూర్త్యారాధనము: అన్నిటికన్న క్రిందిదశ; అచటినుండి యున్నతి నందజూచు ప్రయత్నములో మానసికారాధన కుపక్రమింతురు. అది రెండవ దశ; కాని ఈశ్వరసాక్షాత్కారము లభించినప్పుడుగాని అగ్రతమదశ నధిగమింపము" అని వేదములు పల్కుచున్నవి. ఇందు కొక నిదర్శనము: విగ్రహమునెదుట ప్రణమిల్లుచున్న ఆ భక్తుడే "అతని దివ్యతేజమును సూర్యచంద్రనక్షత్రములు వ్యక్తపఱుపజాలవు. విద్యుత్ప్రభ లేనియు వ్యక్తపఱుపజాలవు. ఇక అగ్నిమాట చెప్పవలెనా! వీని యన్నిటి కాంతికిని అతడే మూలము" అని తెలుపును. కాని ఇతరుల ఆరాధ్య మూర్తుల నతడు దూషింపడు. వాని నారాధించుట పాతకము

బాలి యనడు. జీవితములో అదియు నొక ఆవశ్యకదశయే యని అతడంగీకరించును. "వార్ధక్యమునకు బాల్యము జనక ప్రాయ మైనది". బాల్యము పాతకమని గాని, యౌవనము పాతకమని గాని వృద్ధుడు పలుకదగునా?

తన వస్తుతత్త్వమును అనుభూతి మొనర్చుకొనుటకు విగ్రహారాధనము తోడ్పడు నని భావించు సాధకు డట్లొనర్చుటచే పాపము నొడిగట్టుకొను చున్నా డని చెప్పదగునా? ఆ సాధకుడే విగ్రహారాధనదశను తాను దాటిన పిదప, దాని నాక్షేపించుటయు అనుచితమే. హిందువుయొక్క దృక్పథమున మానవుడు పురోగమించునది అసత్యమునుండి సత్యమునకు కాదు: సత్యమునుండి సత్యమునకు — అసమగ్రసత్యము నుండి సమగ్రసత్యమునకు. అతని దృష్టికి అన్ని మతములును —మృగప్రాయు లగు అడవిజాతులు చేయు క్షుద్రరూపా రాధనలు మొదలు అత్యున్నతభావ సమగ్ర మగు అఖండా రాధనము వఱకు — పరిపూర్ణతత్త్వము నందుకొని దాని ననుభూతి మొనర్చుకొనుటకై జీవాత్మ చేయు వివిధ ప్రయత్నములే; సాధకులు పుట్టి పెరిగిన స్థితిగతుల విభిన్నతనుబట్టి ఆ ప్రయత్నములును భిన్నరూపములై యుండును. ఇందులో ప్రతిదియు కొంత పురోగమించి యొక దశను చేరును. ప్రతి జీవాత్మయు నొక చిన్ని గరుడపక్షి యనవచ్చును. అది పైకి పైకి ఎగసి ఎగసి, క్రమాధిక బలము చేకూర్చుకొని, చివరకు పరిపూర్ణ తేజోవైభవముతో దీపించుచుండు సూర్యబింబము నందుకొనును.

నానాత్వములో ఏకత్వమే ప్రకృతియొక్క మూల సూత్రము. హిందు వీ సూత్రమును గ్రహించినాడు. దాని నతడు మార్ప యత్నింపడు. ఇతరమతము లన్నియు ఏవో కొన్ని సుస్థిరసిద్ధాంతముల నేర్పఱచి, వానినే అంగీకరించి అనుసరింపు డని తమ తమ సంఘములను బలాత్కరింప జూచును. మానవసమాజము నెదుట వారొక్క చొక్కానే ఉంచి, అదియే ప్రతివానికిని సరిపోయి తీఱవలె నందురు. తమ కది పట్టలే దనువారికి వేఱొక చొక్కాను ఈయరు— చొక్కా లేకయుండుటె వారి గతి. అఖండపరతత్త్వమును ద్వంద్వభావమార్గముననే సాక్షాత్కరించుకొన గల్గుదుము. ద్వంద్వభావమూలముననగాని దానినిగూర్చి తలంచుటయు, మాటలాడుటయుకూడ సాధ్యముకాదు; విగ్రహములు, సిలువలు, చంద్రరేఖాకృతులు (**Crescents**): ఇవన్నియు సంజ్ఞామాత్రములు, పారమార్థిక భావమును నిలుప నాధారము లగు వంకెలవంటివి. ఇట్టి ఆధారములు కొందఱికి అక్కఱ లేకుండును గాని, అనేకుల కవి కావలసియే యుండును. అక్కఱ లేనివారు వానిని నిందింపరాదు. ఇంతకును విగ్రహారాధనము చేసియేతీఱవలె నని హిందూమతము బోధింపదు.

మీ రొక విషయము నెఱుగవలెను. హిందూదేశమున విగ్రహారాధన మొక ఘోరవిషయము కాదు. అది వెలయాండ్ర నుత్పత్తిచేయునది కాదు. అపరిపక్వబుద్ధి గల వారు మహోన్నతపారమార్థికసత్యముల నవగతపఱచు

కొనుటకై అవలంబించు మార్గ మది. హిందువులయం దెన్నియో లోపములు కలవు—ఒక్కొక్కరియెడ ఈ మాట వర్తింపకపోవచ్చును: కాని ఒక సంగతినిమాత్రము జ్ఞప్తి పెట్టుకొనుడు— వా రెప్పుడును స్వశరీరశిక్షణపరులై యుండెదరుగాని, ఇతరుల గొంతు కోయుతలంపు వారి కెన్నటికిని కలుగదు. స్వమతభావోన్మత్తు డగు హిందువు తన శరీరము నగ్నిజ్వాలల కర్పించుకొని మరణించునుగాని, (రోమన్ కాథొలిక్ క్రైస్తవుల వలె) తన మతము నంగీకరింపనివారి సజీవశరీరములను నిలువున తగులబెట్టడు. అతఁ డట్లు ఆత్మహత్య యొనర్చుకొనుటకూడ అతని మత నియమానుసారము కాదు. ఆ బాధ్యత హిందూమతముది కానేకాదు. క్రైస్తవులు మాంత్రికురాండ్రను తగులబెట్టి చంపిన బాధ్యత క్రైస్తవమతముదా?

కావున హిందువుబుద్ధికి ఈ ప్రపంచములో గల మతము లన్నియు నొక ప్రయాణ మొనర్చుచున్నట్లు— ఒక్క గమ్యమునే చేరుటకై, నానాజాతుల స్త్రీపురుషులు, నానా విధములుగా, నానాస్థితిగతులకు లోబడి, ప్రయాణ మొనర్చుచున్నట్లు— తోచును. మతము లన్నియు చేయు పని భౌతికమానవుని వికాసమునకు తోడ్పడి తుద కతనిలోని ఈశ్వరత్వము దీపించునట్లు చేయుటయే. వాని యన్నిటికిని ప్రేరకు డొక్క ఈశ్వరుడే. అగుచో, వానిలో ఇన్ని పరస్పర విరుద్ధభావము లుండుట కేమి కారణము? ఈ ప్రశ్నకు హిందువు చెప్పు సమాధాన మిది: పైకి అట్లు విరుద్ధములుగా

తోచునే గాని, ఆ భావములు నిజమునకు విరుద్ధములు కానే కావు. ఒక్క సత్యమే వేర్వేఱు స్వభావములు గలవారి వేర్వేఱు స్థితిగతులకు అనుగుణపడుటలో నేర్పడిన విరుద్ధతలే అని.

భిన్న వర్ణములుగల గాజుపలకల ద్వారా దీపించు ఒకే జ్యోతి అది.. అనుగుణ్యార్థ మీ స్వల్ప భేదము లావశ్యకములే. కాని సర్వమునకు మూలమై ఒక్క సత్యమే వెలుగుచున్నది. ఈశ్వరుడు తన కృష్ణావతారమున హిందువుల కిట్లు ప్రకటించి యున్నాడు: "ముత్యాలహారములోని సూత్రము వలె నేను సర్వమతములందును నిలిచియున్నాను. లోకుల నుద్ధరించి, పవిత్రీకరించు అసాధారణపావనతయు, అసాధారణశక్తియు ఎచ్చటెచ్చట గోచరించునో, అచ్చట నంతయు నేను కలనని ఎఱుగుము". ఈ ప్రకటనవలన నేమి కలిగినది? ఈ ప్రపంచ జను లందఱును, మా సంస్కృతదర్శనశాస్త్రముల నన్నిటిని గాలించి చూచి, అం దెచ్చటనైనను మోక్షము హిందువుకు మాత్రమే లభించును, ఇతరులకు లభింపదు అని చెప్పబడి యున్న దేమో చూపుడు. చూపజాల రని నేను పందెమొడ్డి వచింపగలను. "మన కులవ్యవస్థకు, మన మతభావములకు సంబంధింపనివారిలో కూడ సిద్ధత్వ మందిన మహాపురుషులు కలరు" అని వ్యాసమహర్షి పలికియున్నాడు. ఇం కొక్క మాట. హిందువుయొక్క మతనిర్మాణ మంతటికిని ఈశ్వరుడు మూలస్తంభమై యుండగా, అతడు (హిందువు) అజ్ఞేయవాద రూప మగు బౌద్ధమతమును, నాస్తికవాదరూప మగు జైన మతమును నమ్ము టెట్లు సంభవించెను?

బౌద్ధులును, జైనులును భగవంతునిపై ఆధారపడ రను మాట నిజమే కాని, వారి మతబల మంతయు సర్వమత కేంద్రమహాసత్య మగు "మానవత్వములోనుండి ఈశ్వరత్వ మావిష్కరించుచున్న క్లానర్సు" మహోద్యమము వైపునకే సదా మరల్పబడియున్నది? వారు తండ్రిని దర్శింపలేదు; గాని, పుత్రుని దర్శించినారు. పుత్రుని దర్శించినవారు తండ్రిని కూడ దర్శించినట్లే.

సోదరులారా, మీ కిప్పుడు హిందూమతభావములను సంగ్రహరూపమున వివరించినాను. హిందువు తన పథకముల కన్నిటికిని కార్యరూప మీయ జాలకపోయి యుండవచ్చును. కాని ఎన్నటికైనను విశ్వజనీనమత మొకటి ఉత్పన్న మైనచో, అది ఏదో యొక స్థలమునకు మాత్రమే, ఏదో యొక కాలమునకు మాత్రమే, సంబంధముగలదిగా నుండరా దనుట స్పష్టము. తాను ప్రకటించు ఈశ్వరునివలె — కృష్ణ భక్తుల మీదను, క్రీస్తుభక్తుల మీదను: మహాత్ముల మీదను, దురాత్ములమీదను; సమముగా ప్రకాశించు ఈశ్వరనిర్మిత సూర్యునివలె — ఆ మతముకూడ అనంతమై, పరిపూర్ణమై, యుండవలెను; బ్రాహ్మణమతము కాక, బౌద్ధ మతము కాక, క్రీస్తు మతము కాక, మహమ్మదీయమతము కాక, వీని యన్నిటియొక్క సమష్టియై యుండవలెను. కాని అది అంతటితో ముగియక, అనంతవిస్తరణమునకుగూడ అవకాశము కల్పించియుంపవలెను. ఆ మతము నీచాతినీచ దశయందు, మృగప్రాయుడై జీవించు, అడవిమనుష్యుడు

మొదలుకొని, మహోన్నతి నంది, తన మనీషాప్రాబల్యము చేతను, హృదయవైశాల్యముచేతను, లోకుల నాశ్చర్య చకితుల నొనర్చి, వారిచే మానవాతీతుడుగా సంభావింపబడు సిద్ధపురుషునివఱకును, గల వివిధమానవులను సమాలింగన రూపమున నావరింపగలిగిన అవ్యయౌదార్యాకృతిగలదై యుండవలెను. ఆ మతవ్యవస్థయందు హింసకు, అసహన మునకు తావుండదు. అది ప్రతిపురుషు నందును, ప్రతి స్త్రీయందును దివ్యత్వము కలదని అంగీకరించును. దాని అవకాశము లన్నియు, దాని శక్తి యంతయు, మానవజాతి తనవాస్తవికదివ్యత్వమును గ్రహించి అనుభూత మొనర్చు కొనుటకు తోడ్పడుటయందే కేంద్రీకరింప బడియుండును.

అట్టి మతము నొకదానిని ప్రతిపాదింపుడు. సర్వ జాతులును మిమ్మనుసరించును. అశోకుడు సమావేశపఱచిన సభ బౌద్ధమతస్థులదిమాత్రమే. అక్బరు సమావేశపఱచినసభ అంత సంకుచితరూపమైనది కాకున్నను, అది కచేరీచావడిలో జరుపబడిన చిన్న సభ. సర్వమతము లందును భగవంతుడు కలడని ప్రపంచములోని సర్వదిగంతములకును ప్రకటించు బుద్ధివైశాల్యము అమెరికాకే దక్కినది.

హిందువులు బ్రహ్మ మనియు, జొరోస్ట్రియనులు అహూరా-మాజ్దా అనియు, బౌద్ధులు బుద్ధుడనియు, యూదులు జెహోవా యనియు, క్రైస్తవులు 'దివియం దుండు తండ్రి' యనియు ఎవ్వని కీర్తించి, పూజింతురో, అతడు మీ మహోత్కృష్టభావము నాచరణరూప మొందించి

కొనసాగించు శక్తి మీకు ప్రసాదించుగాక! నక్షత్రము తూర్పు దిక్కున పూర్వము పొడచూపెను. సుస్థిరగమనముతో — ఒక్కొక్కసారి మందకాంతితోను, ఒక్కొక్కసారి దేదీప్యమానముగను — పశ్చిమాభిముఖగమనమొనర్చి భూగోళప్రదక్షిణము చేసి అది మరల నిపుడు తూరుపు దిఙ్మండలముననే ***మునుపటికన్న వేయిరెట్లెక్కువ తేజోవైభవముతో ఉదయించుచున్నది.

*　　*　　*　　*



# హిందూమతము : వేదములలో దాని స్వరూపము *



మనము ముఖ్యముగా గ్రహింపవలసినది ఆస్తికధర్మ భావవిషయకమైన — అనగా ఆత్మనుగూర్చియు, ఈశ్వరుని గూర్చియు, ఆస్తికధర్మమును (Religion) గూర్చియు జరిగిన — విచారము. సంహితలను తైకొందము. ఇవి స్తోత్రసమీకరణరూపములైనవి. ఇవి ఆర్యవాఙ్మయమున — ప్రపంచ వాఙ్మయమునగూడ — ప్రాచీనతమమైనవి. ఇంతకన్న ప్రాచీనరచన లెక్కడనైన ఉండియుండవచ్చునుగాని, అవి చిన్నవి, ఖండరూపములు. గ్రంథములు కావు. వాఙ్మయ నామము వానికి చెల్లదు. సంపుటీకరింపబడి, గ్రంథరూపమున కానవచ్చు వాఙ్మయ మింత పురాతనమైనది లోకమునని కేదియు లేదు. అత్యంతప్రాచీనకాలపు ఆర్యుల చిత్తవృత్తులు, వారి వాంఛితములు, ఆచారవ్యవహారవిషయములలో వారి నెదుర్కొన్న సమస్యలు, మున్నగుసంగతులిందు చిత్రింపబడియున్నవి. ప్రప్రథమమున నే మనకొక వింత భావము కానవచ్చును. ఈ ఋక్కులు (స్తోత్రగీతికలు) వేర్వేఱు దేవుండ్లను (అనగా తేజోరూపులను) గూర్చినవి. ఇట్టి దేవుండ్లనేకులు గలరు. ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు,

* పాశ్చాత్యఖండమున నొసగబడిన ఉపన్యాసము.

పర్జన్యుడు అనునవి క్రం వారికొందఱి పేళ్లు. ప్రాచీనకథా (Mythological) ప్రసిద్ధులును, భావవ్యంజక (Allegorical) నామములను అనువా రెందఱో ఒకరివెనుకనొకరు కాని పింతురు. ఇట్టివాడే వజ్రాయుధుడగు (వజ్రము = పిడుగు) ఇంద్రుడు. భూలోకమునకు వర్షము రాకుండ అడ్డుపడిన సర్పము నితడు ఖండించె నని ప్రతీతి. ఇతడు తన వజ్రాయుధమును విసరి ఆ సర్పమును ఖండింపగా, జడివాన కురిసె నట. జనులు సంతుష్టులై ఆహుతు లర్పించి అతనిని పూజింతురు. బలిదానార్థమై వారొక చితిని కల్పించి, కొన్ని జంతువులను వధించి, వాని మాంసమును ఇనుపకడ్డీలకు గ్రుచ్చి పాకము చేసి, ఆ పరిపక్వమాంసము నింద్రుని కర్పింతురు. ఆ కాలమున 'సోము'నామక మగు మొక్క యొకటి మిక్కిలి జనాదరమును గాంచియుండెను. ఇప్పుడు దాని నెవ్వరును ఎఱుగరు; అది ఎచ్చటను కానరాదు. దానిని చితుకగొట్టినచో పాలవంటిరసము వచ్చున దనియు, దానిని పులియబెట్టువారనియు, ఆ పులియబాఱిన సోమరసము మత్తుపదార్థమనియు గ్రంథములనుండి తెలియవచ్చుచున్నది. ఈ రసమునుకూడ వారు ఇంద్రునికిని, ఇతర దేవతలకును అర్పించువారు; తామును త్రాగువారు. ఒక్కొక్కసారి వారి త్రాగుడు కొంచెము మితిమీఱెడిది. దేవతలదియు అట్లే. ఇంద్రు డొక్కొకసారి స్మృతితప్పునట్లు త్రాగువాడు. అతి డొక్కొకసారి మితిమీఱ త్రాగి అపభ్రంశముగా మాటలాడెనని కొన్ని ప్రకరణములవలన తెలియుచున్నది. వరుణుని విషయముకూడ ఇట్లే. అతడు మహాశక్తిమంతు డగు మహారాజ

వేలుపు. అతడును తన భక్తుల నిట్లే రక్షించును. అతనిని కూడ ఇట్లే సోమరసార్పణములచే సంతుష్టు నొనర్చి కీర్తింతురు. యుద్ధమునకొక యధిదేవతయు, అట్టి ఇతరాధిదేవతలును కలరు. కాని మన సంహితలలో కానవచ్చు పురాతన గాథలకును, ఇతర దేశ పురాతనగాథలకును ఒక ముఖ్యభేదము ప్రతివానికిని గోచరించితీఱును — ఇందలి దేవత లందఱితోను అఖండపరిపూర్ణత్వభావము కూడియుండును. ఒక్కొక యెడ ఈ పరిపూర్ణతను వేలుపఱచి దానికి ఆదిత్యనామ మిచ్చుటయు కలదు; మఱికొన్ని యెడల ప్రతి వేలుపునకును దానిని కూర్చుటకలదు. ఇందుకు నిదర్శనముగా ఇంద్రుని గైకొందము. కొన్ని గ్రంథములందు ఇంద్రుని కొక శరీర ముండును; అతడు మహా బలశాలి; కొన్ని యెడల స్వర్ణకవచమును ధరించును; భూలోకమునకు దిగివచ్చి తన ఉపాసకులతోకూడి జీవించుచు, భుజించుచుండును. రాక్షసుల తోను, నాగులతోను, ఇతరులతోను యుద్ధమాడును. కాని మఱొక ఋక్కులో ఈ యింద్రునికే మహోన్నతపదవి యొసగబడియుండును: అతడు సర్వవ్యాపి, సర్వశక్తి సంపన్నుడు, ప్రతి మానవుని హృదయ మతనికి విదితమై యుండును. ఇట్లే వరుణునివిషయమును. ఇతడు వాయువున కధిదేవత; పూర్వము ఇంద్రునికివలె ఇప్పుడు జల మితని యధీనమున నుండును; కాని ఉన్నట్టుండి ఇతడు మహోన్నత పదవి కుద్ధరింపబడును. అత డప్పుడు సర్వవ్యాపి, సర్వశక్తి మంతుడు; ఇట్లే ఇతర మహాప్రభావములుకూడ ఇతనికి కలిగి యుండును. ఇతని మహోన్నతరూపవర్ణనముగల యొక

ఋక్కు — భావ మిది: "మహత్తరశక్తిసంపన్ను డగు ఈ ప్రభుడు మన చర్యల నన్నిటిని, తన యెదుట జరుగుచున్న వానివలె, దివినుండి చూచును; మానవులు తమ చర్యల నెంత దాచిపెట్టగోరినను. దేవతలకు అవి యన్నియు తెలిసి యుండును. నిలిచియున్నను, సంచరించుచున్నను, రహస్య గమనమున నొకచోటినుండి మఱొకచోటికి పోయినను, ఎవ్వరికిని కానిపింపని గుహాలో దాగియున్నను, ఆ మనుష్యు డేమేమి చేయుచున్నది దేవత లెఱిగియుందురు. ఇరువు రొకచోట కలిసి, మఱెవ్వరు నచట లేరు అను భావముతో కుట్రలు పన్నినప్పుడు వరుణదేవుడు అచటనుండి వారి పన్నగడ నంతయు తెలిసికొనును: ఈ భూమి అతనిది, ఈ అనంతాకాశ మతనిది, సముద్రములుకూడ అతనిలోనివే; కాని అత డా చిన్న మడుగులో నుండును. గగనపదమును దాటి ఎగిరిపోజూచువాడుకూడ వరుణప్రభుని బారినుండి తప్పించుకోజాలడు; అతని గూఢచారులు దివినుండి దిగివచ్చి, నిశ్శబ్దముగా జగత్తుచుట్టును తిరుగుచుందురు. వారు వేయి కన్నులతో దిగంతపర్యంతము సర్వభూతలమున జరుగున దంతయు కాంచుచుందురు."

తక్కిన దేవతలనుగూర్చి కూడ ఇట్టి వర్ణనముల నెన్నియైన ఉదాహరింపగలము. వా రొకరివెనుక నొకరు వచ్చుచుందురు, చివర కొకే విధమున అంత మొందు చుందురు — దేవతలుగా ప్రారంభింతురు, చివరకు అఖిల జగత్తు తమయందే కలవారుగా, సర్వహృదయములకు

సాక్షిభూతులుగా, సర్వలోకాధినాథులుగా, పరిణమింతురు. వరుణుని విషయములో మాత్రము మఱొకభావము — భయభావము — గోచరించును. ఈ భావము అంకురరూపమున పొడచూపెను గాని, వెంటనే ఆర్యబుద్ధి దాని నణగ ద్రొక్కివైచెను. మఱొకచోట కొందఱు పాపమొనర్చితిమను భీతి కలిగి, క్షమింపుమని వరుణుని ప్రార్థించినట్లు వ్రాయబడియున్నది. ఈ భావములు — పాపభావము, భయభావము — మొలకలెత్తుచుండెను గాని, వానిని హైందవభూమిలో నభివృద్ధి నొందకుండ చేసిరి. ఇందుకు కారణము మీరు మున్ముందు గ్రహింతురు. ఇది ఏకేశ్వరారాధకుల భావ మని మీ రందఱును ఎఱుగుదురు. ఈ ఏకేశ్వర సిద్ధాంతము చాల పురాతనకాలముననే హిందూదేశములో ప్రవేశించెను. సంహితాభాగ మంతటిలోను — ఇదియే వేదములలో ప్రథమమును, ప్రాచీనతమమును అయినది — ఈ ఏకేశ్వరభావమే కానిపించుచున్నది. కాని ఆర్యుల నిది తృప్తిపఱుప జాలకపోయెను. అది మిక్కిలి అపరిపక్వభావముగా తోచుటచే దానిని వారు విడనాడిరి. అంతకన్న ఉన్నత మని మా హిందూబుద్ధికి తోచు భావము దెసవారు పరిక్రమించిరి. కాని యూరపుదేశస్థులు మా వేదములనుగూర్చి వ్రాసిన గ్రంథములలోను, వేదవిమర్శన గ్రంథములలోను మా ఋషుల రచన లా పురాతనభావముతోనే నిండియున్నట్లు కానిపించును. హిందువు కిది పరిహాసాస్పదముగ తోచును. సగుణ సాకార భావమునకన్న ఉన్నత మగు ఈశ్వరభావమే లేదని ఉగ్గుపాలతో నేర్చిన

వారు మా ప్రాచీనతత్త్వవిచారపరుల భావసరణి ననుగమించు టకు సాహసింపజాలక పోవుటచిత్రముకాదు. నిజమునకు సంహి తాకాలము దాటుటతోడనే సంహితాభాగమున నిండియున్న ఏకేశ్వరభావము పనికిమాలిన దనియు, వేదాంతులకును, జిజ్ఞాసువులకును అది ఆదరణార్హముకాదనియు, తలచి, అంత కన్న తాత్త్వికమును, అంతకన్న లోకాతీతమును అగు భావ మును సాధించుటకై ఆర్యులు పాటుపడిరి. ఏకేశ్వరభావము —"ఆతనియందే జగత్తంతయు నిలిచియున్నది", "సర్వ చిత్తములకు నీవే కాపరివి" మున్నగు వర్ణన లెన్ని చేయు చున్నను — కేవల మానవబుద్ధిపరిమితమైనదిగా వారికి తోచెను. హిందువులు తత్త్వవిచారవిషయమున నిరంకుశ సాహసము చూపిరని అంగీకరింపక తప్పదు. అందుకై వారిని సంభావించియే తీఱవలెను. వారి సాహసికభావాగ్ని జ్వాలలోని యొక్క స్వల్పకణమే పాశ్చాత్యదేశపు తత్త్వ విచారపరులలో ధీరతావిఖ్యాతినొందిన వారినికూడ వెఱపు గొలుపజాలియుండును. "వీ రధిరోహించినంత మహోన్నత క్షేత్రమున ఇతరుల శ్వాసకోశములు పిగిలిపోయియుండును; వీరికిమాత్రమే అచట ఊపిరాడుట సాధ్యము" అని ప్రొఫె సర్ మ్యాక్స్‌ముల్లరు మనోహరముగా పలికెను. సహేతుక విచార మీ ధీరుల నెంత అపరిచితభావక్షేత్రములకు కొని పోయినను, వా రచటికి పోవ సాహసించిరి. అందుకై ఏమి పరిత్యజింపవలసివచ్చినను, వారు వెనుదీయలేదు; ఎంతో కాలమునుండి నిక్షిప్తపఱచుకొనియుండిన భావములు పటా పంచలై పోవుటకు వారు చింతిలలేదు; లోకులు తమ్ముగూర్చి

ఏమి తలంతురో, ఏమి పలుకుదురో అని వారు భీతిల లేదు. వారి కేది యుక్తమని తోచునో, ఏది సత్యమని తోచునో, దానిని వారు పలికిరి, లోకులకు బోధించిరి.

ఈ ప్రాచీన వేదర్షులు పట్టిన ఆలోచనాపథములను విచారించుటకుమునుపు వేదములలో కానిపించు ఒకటి రెండు వింతవిషయములను మొదట పరిశీలింతము. వారు వేలుపుల నొక్కొక్కరిని కైకొని వారి పదవికి, శక్తికి, క్రమానౌన్నత్యము కల్పించి, చివరకు వారిని జగదధీశ్వరులనుగా, అనంతులనుగా, చేయుట యెట్లు సంభవించెను? ఈ ఆచారము హిందువులలో మాత్రమే కలదని, ప్రొఫెసర్ మ్యాక్స్ముల్లరు దానికి 'హెనోథీజం' (Henotheism = నమ్మిన నొకే దేవునినైనను, వేఱు దేవుండ్లు లేరు అని చెప్పకుండెడు మతము) అను క్రొత్తపేరు పెట్టెను. పై ప్రశ్నయొక్క సమాధానమునకై మన మెచ్చటెచ్చటనో వెదకవలసిన పనిలేదు. ఆ పుస్తకమునందే అది కానిపించుచున్నది. ఈ వేలుపులను ఉన్నతికిని మహత్తరత్వమునకును ఉద్ధరించు ఘట్టమునకు కొంచెము ఆవల అందుకు కారణముకూడ విశదీకరింపబడియున్నది. పురాతనకథావాఙ్మయవిషయమున హిందువులకును తక్కినవారికిని గల ఈ అపారభేదమునకు— హిందువులలోతప్ప మఱెచ్చటను కానరాని ఈ విశేషమునకు — కారణ మేమి అను ప్రశ్న బయలుదేఱుచున్నది. బాబిలోనియనులయొక్కయు గ్రీకులయొక్కయు పురాతన కథావాఙ్మయమున ఒక వేలుపు ఉన్నతపదవికై పరిశ్రమించి,

ఆ పదవిని పొంది అచట నిలిచియుండును; ఇతర దేవత లందఱును అంతరింతురు. 'మోలక్' (Moloch) లందఱిలో 'జెహోవా' మహోత్తరుఁ డగును. తక్కిన మోలక్ లందఱును మఱుఁగున బడిపోవుదురు. ఆ పిదప వారు తలయెత్తరు. జెహోవా (Jehovah) దేవదేవుఁ డగును. అట్లే గ్రీకుల వేలుపు లందఱిలో 'జియుస్' (Zeus) ప్రముఖత్వ మొంది మహోన్నతుఁ డగును; జగదధీశ్వరుఁ డగును; తక్కిన దేవత లందఱును పదభ్రంశము నొంది, క్షుద్రస్థానములకు దిగి వత్తురు. పిమ్మటికాలమునఁగూడ ఇట్టి మార్పులే జరిగినవి. బౌద్ధులును జైనులును వారి ప్రవర్తకులలో నొకరిని దేవతా పదవి కుద్ధరించి, తక్కిన దేవతల నందఱిని బుద్ధునికిని జినునికిని పరివర్తులుగా నొనర్చిరి. లోకమునం దంతటను ఇట్లే జరిగెను. హిందూమతమునమాత్రమే ఇందుకు భిన్నమైన ప్రవర్తనము కానిపించుచున్నది. ఒక వేలుపు ప్రస్తుతింపబడును. తాత్కాలికముగా తక్కిన వేలుపు లందఱును అతని యాజ్ఞానువర్తులై యుందురు. ఒక సంహితయందు వరుణునిచే ఉన్నతికి తేబడిన వేలుపే మఱొక సంహితయందు సర్వోన్నతపదవి కుద్ధరింపబడును. వా రందఱును వంతుల ప్రకారము సగుణదైవపదవి నాక్రమింతురు. ఇట్లు జరుగుటకు కారణము సంహితలందే విశదపఱుపబడి యున్నది. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" (ఉన్న దొకే వస్తువు. దానినే ప్రాజ్ఞులు వేర్వేఱు పేళ్లతో వ్యవహరింతురు) అను వాక్యమునం దిమిడియున్న ఈ కారణము మహోదాత్తరూప మైనది; హిందూదేశములో అనంతరకాలమున ప్రబ

లిన ఆధ్యాత్మిక విచారమంతయు ఈ మూలసూత్రము మీదనే ఆధారపడియున్నది; భావికాలమున లోకములో ఎచ్చటనేని విస్తరణ మొందనున్న ఆస్తికధర్మ విచార మంతయుకూడ దీనిమీదనే ఆధారపడి యుండగలదు. ఈ వివిధదేవతలనుగూర్చి ఋక్కులు రచించినవారిదృష్టిపథమున నిలిచియున్న దొక్కడే. దర్శించువారు భిన్నులగుటయే భిన్నత కంతటికిని కారణము. ఒకే ఏకైకపురుషుని గూర్చియే స్తోత్రకారులు, ఋషులు, కవులు, వివిధభాష లలో, వివిధవాక్కులతో గీతికలు రచించిరి. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"—ఈ ఒక్క వాక్యమునుండి మహో త్కృష్టఫలితము లావిర్భవించినవి. మతమూలకములగు హింసలు, మతానుష్ఠానమున కవరోధము కల్పించుటలు, కలుగనిది హిందూదేశ మొక్కదానియందే అగుట మీలో కొందఱికి విచిత్రముగా తోపవచ్చును. ఆస్తికులు నాస్తి కులు, అద్వైతులు ద్వైతులు, ఏకేశ్వరారాధకులు: ఆ దేశ మున కలరు. ఎన్నడుగాని వారి కుపద్రవము కలుగదు. బ్రాహ్మణదేవాలయముల మెట్లపై నిలుచుండి వేలుపులను దూషించుచు, ఈశ్వరునికూడ ఖండించుచు జడవాదులు బోధింపగల్గిరి. ఈశ్వరభావము కేవలభ్రాంతిజనిత మనియు. వేలుపులు, వేదములు, ఆస్తికధర్మసూత్రములు తమ స్వప్రయోజనార్థము దేవతార్చకులు కల్పించిన మూఢ విశ్వాసము లనియు వారు దేశమంతయు తిరిగి ప్రచారముచేసిరి. వారి కెవ్వరును ఆటంకములు కల్పింప లేదు. అట్లే బుద్ధు డెచటికి పోయినను, హిందువులు పవిత్ర

ములుగా భావించుచుండిన ప్రతి పురాతన వస్తువును కూల ద్రోసి మట్టిపాలు చేయువారు. ఐనను బుద్ధుడు వార్ధక్య పరిపాక మొందినపిదపనే మరణించెను. ఈశ్వరభావమును పరిహసించుచుండిన జైనులవిషయముకూడ ఇట్టిదే. "ఈశ్వరుడు లోక కర్త యెట్లుండగలుగును? అది కేవలము మూర్ఖ భావమై యుండవలెను" అని వారు పల్కువారు. ఇట్టి నిదర్శనము లనంతముగా నుదాహరింపవచ్చును. మహమ్మదీయ మహాకల్లోలము ఎగబ్రాకి వచ్చుదాక మతవిషయక హింస యిట్టిదనికూడ హిందూదేశమున ఎవ్వరును ఎఱుగరు. విదేశీయులు వచ్చి తమపై దానిని ప్రయోగించినప్పుడే హిందువుల కా అనుభవము పరిచితమైనది. క్రైస్తవచర్చిల నిర్మాణమున హిందువు లెంత తోడ్పడినది, క్రైస్తవులతో సహకరించుటకు వా రెంత సంసిద్ధత చూపినది, నేడుకూడ విస్పష్టముగ కానిపించుచుండును. రక్తపాత మెన్నడుగాని సంభవింపలేదు. హిందూదేశమున నుత్పన్నమైన అవైదిక మతములకుకూడ ఇట్టి గతియే పట్టెను. బౌద్ధమత మిందు కుదాహరణము. ఆమతము కొన్ని విషయములలో మహనీయమైనదే కాని, బౌద్ధమతమే వేదాంతమత మని భావించుట అర్థరహిత చర్య; క్రీస్తుమతమునకును "శాల్వేషన్ ఆర్మీ" (**Salvation Army** = రక్షణసేన) అను పేర బరగు దానికిని గల భేద మెట్టిదో గమనించువారి కీ భేదము తెలిసిపోవును. బౌద్ధమతమునందు శ్రేష్ఠములును, ఉదాత్తములును అగు విషయములు కలవు. కాని వానిని సురక్షితముగా కాపాడ జాలనివారి చేతిలో అవి చిక్కెను.

తత్త్వజ్ఞ శేఖరులకడ నుత్పన్నమైన అమూల్యభావరత్నములు వెంగలిమూకలచేతిలో పడెను. ఆ మూకలు వానిని ప్రచారము చేయసాగిరి. వారికి మహోత్సాహము, కొన్ని అత్యద్భుతభావములు, లోకహితాచరణమహాసంకల్పములు, కలిగియుండెను. కాని వీని నన్నిటిని పదిలపఱుపవలె నన్నచో, మఱొకటి — విచారశక్తి, బుద్ధిబలము — కూడ ఆవశ్యకము. మహోత్కృష్టము లగు లోకోపకారభావములు పామరజనసమూహముచేత బడ్డప్పుడెల్ల దాని ప్రథమఫలము భ్రంశత్వ మనుట స్పష్టము. దేనినైనను క్షేమముగా నుంపగలవి పాండిత్యమును, బుద్ధిపాటవమును. మతప్రచారార్థము లోకసంచారమున కుపక్రమించిన మతములలో ఈ బౌద్ధమతమే మొదటిది. ఆ కాలమున నాగరికములని పేరొందిన ప్రపంచదేశము లన్నిటిలోనికి అది చొచ్చినది. కాని ఆ మతప్రచారోద్యమమున నొక్క రక్తపుబొట్టైనను చిందింపబడలేదు. చీనాదేశములో బౌద్ధమతప్రచారకులు హింసింపబడిరి, ఇద్దఱుముగ్గురు చక్రవర్తుల ఆజ్ఞచే వేనవేలు వధింపబడిరి. కాని ఆ పిదప బౌద్ధులకదృష్టకాలము వచ్చెను. అప్పటి చక్రవర్తి ఆ హింసకులను ప్రతిహింసచేయుదు ననెను. కాని బౌద్ధమతప్రచారకులు వలదనిరి. అదంతయు "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" — అతనినే ఇంద్రుడని, మిత్రుడని, వరుణుడని పేర్కొందురు — అను వాక్యముయొక్క ఫలము. కావుననే మిమ్మది జ్ఞప్తియం దుంచుకొండని నేను కోరునది.

ఈ వాక్య మెప్పుడు వ్రాయబడెనో ఎవ్వరును ఎఱుఁగరు. ఆధునిక పరిశోధకుల సిద్ధాంత మే మైనను, అది ఎనిమిది వేలేండ్ల నాఁటిదిగా నుండును; తొమ్మిది వేలేండ్ల నాఁటిదైనను కావచ్చును. ఆధ్యాత్మవిషయకములగు ఈ ఊహాలేవియు ఆధునిక కాలపువి కాకపోయినను, ఏమాత్రము ప్రాతఁబడక, రచనాకాలమున నెంత గుణవంతములుగా నుండెనో నేఁడును అంత గుణవంతములై యున్నవి — ఇప్పు డవి నవ్యతర ప్రభలతో విరాజిల్లుచున్న వనికూడ చెప్పవచ్చు నేమో. ఏలన ఆ మహాప్రాచీనకాలమున మానవుని కిప్పటి యంత నాగరికత లేదు; తన సోదరుని భావములు తన భావములకన్న కొంచెము భిన్నము లను హేతువుచే అతని గొంతు కోయుట నతఁ డప్పుడు నేర్వలేదు; భూలోకమును రక్తప్రవాహములలో ముంచివైచుట నభ్యసింపలేదు; స్వసోదరునియెడకూడ రాక్షసత్వము చూపుట నెఱుఁగఁడు; లోకోపకారార్థ మను పేర మానవవర్గములను బలిపెట్టువాఁడు కాఁడు. కావున ఈ పల్కులు — "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అనునవి — రచింపబడిన కాలమునకన్న ఇప్పు డధికతరగుణయుతములై, వినూత్న తేజోవిరాజితములై, మహత్తరములుగా, ప్రోత్సాహకరములుగా, ప్రాణప్రదములుగా, నేటికాలమున మనకు వినిపించుచున్నవి. సర్వమతములును, వానిపే రేమైనను — హిందూమతమో, బౌద్ధమతమో, మహమ్మదీయమతమో, క్రీస్తుమతమో, ఏదిగా నున్నను — ఒకే ఈశ్వరు నారాధించు ననియు, మనము వానిలో దేనిని పరిహసించినను, మన దేవునే

పరిహసించుచున్నా మనియు లోక మింకను నేర్వవలసి యున్నది.

వారి విచారపర్యవసాన మగు నిశ్చితార్థ మిది. కాని నే నింతకుముందే చెప్పినట్లు ఈ ప్రాచీనకాలపు ఏకేశ్వర భావము హైందవబుద్ధికి సంతృప్తికరముగా తోపలేదు; కుంటువడి నడిత్రోవలో ఆగిపోయిన ట్లుండెను. దృశ్య ప్రపంచపు ఉనికికి అందు సమాధానము లభింపలేదు. జగత్తును పరిపాలించువాడు — అందులో, దాని వెలుపల నిలిచి పరిపాలించువాడు — జగత్తుయొక్క ఉనికికి కారణము వివరింపగలడా? ఏ మాత్రమును వివరింపజాలడు. జగత్తున కతడు నైతికమార్గదర్శిగా నుండవచ్చును; జగత్తులో అంత శక్తిమంతు డింకెవ్వరును లేకపోవచ్చును. కాని జగత్తుయొక్క ఉనికి కది వివరణము కాజాలదు. అప్పుడు వెలువడి మహోన్నతరూప మొందిన కానవచ్చుచున్న ప్రప్రథమప్రశ్న జగద్విషయకమైనదే: "ఈ జగత్తు ఎచ్చటినుండి వచ్చినది?", "ఎట్లు వచ్చినది?", "ఎట్లు ఉనికిని దాల్చియున్నది?" ఈ విషయమునుగూర్చిన ఋక్కు లనేకములు కలవు. ఒక విస్పష్టాకారమును దాల్చుటకగు పోరాటము వాని యన్నిటి యందును కలదు. కాని ఈ క్రింది భావము గల ఋక్కు వాని యన్నిటికన్న కవితాభావసమున్నతి గలిగి, అత్యద్భుత వాగ్రూపము గలిగి తేజరిల్లుచున్నది:

"అప్పుడు అస్తిత్వముగాని, అనస్తిత్వముగాని లేదు; వాయువు లేదు, ఆకసము లేదు, మఱేదియు లేదు; సర్వ మును ఏది ఆవరించియుండెను? సర్వము ఎందు నిలిచి

యుండెను? అప్పుడు మరణము లేదు, మరణాభావము లేదు; రాత్రిగా మారుట లేదు, పగలుగా మారుట లేదు". మూలముననుగల కవితారామణీయకత మీ యనువాదమున నెంతో లోపించినది. "అప్పుడు మరణము లేదు, మరణాభావము లేదు. రాత్రిగా మారుట లేదు, పగలుగా మారుట లేదు" అను భావమును ప్రకటించు సంస్కృతశబ్దజాలమే మధుర గానమువలె శ్రావ్యమై యున్నది. —"ఈశ్వరుని ఉనికి నావరించియో అన్నట్లు 'అది' ఉండినది — ఆ ప్రాణము; కాని అది సంచలింప నారంభింపలేదు". 'అది' సంచలింప నారంభింపలేదు అను భావము నొక్కి దానిని జ్ఞప్తియందుంచుకొనుట మంచిది. ఏలన, విశ్వోత్పత్తివిధానమున ఈ భావము మరల ఘటమరించును. హిందూతత్త్వశాస్త్రప్రకార మీ జగత్తంతయు కంపనరాశి వంటిది — సంచలనమయము. అప్పుడప్పుడు కొంత తడవు ఈ సంచలనరాశి యంతయు అణగిపోయి, క్రమాధికసూక్ష్మత నంది, ఆ దశయందు కొంత కాలము నిలిచియుండును. ఆ దశయే ఈ ఋక్కులో వర్ణింపబడియున్నది. ఆ పదార్థము నిశ్చలరూపమున, కంపనరహితమై, నిలిచియుండెను. ఈ సృష్టి ప్రారంభమైనప్పుడది మరల కంపింప సాగెను. దానిలో నుండి — ప్రశాంతము, అనన్యాధారము, సర్వాతీతము, అగు ఆ ఏకైకప్రాణములో నుండి — ఈ సృష్టియంతయు వెలువడెను.

"ఆదియందు అంధకార ముండెను". ఈ మాటలలో గల గాంభీర్యవైభవమును హిందూదేశముననో, మత్తే

యితర ఉష్ణదేశముననో, నివసించి అచటి క్రొక్కారు ముసురుపట్టుటను చూచినవారు గాని పూర్తిగా గ్రహింప జాలరు. దీనిని చిత్రించుటకు ముప్వురు కవులు చేసిన ప్రయత్నములు నేనెఱుగుదును. "తేజోరాహిత్యము, రూపొందిన అంధకార మనవచ్చును" అని మిల్టన్ పలికెను. "సూచీభేద్య" మగు (సూది చొరనగు) అంధకార మని కాళిదాసు పలికెను. కాని "చీకటిలో మాటువడిన చీకటి" అనెడు వేదవర్ణనమున కివి దీటురావు సరేగదా, సమీపింపనుగూడ జాలవు. అంతయు వేగి, తుకతుకలాడుచున్నది. సృష్టి యంతయు మండిపోవుచున్న ట్లున్నది. ఎన్నాళ్ల నుండియో ఇదేస్థితి. ఇట్లుండగా నొక యపరాహ్ణకాలమున దిఙ్మండలముపై నొక చిఱుమచ్చ బోలు మబ్బుతునుక చూపట్టెను. అఱగంటయైన కాకమునుపే అది భూతలము నంతయు క్రమ్ముకొని, అదంతయు మేఘావృత మైనట్లు — మబ్బుపై మబ్బు నిలిచియున్నట్లు — కానిపించి, భయంకర రూపమగు — భూమినంతటిని వెల్లువలలో ముంచివైచు — జడివాన కురియనారంభించెను. సృష్టికి సంకల్పము (will) కారణ మని చెప్పబడినది. మూలపదార్థము సంకల్పముగా మాఱినది. అది భావికాలమున ఇచ్ఛా (desire) రూపమున వ్యక్తమగును. ఇది కూడ మనము జ్ఞప్తిపెట్టుకోవలెను. ఏలన, ఇచ్ఛాభావమే మనకుగల సర్వమునకును కారణ మని చెప్పుదురు. ఈ సంకల్పభావమే బౌద్ధ వేదాంత మతములు రెంటికిని మూలాధారము. అనంతరకాలమున అది జర్మన్ తత్త్వవిచారములోనికి చొచ్చి షోపెన్‌హోర్

(Schopenhauer) ప్రతిపాదించిన తత్త్వసిద్ధాంతమున కాధారభూత మయ్యెను. ఈ క్రింది భావముగల ఋక్కునం దని ప్రప్రథమమున కానిపించుచున్నది :

"మనస్సునకు మూలబీజ మగు ఇచ్ఛ ప్రథమమున నుద్భవించెను. ఋషులు జ్ఞాన తేజోమూలమున తమ హృదయములను పరిశోధించికొని, అస్తిత్వనాస్తిత్వములకు గల సంబంధమును కనిపట్టగలిగిరి."

ఇది మిక్కిలి అసాధారణవాక్యము. కవి "ఒకవేళ 'అతడు'కూడ ఎఱుఁగడేమో" అను మాటలతో దీనిని ముగించుచున్నాడు. ఈ ఋక్కు కవితారూపరామణీయకత కలిగియుండుటేగాక, జగత్తునుగూర్చిన విచార మప్పటికే కొంత విస్తీర్ణత నొంది, విస్పష్టరూపమునకు వచ్చిన దనియు, ఆ ఋషుల బుద్ధి సమాధానాభాసములచే తృప్తినొందజాలని వికాసము నార్జించియుండెననియు, విదితము చేయుచున్నది. పై నెచ్చటనో యొక పరిపాలకుఁడు కలఁడను భావముకూడ వారి కసమ్మతముగనే ఉండెను. ఇంక ననేక ఋక్కులలోకూడ ఇదే సమస్య — ఈ సకలమునకు కారణభూతమైన దేది అను సమస్య — కానిపించుచున్నది. జగత్పరిపాలకసమస్యను పరిష్కరించు ప్రయత్నములో — అనగా సగుణదైవమును కనుగొనుటలో — వేలుపుల నొక్కక్కరినిగా కైకొని, వారి కా యున్నతపదవిని కల్పించుచుండినట్లే, ఇప్పుడిచట నొక్కొక్క ఋక్కులో నొక్కొక్క భావమునుకైకొని, దాని కనంతవిస్తృతి కల్పించి, జగత్తులో

గల సర్వమునకు దానినే కారణభూతముగా నొనర్చుట కానిపించుచున్నది. సర్వము ఉండుటకును, నిలుచుటకును, ఆధారభూతముగా నొక భావము కైకొనబడును. ఆ ఆధార భూతవస్తువే ఈ సమస్తముగా నగును. అనేక భావముల విషయములో నిట్లే జరిపిరి. అందొక్కటి ప్రాణభావము. దానికి వారు విస్తరణము కల్పించుచు పోయి పోయి, చివరకు దానిని విశ్వమయముగా, అనంతముగా, నొనర్చిరి—సర్వ మున కదియే ఆధారము; మానవశరీరమునకుమాత్రమే కాదు; సూర్యచంద్రులందు ప్రకాశరూపముగా కానిపించున దదియే; చలనశక్తిరూపమున చూపట్టున దంతయు అదియే; అదియే విశ్వాత్మక మగు చలనశక్తి. ఈ యెత్తుగడలలో కొన్ని అత్యంతమనోహరములు, కవితారామణీయక మయములు. అందులో కొన్ని — "అతడు ప్రాతఃకాల సౌందర్యమును ప్రవేశపెట్టు ప్రతీహారి" మొదలగునవి — భావచిత్రణపరమావధి నంది అద్భుతావహములుగా నుండును. పిదప ఈ ఇచ్ఛనే — సృష్టికి మూలబీజమై యుద యించినట్లు చెప్పబడిన ఈ ఇచ్ఛనే — విరివి చేసి చేసి, చివర కదియే సర్వేశ్వరుడుగా అగునట్లొనర్చిరి. కాని ఈ భావము లేవియు సంతృప్తికరములు కాకపోయెను.

ఇచట భావమును మహోత్కృష్టమొనర్చి, చివరకు దాని కొక భావమయరూపము కల్పింతురు. "ప్రప్రథమ మున 'ఆత్మ' యొక్కడే ఉండెను. ఉనికిగల సర్వమున కతడే ప్రభువు. విశ్వమున కతడే ఆధారము. ఆత్మలను నిర్మించిన

వాడు, బలమును ఇచ్చినవాడు, వేలుపు లందఱచేత ఆరాధింపబడువాడు. జీవమును నీడగా కలవాడు, మరణమును నీడగా కలవాడు: అతనిని గాక మనము మఱెవ్వరిని పూజింతుము? హిమాలయపర్వతముల ప్రాలేయశిఖరములును, అపారపారావారములందలి జలరాసులును అతని తేజోవైభవమునే ప్రకటించుచున్నవి". ఇట్టి కీర్తనము లింకెన్నియో కలవు. కాని నేనిప్పటికే చెప్పినట్లివి సంతృప్తి నీయఁజాలకపోయినవి.

పిదప నొక మిక్కిలి అపూర్వమైనస్థితి యేర్పడెను. అప్పటివఱకు ఆర్యుల బుద్ధి తన సమస్యాసమాధానమునకై బాహ్యలోకమున వెదకుచుండెను; తా మెఱుగు సర్వవస్తువులను — సూర్యచంద్రనక్షత్రాదులను—పరికించి, అట్లు లభించు సత్యమును గ్రహించెను. ప్రకృతి యంతయు విశ్వపరిపాలన మొనర్చు నొక మూర్తిని మాత్రమే ప్రతిపాదింపగలిగెను. అంతకుమించి అది పోజాలకపోయెను. బాహ్యప్రపంచమునుండి నిర్మాతృభావమున కతీత మగున దేమియు ప్రాప్తింపలేదు. ఇదియే "పరికల్పన" సిద్ధాంతము (**Design theory**). ఇది అంతగా యుక్తియుక్త మగు భావము కాదని మన మందఱ మెఱుగుదుము. కేవల మపరిపక్వమై, శైశవదశయం దుండువారికిమాత్రమే అర్హమైన భావ మది. కాని బాహ్యప్రపంచమునుండి — దాని కొక నిర్మాత యుండవలెనను స్వల్పభావముతప్ప — ఈశ్వరునిగూర్చి అంతకన్న ఉన్నతి మగు భావము నార్జింపశక్యముకాదు. కాని జగత్తు యొక్క ఉనికి కిది సమాధాన మగునా? జగన్నిర్మాణ

మునకు వలయు సామగ్రి యంతయు అతనికి లభించెను — ఈ సామగ్రి యంతయు అతని కావశ్యకమై యుండెను. అనగా, అత డీ సామగ్రిపై ఆధారపడవలసినవా డయ్యెను. ఈ సామగ్రి దొరకనిచో, అత డీ నిర్మాణము నొనర్చి యుండ జాలడు. ఇది తీవ్రమగు ఆక్షేపణ. ఎట్లన, ఈ పరికల్పన సిద్ధాంతముచే ప్రతిపాదింపబడిన ఈశ్వరు డొక శిల్పి యగును. అంతకన్న నధికుడు కానేరడు. ఆ శిల్పియు సర్వస్వాతంత్రుడు కాడు. సామగ్రిపై ఆధారపడిన శిల్పి. ఇదంతయు వారి కిప్పటికే తెలిసియుండెను. ఇతరు లనేకుల బుద్ధి అంతటితో సంతృప్తినొందియుండును. ఇతర దేశములలో ఇట్లే జరిగెను; మానవబుద్ధి అంతటితో ఆగక, తత్త్వవిచారపరులును, అవగాహనశక్తిగలవారును, అగువారు ఇంకను పురోగమింపజూచిరి; కాని మందబుద్ధులై వెనుకజిక్కియున్నవారు వారి గమనమును సాగనీయక నిరోధించిరి. ఈ హిందూఋషులన్ననో, అట్టి నిరోధప్రయత్నములకు లొంగువారు కారు. సమస్యను సంతృప్తికరముగా పరిష్కరింపవలె నని వారు పట్టుపట్టిరి. ఆ ప్రయత్నమున వారు బాహ్యప్రపంచపరిశీలనను విడనాడి, ఆంతరప్రపంచపరిశీలనకు కడగిరి. మన కీ బాహ్యప్రపంచ మెఱుకపడుటయు, ఆస్తికధర్మభావ మేర్పడుటయు, మన కన్నుల మూలముననే, తక్కిన బాహ్యేంద్రియముల మూలముననే కాదనియు, తన్మూలము ఎఱుకపడ లేదనియు వారికి మొదటనే స్ఫురించెను. ఈ జ్ఞానలోపమును పూరించుకొనుట వారి ప్రథమకర్తవ్యమయ్యెను. ఆ లోపము భౌతికమును నైతికమునుకూడ నని యేర్పడెను. ఈ ఋషులలో నొక రిట్లు

పలికెను : ''ఈ జగత్కారణమును మీ రెఱుగరు. నాకును మీకును అపారమగు భావభేద మేర్పడినది. ఎట్లనగా, ఇంద్రియగోచరవస్తువులనుగూర్చియే మీరు మాటలాడుచున్నారు. అవియు విధ్యుక్తకర్మకలాపములును మీకు తృప్తి నిచ్చుచున్నవి. కాని నేను సర్వాతీతు డగు పురుషుని కనుగొంటిని.''

నేను మీ కిప్పుడు సూచింప బూనుకొనిన పారమార్థికభావపరిణామముతోపాటు కర్మకలాపపరిణామ మొకటికూడ సాగుచుండెను. కాని అది ఈ ఉపన్యాస విషయము కాదుగనుక, దానినిగూర్చి విస్తరింపక, ఒకటి రెండు మాటలుమాత్రమే చెప్పెదను. పారమార్థికభావముల కన్న కర్మకలాపభావము లెంతో అధికతరవేగముతో — ఇవి రెండింతలైన అవి ఇరువదింతలుగా — సాగుచుండెను. ప్రాచీనకాలపు వెఱ్ఱినమ్మకము లిప్పటికి భయంకరపరిమాణము గల కర్మకలాపముగా పరిణమించెను. అది క్రమక్రమముగా విజృంభించి హైందవజీవితవిధానము నంతయు క్రమ్ముకొని దానిని రూపుమాపు స్థితికి వచ్చెను. అది యిప్పటికిని నిలిచియే యున్నది. మన జీవితములోని ప్రతి స్వల్పాంశములోను అది ప్రవేశించి నెలకొనిపోయినది. తత్ఫలముగా మనకు ఆజన్మదాస్యము సిద్ధించినది. కాని అత్యంతప్రాచీనకాలమునుండియు ఈ కర్మకలాపవిజృంభణము నరికట్టుటకై పోరాటము జరుగుచునేయుండెను. కర్మకలాపనిషేధకుల వాద మిది : ''ఈ కర్మకలాపప్రీతి —

కొన్ని వేళలలో నొక్కొక్క విధమగు వస్త్రములు దాల్చుట, ఒక విధముగా భుజించుట: ఇట్టి బాహ్యావేషాడంబరములందు ప్రీతి — ఆస్తికధర్మమును కేవలబాహిరముగా నొనర్చు చున్నది. మీరు ఇంద్రియగోచరవిషయములతో సంతుష్టి నొంది, వాని కతీతతత్వము సాధింప గోరకపోవుటయే ఇందుకు కారణము''. మానవుల మగు మన కందఱికిని గల ఘోర సంకటమే యిది. పారమార్థికవిషయము లెంత ఆసక్తితో వినగోరువారి కైనను, ఇంద్రియములే ప్రమాణములై యుండును; దార్శనికసత్యములను గూర్చియు, ఈశ్వరుని గూర్చియు, లోకాతీతవిషయములను గూర్చియు, వినుటలో కొన్ని దినములు గడపిన పిమ్మట, వీనిచేత మన కెంత ద్రవ్యము లభించును, ఎంత ఇంద్రియసుఖము లభించును: అనియే మానవుడు విచారించుకొనును. ఇట్లు జరుగుట చిత్రముకాదు. ఇంద్రియసుఖమునే ఎఱుగు జనసామాన్య మింతకన్న ఏమి చేయగలుగును? కాని ఈ ఇంద్రియసుఖా భ్యాసమే మనకు సత్యము కాన్పింపక మఱుగువడియుండు కారణములలో నొకటి యని ఋషుల వాదము — కర్మ కలాపనిష్ఠ, ఇంద్రియభోగాసక్తి, వివిధసిద్ధాంతకల్పనము: ఇవియే సత్యమునకును మనకును నడుమ నొక తెరను సృష్టించినవి. మన పరిశీలనములో నిది యొక మహాఘట్టము. ఈ భావమే క్రమాభివృద్ధి నంది, అద్భుతరూప మగు వైదాం తికమాయాసిద్ధాంతముగా కాలాంతరమున రూపొందు టయు, ఈ తెరయే వేదాంతమున కానవచ్చు యథార్థ వివరణ మనియు, అనాదికాలమునుండియు సత్యము మన

కష్టములనే కలిగించు చుండెనియు, ఈ తెరవలననే మఱుగునబడి యుండెననియు మనము కనుగొననున్నాము.

కనుకనే ఈ ప్రాచీనకాలపు ఆర్య తత్త్వవిచారపరులొక క్రొత్త మార్గమున విచారింప నారంభించి రని మనకు తెలియుచున్నది. తమ సమస్యకు బాహ్యాలోకాన్వేషణముచే సమాధానము లభింప దని వారి కెఱుకపడెను — ఎన్ని యుగములకాలము బాహ్యాలోకమున వెదకినను నిష్ఫలమే. ఈ సత్యము తెలియుటతోడనే వారీ మార్గాంతరమును త్రొక్కిరి. ఈ క్రొత్త పరిశోధనలో, ఇంద్రియ వాంఛలును, కర్మకలాపాది బాహ్యవిషయవాంఛలును, తమకును సత్యమునకును నడుమ తెరను కల్పించిన వనియు, ఆ తెరను కర్మకలాపముచే ఛేదించుట అసాధ్య మనియు వారికి బోధపడెను. ఈ భావముయొక్క సత్యమును కనుగొనుటకు తమ మనస్సులే వారి కాధార మయ్యెను. మనస్సుయొక్క సూక్ష్మపరిశీలనము తప్ప గత్యంతరము కానరాదయ్యెను. బాహ్యప్రపంచపరిశోధనము నిరుపయోగ మయ్యెను గాన, అంతరప్రపంచముదెస వారు తమ దృష్టిని మరల్చికొనిరి. ఇదియే వేదాంతవిద్యకు ప్రారంభము — దానికి పునాది. ఈ విద్యయందలి విచార మంతయు ఆంతర లోకముననే అని మనకు తెలియవచ్చును. ప్రప్రథమము నుండియు వారిట్లు ప్రకటించుచుండి రని చెప్పవచ్చును: "సత్యముకై ఏ మతమునందును అన్వేషింపవలదు; అది ఇచ్చట — అద్భుతములలోనెల్ల అద్భుత మగు ఈ జీవాత్మయందు, జ్ఞానసర్వస్వనిధాన మగు ఈ జీవాత్మయందు —

ఇచ్చటనే కలదు. ఇక్కడ వెదకుడు". ఇచ్చట లేనిది అచ్చట నుండజాలదు. వెలుపట కానిపించునది లోనున్న దానికి మందప్రతిబింబమాత్రమే యని వారికి క్రమక్రమముగా ఎఱుకపడెను. 'ఈశ్వరుడు జగత్తు వెలుపల నుండి జగత్తును పరిపాలించుచుండును' అను పురాతనభావమును వారు కైకొని, ఆ యీశ్వరుని జగత్తులోపల నుంచిరి. వారు మొదట చేసిన కార్య మిదియే. అతడు వెలుపల నుండు దేవుడు కాడు, లోపల నుండువాడు; అచ్చటనుండి అతనిని తీసి తమ హృదయపీఠకల నాక్రమింపజేసిరి. ఇచ్చటనే, మానవహృదయమందే, అతడు — మన ఆత్మలకు ఆత్మయై, మనలోని సత్యపదార్థమై — నిలిచియుండును.

వేదాంతతత్త్వశాస్త్రప్రక్రియను చక్కగా అర్థము చేసికొనగోరువారు ఉదాత్తములగు కొన్ని భావములను గ్రహింపవలెను. మొదటి సంగతి 'క్యాంట్' (Kant) తత్త్వశాస్త్రము, 'హెగెల్' (**Hegel**) తత్త్వశాస్త్రము అనునప్పుడు మన భావమున నుండు తత్త్వశాస్త్రమువంటిది కాదది. అది ఒక్క గ్రంథముగాని, ఒక్కరిచేత రచింపబడినది కాని కాదు. వేర్వేఱు కాలములందు రచింపబడిన గ్రంథపరంపర యీ వేదాంత మనునది. ఆరచనలలో నొక్కదానియందే ఏబది వివిధవిషయము లుండుటయు కలదు. అవి యేదోయొక్క క్రమము ననుసరించి, ఒకే పద్ధతిప్రకారము, రచింపబడినవికూడ కావు. అందలి భావములు 'కొండగుర్తు' లవలె, జ్ఞాపకచిహ్నములుగా, వ్రాసియుంపబడిన మాటలవలె నుండును. కొన్నియెడల ఏవేవో కలగూరగంప

వంటి భావములనన్నియు నొక యత్యద్భుత భావము గాని పించును. కాని ఈ ఉపనిషద్భావములం దొక విశేషము కలదు — అవి ఎప్పుడును పురోగమించుచునే యుండెను. ఆ కాలపు అపరిపక్వరూప మగు భాషలో, ప్రతి ఋషియొక్క మనః ప్రచార మెట్లు సాగుచుండెనో. అది అట్లే చిత్రింపబడెను. వారి భావములు మొదటమొదట మిక్కిలి స్థూలములుగా నుండి, క్రమక్రమముగా సూక్ష్మములును, సూక్ష్మతరములును అయి, వేదముల చివరిభాగము చేరుసరికి పరమ లక్ష్యము నందుకొనుచుండును. ఈ పరమలక్ష్యమునకే వేదాంత మను పేరు వచ్చినది. ప్రప్రథమదశలందు అది దేవతల (తేజస్స్వరూపుల) కొఱకు చేయబడిన అన్వేషణము. పిదప అది ప్రపంచోత్పత్తినిగూర్చిన దయ్యెను. చివరకు ఆ అన్వేషణమే పూర్వముకన్న తాత్త్వికమును, పూర్వము కన్న విశదతరమును అగు మఱొక పేరు నార్జించుకొనెను. సర్వమూలమగు ఏకైకపదార్థమే — ఎవని నెఱిగినచో, తదితర మంతయు ఎఱుకపడునో అట్టివాడే — ఇప్పుడా అన్వేషణమునకు పరమ లక్ష్యము.



# హిందూమతము :
# దానిలోని సర్వసమ్మతమూలభావములు*

పావన మగు ఆర్యావర్తములోకూడ పరమపావనముగా నెన్నబడుచుండిన భూమి యిది. మహామహు డగు మన మనువు 'బ్రహ్మావర్తము' అని పేర్కొనిన దీ భూమినే. కాలాంతరమున ప్రపంచమం దంతటను వెల్లివిరియనున్న ఆత్మాన్వేషణమహోద్యమము ఈ భూమినుండియే ఉత్పత్తి యైనది. ఈ భూమియందు మహానదులవలెనే పారమార్థికోద్యమములుకూడ నుద్భవించి, సమ్మేళన మొంది, ఉదగ్ర బలాన్వితములై, సకలదిగంతపర్యంతము ప్రపంచములో వ్యాపించి, మేఘగర్జారావముతో తమ సందేశము లోకమునకు చాటినవి. హిందూదేశముమీదికి శత్రువులు దాడి వెడలి వచ్చినప్పు డెల్ల ఆ ధాటీప్రఘాతములకు ప్రథమమున మారొడ్డి నిలుచు భారమును ఈ భూమియే వహింపవలసి వచ్చెడిది. ఆర్యావర్తముపై కెత్తివచ్చు మ్లేచ్ఛకిరాతాది దురాక్రితముల వేటుపోటుల కీ ధీరభూమిలోని దండిమగల వక్షఃప్రదేశములే మొదట గుఱికావలసి వచ్చెడివి. ఇట్లెన్ని సార్లో ఘోరహింసల ననుభవించియు, ఈ భూమి యిప్పటికిని తన యశోవైభవమును, తన బలమును పూర్తిగా కోలుపోలేదు. కాలాంతరమున ఇచ్చటినుండియే సాధుమూర్తి

* 1897 వ సంవత్సరమున లాహోరులో నొసగబడిన ఉపన్యాసము.

నానక్ మహాశయుడు, అత్యద్భుతరూపమగు తన ప్రపంచ ప్రేమభావమును బోధించెను. ఇచ్చటనే ఆయన విశాల హృదయము వికసించి, హైందవప్రపంచమునేకాక మహమ్మదీయ ప్రపంచమునుకూడ ప్రేమాలింగన మొనర్చుకొనుటకు ఆయన బాహువులు చాపబడెను. మన హైందవపురుష శేఖరులందు అగ్రస్థానము నాక్రమించిన చివరివారిలో నొక డగు గురుగోవిందసింగు ఈ భూమియందే నిజమతోద్ధరణార్థము తనయొక్కయు, తన ప్రియతములయొక్కయు, రక్తపాతమున నోర్చి, ఎవరికై తానట్టి ఘోరహింసలపాలయ్యెనో వారు తన్ను విడనాడినను, తన దేశీయుల నేమాత్రము దూరక, అసంతుష్టివాక్య మొక్కటైనను పలుకక, దక్షిణాపథమున కేగి, హృదయము వ్రీలిన మృగరాజమువలె ప్రాణములు విడిచెను.

పంచనదీక్షేత్రపుత్త్రులారా, నేను మీయెదుట ఈ పురాతనభూమియందు నిలుచుట గురుపదవి నాక్రమించి కాదు. అల్పజ్ఞుడ నగు నేనితరుల కేమి బోధింపగలను? ప్రాక్పశ్చిమరాష్ట్రవాసుల మగు మనకు పరస్పరకుశల ప్రశ్నావకాశము కల్పించుకొఱకును, మన భావముల నొకరి నొకరు కనుగొని ఉపకృతినొందుటకొఱకును, నే నిచ్చటి కేతెంచినది. మనకు గల పరస్పరభేదభావములను తెలిసికొనుటకై కాదు నా రాక; మన భావములందు గల సామాన్యక్షేత్రమును కనుగొనుటకై. ఏ క్షేత్రమునందు మనసోదరత్వము శాశ్వతమై నిలుచునో, అనాదికాలము

నుండియు వినవచ్చుచుండు సనాతనవాణి ఏ పునాదులపై నిలిచినచో క్రమాధికబలము చేకూర్చుకొని స్పష్టతరము కాగలదో, కనుగొనజూచుటే నా యిప్పటి ప్రయత్నము. నేనిప్పుడు సూచింప నెంచిన కార్యకలాపము అభ్యుదయ సాధనరూపమైనది గాని విధ్వంసనరూప మైనది కాదు. ఖండనరూపవిమర్శ లావశ్యకమై యుండిన దినములు గడచి పోయినవి. అభ్యుదయసాధక కార్యక్రమములకై మన మిప్పుడు వేచియున్నాము. ఖండనరూపవిమర్శలు — ఒక్కొకతడవ అతితీవ్రమైనవి కూడ—లోకమునకు కావలసి యుండును. కాని ఇది కొన్ని విశేషసందర్భములందు మాత్రమే. అనంతకాలమున కుపకరించు కార్యక్రమము పురోగమనరూపమైనదియు, నిర్మాణరూపమైనదియు గాని ఖండనరూపమును విధ్వంసనరూపమును అయినది కాదు. ఈ నూరేండ్లుగా మన దేశ మంతయు ఖండనరూపవిమర్శలతో నిండి పొరలిపోయినది; పాశ్చాత్యవిజ్ఞాన తేజోరాశి యంతయు మన కలంకములపై స్వేచ్ఛావిహార మొనర్చినది. తత్ఫల ముగా మన మూలుమూలలును, బొజియలును సర్వాధిక ప్రాముఖ్య మందినవి. అట్టిచో, సత్యానురక్తితోను, ధర్మానురక్తితోను, దేశానురక్తితోను — అన్నిటికన్న అధికముగా, స్వమతానురక్తితోను, ఈశ్వరానురక్తితోను — తొనకులాడు హృదయములు గల మహత్తరబుద్ధివైభవ సంపన్నులగు మహామహులు దేశములోని సర్వప్రాంతముల నుండియు లేచి నిలిచి కాన్పించుట విచిత్రమా? అగాధప్రేమ పరిపూర్ణులగుటచే వారి కిందువలన కలిగిన మనోవేదనయు

దుర్భరమై, తమకు దోషము లని తోచినవాని నన్నిటిని వారు ఖండించిరి. ఆ మహామహుల కీర్తి శాశ్వతమై నిలుచు గాక! వా రెంతో మహోపకారము చేసిరి. కాని "చాలును!" అని ఇప్పటికాలము మనల నెచ్చరించు చున్నది. కావలసినంత విమర్శ, కావలసినంత రంధ్రాన్వేషణము, జరిగినది. పునర్నిర్మాణకార్య మారంభింపవలసిన కాల మిప్పుడు వచ్చినది. విచ్ఛిన్నములై పోయిన మన బలముల నన్నిటి నిక నొకటిగా కూర్చుకొనవలయును; వానిని కేంద్రీకరించి, ఏకముఖముగా ప్రవర్తించున ట్లొనర్ప వలయును. ఆ పిదప, పెక్కు శతాబ్దములుగా స్తబ్ధమై నిలిచి యున్న మన జాతిని మరల పురోగమనమార్గమున బెట్టి ముందుకు నడుపవలెను. ఇల్లు పరిశుభ్రపఱుపబడినది. అందిక పునర్నివాసము ప్రారంభింపబడుగాక. మార్గము చక్కపఱుపబడినది. ఆర్యవంశోద్భవులారా. ముందుకు సాగుడు!

ఇందుకొఱకే నే నిచటికి వచ్చినది. నేను ఏ ప్రత్యేక పక్షమునకు గాని, ఏ ప్రత్యేకశాఖకు గాని సంబంధించిన వాడను కాను అని ప్రప్రథముననే మీ కెఱిగింప గోరుదును. అవన్నియు ఘనమైనవే, అన్నియు మహనీయమైనవే అని నా అభిప్రాయము. అవన్నియు నాకు ప్రేమపాత్రములే. వానిలో శ్రేయస్కరములును, వాస్తవికములును, అగు విషయము లేవేవి కల వని విచారించుట నా యావజ్జీవకృషి. కావున నేడు నేను పూనుకొన్న కార్య మిది : మన మందఱి మంగీకరించియుండు విషయములు తెలుపుట : (తక్కినవాని

విషయమున) అంగీకారము కుదురు మార్గ మేదైన కల దేమో విచారించుట; ఈశ్వరకృపచే అది సాధ్యపడెనేని, దానిని భావక్షేత్రమునుండి కార్యక్షేత్రమునకు కొనిపోవుట. మనము హిందువులము. నే నిపుడు హిందూశబ్దమును వాడుట సదోషమగు అర్థమున కానేకాదు. ఆ శబ్దమునకు దోష యుక్తమగు అర్థము కలదని భావించువారితో నే నేకీభ వింపను. పూర్వకాలమున ఈ శబ్దమునకు 'సింధూనది యొక్క ఈవలివైపున నివసించువారు' అని యర్థ ముండెడిది. మనయెడ ద్వేషబుద్ధిగలవా రనేకులు నేడు దాని కొక దురర్థము కల్పించియుండవచ్చును. కాని పేళ్లలో నేమి కలదు? ఈ హిందూశబ్దము మహిమాఢ్యమగు సర్వమును, పారమార్థికమగు సర్వమును, తెలుపునట్లు చేయుట మన చేతిలో నున్నది; దాసానుదాసులై, నిరర్థకులై, మత భ్రష్టులై యుండువారిని సూచించు నిందారూపశబ్దముగా దానిని చేయుటయు మనచేతిలోనే ఉన్నది. హిందూశబ్ద మిప్పుడు అకీర్తికరమగు నర్థమున వాడబడుచుండెనేని, మీరు దానిని సరకుసేయ వలదు. ఏ భాషయైనను ఇంత కన్న మహోత్కృష్టభావము గల శబ్దమును కల్పింపజాల దని మన చర్యచే నిరూపించుటకు మనము సంసిద్ధులమై యుందముగాక. నా పూర్వికులకై లజ్జింపకుండుట నా జీవిత నియమములలో నొకటి. గర్వములో నన్ను మించినవా రెవ్వరును లోకమున పుట్టియుండరు. కాని ఆ గర్వము నాకొఱకై కానేకాదు. అదంతయు నా పూర్వికులను గూర్చినదే. పూర్వచరిత్రమును చదివినకొలదిని, పూర్వ

కాలముపై నా దృష్టి పఱపినకొలదిని, ఈ గర్వము నాయందు వర్ధిల్లుచున్నది : నా నిశ్చితాభిప్రాయముల ననుసరించి ప్రవర్తించుటకు వలయు బలసాహసములు నాకు చేకూర్చు చున్నది : భూభూగర్భమునుండి నన్ను లేవనెత్తి, మహనీయులగు మన పూర్వులు నిర్దేశించిన అత్యుదాత్తమగు పదకమును ఆచరణరూపమున బెట్టు మహోద్యమమున నన్నుంచినది. ఆ పురాతనార్యవంశీయు లగు మీకును ఈశ్వరానుగ్రహము చేత అట్టి గర్వమే సిద్ధించుగాక ; మీ పూర్వికులమహోన్నతి యందు అట్టి పరిపూర్ణవిశ్వాసమే మీ రక్తములోనికి కూడ ఎక్కుగాక ; అది మీ జీవితములతో అవినాభావసంబంధ మొందుగాక ; అది కార్యశీలమై, జగత్తును మోక్షమార్గ మున నడుపుగాక !

మన జాతీయజీవనవైవిధ్యమున గల సామాన్యక్షేత్ర మును — మన మెల్లర మేకీభవించియుండు విషయమును — నిర్ణయింప జూచుటకు ముందు, మన మొక సంగతిని జ్ఞప్తి పెట్టుకోవలయును : ప్రతి మానవునియం దొక ప్రత్యే కత్వ మెట్లుండునో, అట్లే ప్రతి జాతియందుకూడ నొక ప్రత్యేకత్వ ముండును. ప్రతివాడును కొన్నికొన్ని విషయము లందు ఇతరు లందఱికన్న భిన్నుడై, స్వకీయములగు కొన్ని విశిష్టలక్షణములు గలిగి ఎట్లుండునో, అట్లే ప్రతి జాతియు ఇతరజాతులకు లేని కొన్ని విశిష్టలక్షణములు కలిగియుండును. ప్రకృతియొక్క నిర్ణీతక్రమములో ప్రతివాడు నిర్వహింప వలసిన ప్రత్యేకపాత్రము ఎట్లేర్పడియుండునో, అతని పూర్వ కర్మ మతనికై యొక ప్రత్యేకమార్గమును ఎట్లేర్పఱచి

యుండునో, అట్లే జాతులవిషయము కూడ — ప్రతి జాతియు నొక విధినిర్దిష్టపాత్రమును నిర్వహింపవలసి యుండును; ప్రతి జాతియు లోకమున కొక సందేశము సేయవలసియుండును; ప్రతి జాతియు నొక కార్యమును సాధింపవలసియుండును. కావున మనజాతి సాధింపవలసిన కార్యమును; అది నిర్వహింపవలసిన విధినిర్దిష్టపాత్రమును; జాతుల పురోగమనమునందది ఆక్రమించుకొనవలసిన స్థానమును; జాతిసామరస్యవాద్యమున అది పాడవలసిన స్వరమును: మనము ప్రప్రథమమునుండియు గ్రహించియుండుట ముఖ్యము. కొన్ని సర్పముల పడగలందు మణు లుండుననియు, ఆ మణు లుండువఱకు సర్పములను ఏమి చేసినను, చంపుట సాధ్యము కాదనియు, మనము చిన్ననాడు కథలలో వినియుందుము; కొందఱు రాక్షసులయొక్క ప్రాణములు చిన్నపక్షులలో నిలిచియుండు ననియు, ఆ పక్షులు సజీవములై యుండువఱకు రాక్షసులను లోకమునగల యెట్టి శక్తియు పరిమార్పజాలదనియు, వినియుందుము; వారిని తుంటెతుంటెములుగా ఖండించినను, మ రేమి చేసినను, వారికి హాని లేదు. ఇది జ్ఞప్తి పెట్టుకొనినచో, ప్రపంచచరిత్రమందలి అత్యద్భుతసంఘటన మొకదానిని మనము గ్రహింపగలుగుదుము. మ్లేచ్ఛకిరాతవిజయయాత్రలు మన యీ యభాగ్యభూమిపై తరంగపరంపరాకృతితో ప్రవహించినవి. శతాబ్దముల తరబడిగా "అల్లాహో అక్బర్!" నినాదములు మింటిని ప్రేల్చినవి; ఏ క్షణము తన్ను మృత్యు వెదుర్కొనునో హిందు వెవ్వడును ఎఱుగజాలకుండెను. ఇట్టి ఘోరాపదల

పాత్రైనదియు, ఇట్టి దాస్య మనుభవించినదియు, అగు దేశము ప్రపంచచరిత్రమందు ఇంకేదియు లేదు. ఐనను మనము ఇప్పటికిని, ఇంచుమించు పూర్వకాలపు జాతిగనే నిలిచి, నూతనవిపత్కల్లోలముల నన్నిటినైన నెదుర్కొన సంసిద్ధులమై యున్నాము! అంతే కాదు. ఇటీవల కానవచ్చు కొన్ని చిహ్నములనుబట్టి మనము బలిష్ఠులమై యుండుటే కాక విస్తరిల్లుటకుకూడ సంసిద్ధులమై యున్నామనియు స్పష్ట మగుచున్నది! విస్తరిల్లుటేగదా జీవచిహ్నము.

నేడు మనసిద్ధాంతములును, భావములును, హిందూ దేశపు సరిహద్దులలోపలనే అణగియుండుటలేదు. మనకు ఇష్టమున్నను లేకున్నను, అవి దేశాంతరములలోనికి చొచ్చి పరిక్రమించుచున్నవి. ఇతర దేశవాఙ్మయములలోనికి వాని సారము దిగిపోవుచున్నది. అందు కొన్నిటిలో వానికి నిరం కుశాధికారపదవికూడ చేపడుచున్నది. ఇందుకు కారణ మారయగా, ప్రపంచాభ్యుదయసమష్టికి హిందూదేశము తన వంతుగా అర్పించిన భాగము — ఆ దేశమున గల తత్త్వ పారమార్థిక జ్ఞానము — తక్కిన దేశపు సమర్పణము లన్నిటికన్నను మహోత్కృష్టము, మహోజ్జ్వలము, మహోదాత్తము అయియుండుటే అని విదిత మగుచున్నది. మన పూర్వు లితరవిషయములుకూడ పరీక్షించిరి. ఇతర జాతులవలెనే వీరుకూడ బాహ్యప్రకృతియందు గల రహస్య ములను భేదించి బహిరంగపఱుప జూచిరి. ఆ అద్భుతజాతి యొక్క మహత్తరబుద్ధివైభవము—ప్రపంచ మిప్పటికిని కల

లోనైన ఊహింపజాలనట్టి — విచిత్రఫలములను ఆ మార్గమున సాధించియుండును. కాని వా రా మార్గమును విడనాడి అంత కన్న ఉన్నతమగు విషయములో ప్రవేశించిరి. "ఆ నిర్వి కారుని మన కెఱుకపఱచునదే విద్య లన్నిటిలో ఉత్తమ మైనది" అని వేదములలో ఘంటాఘోషముగా ప్రకటింప బడిన విషయమందు వారు ప్రవేశించిరి. ఎప్పుడును మార్పు లొందుచు, అదృశ్య మగుచుండు ప్రకృతియొక్క — మరణ ముతో, శోకముతో, పరితాపముతో, నిండియున్న లోకము యొక్క — తత్త్వమును తెలుపు శాస్త్రము శ్రేష్ఠమైనదిగా —మహాశ్రేష్ఠమైనదిగాకూడ— ఉండవచ్చును; కాని ఎవడు మార్పుల కతీతుడో, ఎవడు నిరతిశయానందస్వరూపుడో, ఎవనియందుమాత్రమే శాంతి సుస్థిరనివాసము చేయుచుం డునో, ఎవనియందుమాత్రమే జీవము అనంతమో, ఎవని యందుమాత్రమే పరిపూర్ణత కలదో, ఎవనియందుమాత్రమే క్లేశమంతయు అదృశ్యమగునో, ఆ పరాత్పరుని తత్త్వమును తెలుపు శాస్త్రము సర్వాతిశాయియగు మహోత్కృష్ట శాస్త్ర మని మన పూర్వుల బోధ. ప్రకృతితత్త్వశాస్త్ర రహస్యములను — మనకు అన్నవస్త్రములనుమాత్రమే సమకూర్పగలవియు, మన సోదరమానవులపై అధికారము నెఱపుశక్తి నీయగలవియు, వారి నోడించి పరిపాలించు మార్గ ములు నేర్పునవియు, బలహీనుల నణగద్రొక్కుడని బల వంతులకు బోధించునట్టివియు, అగు భౌతికశాస్త్రరహస్య ములను — వారు కోరినచో అవలీలగా కన్గొనియుండగలరు. కాని భగవదనుగ్రహముచేత వారు వెంటనే రెండవపక్ష

మును — వీనికన్న అపారోదాత్తతరమును, అపారోన్నత
తరమును, అపారాధికానందప్రదమును అగు పక్షమును —
చేకొని, అది మన జాతికి విశిష్టలక్షణ మగు వఱకును;
వేనవేలేండ్లనుండి, తరములబడిగా, వంశపారంపర్యక్రమ
మున మన కది మూలధనరూపమున సంక్రమించుచుండువఱ
కును; దానికిని మనకును అవినాభావసంబంధ మేర్పడువఱ
కును; మన రక్తనాళములందు ప్రవహించు ప్రతి నెత్తుటిబొట్టు
లోనికి అది ఎక్కి సందడించువఱకును; అది మనకు స్వాభావ
సిద్ధమేయైనట్లు కానిపించువఱకును; హిందూశబ్దము, పారమా
ర్థికజీవనము అభిన్నములై పోవువఱకును: ఆమార్గమును పరిశో
ధించిరి. ఇదియే మన జాతి కిప్పుడు విశిష్టలక్షణ మైనది.
మనలో గల ఈ విశేషము ఇతరులు స్పృశించుటకుకూడ
అలవికానిది. మ్లేచ్ఛకిరాతాదుల ఖడ్గములు గాని, శతఘ్నులు
గాని, వారు కొనివచ్చిన అనాగరికమతభావములుగాని, మన
జాతియొక్క ఆయువు నిక్షిప్తపఱుపబడియుండు ఈ మూల
కేంద్రమును చేరజాలక పోయినవి: ఈ ''మణిని'' తాక
జాలకపోయినవి: ఈ ''పక్షిని'' చంపజాలకపోయినవి. కావున
ఇదియే మన జాతియొక్క ఆయువుపట్టు. ఇది సురక్షితముగా
నిలిచియుండువఱకు, ఈ లోకమున గల దేదియు మన జాతిని
చంపుట అసంభవము. మనకు పిత్రార్జితరూపమున సంక్ర
మించిన సర్వస్వములో నత్యుదాత్త మగు ఈ పారమార్థిక
నిధానమును మనము దృఢముగా పట్టుకొని యుండువఱకును,
లోకము పెట్టగల హింస లన్నియు, బాధ లన్నియు, మనకు
హాని కలిగించు సమర్థతలేక, నిర్వీర్యములై తొలగిపోవును;

ప్రహ్లాదునివలె మన మగ్నిజ్వాలలనుండి చెక్కుచెదరక బయలువెడలుదుము. పరమార్థదృష్టి లేని హిందువును నేను హిందువుగనే పరిగణింపను. ఇతర దేశములందు మానవుని దృష్టిలో చాలభాగము రాజకీయవిషయములపై నిలిచి, ఒక స్వల్పాంశము ఆధ్యాత్మికభావములమీఁది కరుగవచ్చును; కాని ఈ హిందూదేశమున పారమార్థికజీవితమునడపుటే మన ప్రప్రథమకర్తవ్యము; ఆ పిదప ఇంకేమైన అవకాశము లభించినచో, ఇతరవిషయములు వచ్చును. ఈ సంగతిని జ్ఞప్తియుంచుకొంటిమేని, మన జాతి అభ్యుదయమును సాధింపవలె నన్నచో, మనకుగల పారమార్థికశక్తుల నన్నిటిని మనము వెదకి సేకరించుట అత్యావశ్యకమని గ్రహింతుము. ప్రాచీనకాలమున ఇదే జరిగెను. భావికాలమునకూడ సర్వదా యిట్లేజరుగవలసియుండును. హిందూదేశమున జాతిసమైక్య మనగా చెల్లాచెదరై పడియుండు పారమార్థికభావముల నన్నిటిని పోగుచేయుట అనియే అర్థము. హిందూదేశమున జాతి యను మాటకు ఒకే పారమార్థికరాగమునకు తాళరూపమున నొకటిగాస్పందించు హృదయములు గలవారియొక్క కూడిక అనియే అర్థము.

ఈ దేశములో మతశాఖ లెన్నెని కలవు. అవి యిప్పు డుండుటేకాక భావికాలమునగూడ నుండితీఱును. మన మతములోగల యొక ప్రత్యేకలక్షణమే ఇందుకు కారణము: మన మతమునకు ఆధారభూతములగు సూత్రములు ఆకసమువలె విశాలములును, ప్రకృతివలె శాశ్వతములును అయినవి.

పిదప ఆ సూత్రముల కెంతో సూక్ష్మరూపవివరణము కల్పింపబడినను, సూత్రములలో గల వైశాల్యమువలన మతశాఖ లెన్నియో వాని యాధారముపై నుత్పన్నమగుట సహజమేకదా. కావున ఇచట శాఖాసంప్రదాయబృందము లుండియే తీఱవలెను; కాని, శాఖాసంప్రదాయవైరములు మాత్రము ఉండ నవసరములేదు. శాఖావైరములచే లోకమునకు శ్రేయస్సు చేకూరదుగాని, శాఖాబృందము లుండనిది లోకము పురోగమింప జాలదు. ఒకే శాఖకు చేరినవారి బృంద మేమియు నిర్వహింపజాలదు. లోకమున గల అనంత శక్తిరాశి నంతటిని ఒక స్వల్పమానవబృందము పరిపాలింప జాలదు. కార్యనిర్వహణము సమర్థముగా నుండుటకొఱకు కార్యవిభజన మొనర్చి, ఒక్కొక్కభాగము నొక్కరికి వశపఱచుట అవసరమయ్యె ననియు, కావుననే ఈ శాఖావిభజన మొనర్పబడెననియు మన కిప్పుడు స్పష్టపడుచున్నది. పారమార్థికశక్తుల ప్రయోగముకొఱకు శాఖ లుండుగాక. కాని మనము కలహింప నవసరమేమి? ఈ భిన్నత యంతయు పైకి కానిపించునదే కాని యథార్థము కాదనియు, వీని యన్నిటిలో దూఱి వీని నొకటిగా గూర్చు మనోహర సామరస్యసూత్ర మొకటి కలదనియు మన శాస్త్రములు ప్రకటించుచున్నవిగదా. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" (ఉన్నవస్తు వొక్కటే; దానినే ప్రాజ్ఞులు అనేక విధములుగా వర్ణింతురు) అని మన ప్రాచీనతమగ్రంథములే పలికినవి. కావున మొదటినుండియు సర్వమతములును గౌరవింపబడుచుండిన ఈ మన హిందూదేశమున శాఖావైరము

లున్నచో, ఈ శాఖలు పరస్పర కలహభావహేతువును చూపు
చున్నచో, అవి యొకదానియెడ నొకటికి అసూయా ద్వేష
ములు కలిగియున్నచో, ఆ తంత్రముల ననుసరించువార మని చెప్పు
కొను మన కిది అవమాన కారణము.

మన మందఱమును — వైష్ణవులమైనను, శైవుల
మైనను, శాక్తుల మైనను, గాణాపత్యుల మైనను, సంప్రదాయ
సిద్ధ వేదాంతమతావలంబుల మైనను, ఆధునిక వేదాంత
మతావలంబుల మైనను, నిష్కారణముగ నవ్యబద్ధ పూర్వసంప్ర
దాయములలో చేరినవార మైనను, ఆధునిక సంస్కారరూప
సంప్రదాయములలో చేరినవార మైనను — అందఱము
అంగీకరించు మహోదారసూత్రములు కొన్ని కలవనియు,
హిందూనామమును ధరించువా రందఱును ఆ సూత్రములను
విశ్వసింతు రనియు నా తలంపు. ఆ సూత్రముల వ్యాఖ్యాన
ములో, వాని వివరణములో, అభిప్రాయభేదములు కల
వనుట అందఱెఱిగిన విషయమే. ఇట్టి భేదము లుండియే
తీఱవలెను. అందుకు మన మాక్షేపింప రాదు. ప్రతివానిని
మన భావమునకే కట్టుపఱచియుంపవలె ననెడి నియమము
మనకు లేదు. ప్రతివానిని మన వ్యాఖ్యానములనే అంగీకరింపు
మని, మన పద్ధతులనే అనుసరించి జీవింపు మని, బలాత్క
రించుట పాపకృత్యము. ఇందు ప్రథమసూత్రము 'వేదములు
సనాతనమత ధర్మములను బోధించును' అని. — ఈ విషయమున
నిచట కూడియుండు మన మందఱమును ఏకీభవింతు మను
కొందును. ఈ పవిత్ర వాఙ్మయము ప్రకృతితోపాటు అనాది

సిద్ధమై, అద్వ్యంతరహితమై వెలయుచున్న దనియు, తత్సా న్నిధ్యమున నిలిచినప్పుడు మన మతవిషయకకలహములు, మన మతవిషయకపరిశ్రమములు అంతమొంది తీఱవలె ననియు మన మెల్లరము విశ్వసింతుము. పారమార్థికభావ భేదవిషయమున తుది పరిష్కారము ఇందే లభించు ననియు మన మెల్లర మంగీకరింతుము. వేదములుగా పరిగణింప వలసినది వేనిని అను విషయమున మన దృక్పథములు భిన్నములై యుండవచ్చును. ఒక శాఖవా రొక వేదభాగ మును తక్కినవానికన్న పవిత్రతరముగా నెన్నుకోవచ్చును. కాని వేదనిధానమునకు మన మెల్లరమును సమానాధి కారము గల సోదరుల మనియు, మనకు నేఁడు గల శ్రేయ స్కరమును, పావనమును, పరిశుద్ధమును అగున దంతయు ఈ అద్భుతప్రాచీనసనాతనగ్రంథములలోనుండియే ప్రాప్తిం చిన దనియు పలుకు నంతకాలము ఈ స్వల్పభేదములు మనల నేమి చేయగలవు? కావున ఇదంతయు మనము విశ్వసింతు మేని, ఈ సూత్రము దేశములో సర్వదిగంతపరివ్యాప్త మగునట్లు ప్రకటింపబడు గాక. ఇది నిజమైనచో, వేదములకు సమర్హమగు ప్రాముఖ్య మీయబడుగాక. అనగా ప్రథమ స్థానము వేదములది. మన మందఱము విశ్వసించు రెండవ విషయము ఈ జగత్తు నెవడు సృష్టించునో, ఎవడు కాపాడు చుండునో, ఎవనిలోని కిది నియమితకాలపరిమాణానుసార ముగా లయించి, మరల కొంతకాలమున కీయద్భుతజగ ద్రూపమున గోచరించుచుండునో, ఆ ఈశ్వరునిగూర్చినది. ఈశ్వరు డెట్టివాడు అను విషయమున మనకు భావభేదము

లుండవచ్చును. కేవల మానవలక్షణోపేతు డగు ఈశ్వరు నొకడు నమ్మవచ్చును; మఱొకడు మానవలక్షణరహితు డయ్యును మూర్తిమత్త్వముగల ఈశ్వరుని నమ్మవచ్చును; ఇంకొకడు కేవల నిరాకారు డగు ఈశ్వరుని నమ్మవచ్చును. వీరందఱి భావములకును వేదములలోనే ప్రమాణము లభింప వచ్చును. ఇట్టి భేదభావము లున్నను, మన కెల్లరకును ఈశ్వరవిశ్వాసము కలదు. అనగా, ఒక అత్యద్భుత, ఆద్యంత, శక్తి కలదనియు, సర్వము అందునుండి ఉత్పన్న మైనదనియు, సర్వము అందే నిలిచియున్న దనియు, చివరకు సర్వము అందులోనే మరల చేరవలె ననియు విశ్వసింపని వాడు హిందూనామమున కనర్హుడు. ఇది సరియైనచో, ఈ భావమును దేశమం దంతటను ప్రచారము నర్చి బోధింతుముగాక. నీవు బోధించు ఈశ్వరు డెట్టివాడైనను కానిమ్ము; అది అప్రధానము. ఆ భేదభావములనుగూర్చి మనకు వివాదమువలదు; ఈశ్వరుని బోధించితివేని చాలును. ఆ భావములలోనొకటి మఱొకదానికన్న మంచిదిగా నుండ వచ్చునుకాని, అందేదియు చెడ్డదికా దని యెఱుగుడు. ఒకటి యోగ్యము, ఒకటి యోగ్యతరము, మఱొకటి యోగ్యతమము కావచ్చును. కాని అయోగ్యము అనునది మనమతముననే లేదు. కావున తమ కిష్టమగు ఏ రూపముతోనైనను సరే, ఈశ్వరనామమును బోధించువా రందఱిని ఈశ్వరు డనుగ్రహించుగాక! ఆ బోధ యెంత యధికముగా జరిగిన, అంత మన జాతికి శ్రేయస్కరము. ఆ భావము — ఈశ్వరనామమునకు సంబంధించిన భావము — శుష్క-

దరిద్రుల యిండ్లలోను, హీనాతిహీనులయిండ్లలోను, ధనికాగ్రేసరుల యిండ్లలోను, అత్యున్నతులయిండ్లలోను ప్రవేశించుగాక! మన బిడ్డలు ఈ భావమునందే పెంపబడుదురు గాక!

మీకు నేను నివేదింపబోవు మూడవభావ మిది: ఈ జగత్తు కొన్ని వేల సంవత్సరములక్రిందటనే కల్పింపబడె ననియు, ఎప్పుడో యొకనా డది శాశ్వతముగా అంతరించు ననియు ఇతరజాతులు విశ్వసించినట్లు మనము విశ్వసింపము. జీవాత్మయును, జగత్తును, శూన్యములోనుండి పుట్టింపబడె ననుటయు మనము విశ్వసింపము. ఈ విషయమునకూడ మన కందఱకు అంగీకారము కలదని నా తలంపు. ప్రకృతి ఆద్యంతరహితమైనదనియు; కాని నియమితకాలపరిమాణా విధేయమై ఈ బాహ్యప్రపంచపు స్థూలపదార్థము తన పూర్వపు సూక్ష్మతరాకృతి నందు. ఆ స్థితియందు కొంత కాలము నిలిచియుండి, మరల ప్రక్షిప్తమై, ప్రకృతినామమున బరగు అనంతనానాత్వముగా గోచరింప నారంభించుచుండు ననియు; ఈ తరంగరూపగమనము అనాదిసిద్ధమై, శాశ్వతరూపమై, అనంతకాలపర్యంతము సాగుచుండు ననియు: మన విశ్వాసము. మఱొకటి. మానవుడు కేవల స్థూలశరీరమాత్రుడు కా డనియు, ఈ స్థూలశరీరములో మన కున్నెడు సూక్ష్మశరీర మొకటి కలదనియు; దానిలోపల, అంతకన్న మహితమైన వస్తు వింకొకటి — ఈ మనశ్శరీరములవలె మార్పుల నొందకుండునది, ఈ రెంటికి అతీతమైనది — జీవాత్మ యనునదికూడ కలదనియు; దాని కాద్యంత

ములు లేవనియు; అది మరణ మను మాటనే ఎఱుగదనియు:
హిందువు లందఱు విశ్వసింతురు. ఇంకొకటి. ఈ ఆత్మ
మోక్ష మంది, ఇక జన్మింపవలసిన అవసరములేని స్థితికి
వచ్చువఱకు, ఒక శరీరముపిదప మఱొకశరీరమును దాల్చు
చుండు నను అసాధారణభావ మొకటి మనకు కలదు. ఈ
భావము లోకమున మ ఱే ఇతరజాతివారికిని లేదు. ఇది
మన శాస్త్రములు ప్రకటించు సంసారసిద్ధాంతము, ఆత్మల
యొక్క నిత్యత్వమునుగూర్చిన సిద్ధాంతము. మనలోని వివిధ
శాఖలవారు ఏకగ్రీవముగా అంగీకరించు విషయములలో ఇది
యొకటి. ఆత్మకును ఈశ్వరునికిని గల సంబంధవిషయములో
మన భావములు భేదింపవచ్చును. ఒక మతముప్రకారము
ఈశ్వరుడును ఆత్మయును సర్వదా భిన్నవస్తువులు;
మఱొకమతప్రకారము ఆ అనంతవహ్నిలో ఇది యొక
కణము; వేఱొక మతప్రకారము రెండును అభిన్నములు.
కాని, ఆత్మ ఆద్యంతరహితము; పుట్టుకలేనిది గనుక దానికి
మరణమునైతము ఉండనేరదు; అది మానవశరీరము నొంది
పరిపూర్ణత సాధించుకొనువఱకు ఇతరశరీరము లనేకములను
పరిణామక్రమమున ధరించుచుండును: అను మూలభావమునకు
హానిలేనిచో, ఈ అభిప్రాయభేదములు గణనీయములుకావు.
ఈ మూలభావవిషయమున మన కందఱకు ఏకీభావము
కలదు. పారమార్థికక్షేత్రమందు మానవబుద్ధికి అందుపాటైన
సత్యము లన్నిటిలో మహోత్కృష్టమును, మహాద్భుత
మును అగుదాని కిప్పుడు వత్తము. మీలో పాశ్చాత్య
తత్త్వగ్రంథములు పఠించినవారు మనకును వారికిని గల

మఱొక మూలభేదమును — ప్రాక్పశ్చిమతత్త్వభావముల నొక్కప్రేటున ఖండించి వేఱుపఱచు నట్టిదానిని — ఇప్పటికే కనిపట్టి యుంటిమి. అది యేదనగా: మనము శాక్తుల మైనను, శైవుల మైనను, వైష్ణవుల మైనను — బౌద్ధులమో, జైనులమో అయిననుకూడ — హిందువుల మందఱమును ఆత్మ స్వతస్సిద్ధముగా పరిశుద్ధము, పరిపూర్ణము, అనంతశక్తి సమన్వితము, ఆనందమయము అని నమ్ముదుము. ద్వైతుల మయినచో, ఆత్మయొక్క నైసర్గికానందము పురాకృత కర్మఫలముగా సంకుచిత మయ్యెననియు, ఈశ్వరానుగ్రహము లభించినయెడల అది మరల వికసించి తన పరిపూర్ణతను వ్యక్తపఱచు ననియు తలంతుము; అద్వైతుల మైనచో, ఈ సంకోచభావమే అంతగా సరికాదనియు, ఆత్మ పరిపూర్ణ తేజోవంతమై ప్రకాశించుచున్నను, మాయావరణకారణ మున శక్తిని కోల్పోయినట్లు మనకు తోచుచున్న దనియు తలంతుము. ఈ భావభేదము లెట్లున్నను, మన కందఱకును ఏకీభావముగల కేంద్రసత్యమునొద్ద నిలిచి చూచినచో, ప్రాక్పశ్చిమభావములనడుమ అపారమును,అగాధమును అగు సందు కానిపించును: ప్రాగ్దేశీయుడు మహితమును, శ్రేయ స్కరమును అగుదాని యంతటికై అంతరంగలోకమున అన్వేషించును; ఆరాధనకాలమందు మనము కన్నులు మూసికొని ఈశ్వరుని మనలోపల కనుగొనయత్నింతుము; పాశ్చాత్యుడు ఊర్ధ్వముఖుడై, ఈశ్వరుని తన వెలుపల కనుగొన యత్నించును; పాశ్చాత్యులకు తమ మతగ్రంథ ములు ఈశ్వరప్రేరితులచే వ్రాయబడిన వని నమ్మకము;

మనకు మన వేదములు ఈశ్వరునుండియే — ఉచ్ఛ్వాస రూపమున — వెలువడి, మంత్రద్రష్టలగు మహర్షుల హృదయములద్వారా వచ్చిన వని నమ్మకము.

మిత్రులారా, సోదరులారా, ఇది మనము అవగత పఱచుకోవలసిన మహత్తర విషయము. ఈ విషయమును గూర్చి మన మెప్పటికిని పట్టుపట్టియే యుండవలెను. ఇది నా నిశ్చితాభిప్రాయము — మీరుకూడ ఈ ముఖ్యవిషయ మును గ్రహింతురుగాక యని నా ప్రార్థన: తాను తుచ్ఛు డని రేయుంబవల్లు తలచుచుండువాడు దేనినిగాని సాధింప జాలడు. తాను నిర్భాగ్యు డనియు, అధము డనియు, తుచ్ఛు డనియు తలచువాడు తుచ్ఛుడే యగుట సిద్ధము. 'నే నొకడను కలను, నే నొకడను కలను, తప్పక నే నొకడను కలను' అని నీ వనుచున్నచో, నీవు తప్పక ఒక వ్యక్తిత్వము కలిగి నిలుతువు. అట్లుకాక 'నే నేమియు కాను' అని పలుకుచు, 'నే నేమియు కాను' అని తలచుచు, రేయుంబవల్లు 'నేను తుచ్ఛుడను' అను భావమునుగూర్చియే ధ్యానించుచుంటి వేని, నీవు తుచ్ఛుడవే అగుదువు. ఇదే మీరు జ్ఞప్తిపెట్టు కొని తీఱవలసిన మహత్తరవిషయము. మన మా సర్వశక్తి సంపన్నునియొక్క బిడ్డలము, ఆ అనంతదివ్యాగ్నియొక్క కణములము. మనము తుచ్ఛుల మగుదుమా? సర్వము మనమే, సర్వ మొనర్చుటకు మనము సంసిద్ధులము, సర్వ మొనర్చుటకు మనకు శక్తికలదు, మానవుడు సర్వము చేసి తీఱవలెను. మన పూర్వులకీ ఆత్మవిశ్వాస ముండెను. ఈ ఆత్మవిశ్వాసమే వారి నాగరికతామార్గపురోగమనమునకు

మూలకారణమై, వారిని ముందుకు ముందుకు నెట్టుచుండినది. అనంతరకాలమున మనకు క్షీణదశ ప్రారంభించుటకును, లోపము లేర్పడుటకును, కారణము ఆ ఆత్మవిశ్వాసమును మనము కోల్పోవుటయే. దాని నేనాడు కోల్పోయితిమో, ఆనాడే మన పతనము ప్రారంభించియుండు నని నేను దృఢముగా చెప్పగలను. ఆత్మవిశ్వాసము కోల్పోవుట అనగా ఈశ్వరునియందు విశ్వాసము కోల్పోవుటయే. మనకు వలయున దంతయు సమకూర్చుచుండు ఆ అవ్యయశుభమూర్తి నీలో నుండి, నీ ద్వారా, పనిచేయుచుండు నని నీకు నమ్మకము కలదా? ఆ సర్వవ్యాపి, ఆ అంతర్యామి, ప్రతి అణువునందును "ఓతప్రోతరూపుడై" (పడుగు, పేక వలె) నిలిచి నీ మన శ్శరీరాత్మలలో చొచ్చియున్నా డని నీకు నమ్మక మున్నచో, నీ ధైర్య మెట్లు సడలిపోగలదు? నే నొక క్షుద్రబుద్బుదమను కావచ్చును, నీ వొక పర్వతోన్నతకల్లోలమవు కావచ్చును. అయిన నేమి? మన యిరువురకును సామాన్యమూలమై ఆ అనంతసాగరము నిలిచియున్నదిగదా. ఆ అనంతసాగరము — జీవమునకును, శక్తికిని, పారమార్థికతకును మూలనిధి యైనది — నీ దెట్లగునో, అట్లే నాదియు అగును. ఆ అనంత జీవమయునితో, ఆ అనంతదయామయునితో, ఆ అనంతశక్తి మయునితో, నీవలెనే నేనును, జన్మించిన దాదిగా — నా ఉనికియే ఇందుకు నిదర్శనము — సంయుక్తుడనై యున్నాను. నీవు అద్రిసమానమహోన్నతుడ వగుటచే నీ కెట్టి ఆధిక్యము గాని లభింపలేదు. కావున సోదరులారా, ఈ జీవసంరక్షక మును, మహితమును, ఔదార్యప్రదమును, మహోదాత్త

మును అగు సత్యమును మీ బిడ్డలకు — పుట్టినప్పటినుండియు — కఱపుడు. అద్వైతమతము నేర్ప నక్కఱలేదు ; ద్వైతమతమునో, మ ఱే యితరమతమునో — మీ కిష్టమైనదానిని — నేర్పవచ్చును. కాని, హిందూదేశమం దంతటను అన్ని మతములవారిచేతను సామాన్యముగా అనుసరింపబడున దీ సిద్ధాంతమే — ఆత్మపరిపూర్ణమైనది అను ఈ అద్భుతసిద్ధాంతమే — అని మేము కనుగొంటిమి. తత్త్వజ్ఞశేఖరు డగు మన కపిలుడు చెప్పినట్లు ఆత్మ స్వతస్సిద్ధముగా పరిపూర్ణమై యుండనిచో, పిదప దానికి పరిపూర్ణత సిద్ధించుట అసంభవము ; నడుమంత్రమున లభించిన పరిపూర్ణత నడుమంత్రముననే భ్రంశమొందును. మానవునికి అపరిశుద్ధతయే స్వాభావిక మయ్యెనేని, ఐదు నిమిషములపాటు పరిశుద్ధత లభించినను, అతడు అపరిశుద్ధుడుగనే ఉండవలయును. ఈ నడుమంతరపు పరిశుద్ధత కొట్టుకొనిపోయి, నశించి, పూర్వపు — స్వాభావికమగు — అపరిశుద్ధత మరల పరిపాలించు కాలము వచ్చును. కావున మన తత్త్వజ్ఞు లందఱును పరిశుద్ధత మనకు స్వభావసిద్ధము, పరిపూర్ణత మనకు స్వభావ సిద్ధము, అపరిశుద్ధత కాదు, అపరిపూర్ణత కాదు అని బోధించియున్నారు. ఈ బోధను మనము జ్ఞప్తి పెట్టుకోవలయును. తాను చేసిన మహాకార్యములను, తాను భావించిన మహాభావములను జ్ఞప్తికి తెచ్చుకొమ్మని తన మనస్సును అవసానకాలమున ఆదేశించిన మహర్షి చూపిన మార్గమును జ్ఞప్తిపెట్టుకొనుడు. తన దోషములను, తన అవివేకకార్యములను జ్ఞప్తికి తెచ్చుకొమ్మనికాదు అతడు

తన మనస్సును ఆదేశించినది. అవివేక కార్యము లుండును, దోషము లుండితీఱును; కాని సర్వదా నీ యథార్థతత్త్వ మును జ్ఞప్తియం దుంచుకొనుము. నీ అవివేక కార్యములను, నీ దోషములను కుదుర్చుకొను మార్గ మది యొక్కటియే.

హిందూదేశమున నుండు వివిధమతశాఖలవా రంద ఱును ఈ పేర్కొనబడిన విషయములందు ఏకీభావము కలిగి యున్నా రని నా భావము. మతవిషయములలో పూర్వసంప్ర దాయైకనిష్ఠులును, విశాలభావబుద్ధులును; ప్రాచీనరీతి వారును, నవీనరీతివారును; భావికాలములో ఈ సామాన్య క్షేత్రమున అన్యోన్యసహకారప్రవర్తనులై కూడవచ్చును. అన్నిటికన్న ముఖ్యముగా మనము జ్ఞప్తి పెట్టుకొనవలసిన విషయము మఱొకటి కలదు: హిందూదేశములోని మనకు మత మనగా అనుభూతిగాని, అందుకు కొఱవడిన దేదియు కాదు. ఈ ముఖ్యవిషయమును మన మెన్నియోసార్లు మఱ చుట మిక్కిలి శోచనీయము. "ఈ సూత్రమును నమ్ముము, నీవు సురక్షితుడవుగా నుందువు" అని మనకు బోధించుట నిష్ప్రయోజనము. మనము అట్టి బోధలను నమ్మువారము కాము. స్వయంకృషివలన గాని యేదియు సిద్ధింప దని మన నమ్మకము. నీ ప్రస్తుతస్థితికి హేతుభూతము లైనవి ఈశ్వర కృపయు, నీ స్వయంకృషియు. కొన్ని సిద్ధాంతములను, సూత్రములను నమ్మినమాత్రాన అంతగా ప్రయోజనము లేదు. హైందవపారమార్థికగగనవీథినుండి వెలువడిన మహత్తర భాషితము "అనుభూతి" అనునది. "ఈశ్వర

సాక్షాత్కారము నొందవలెను'' అని మాటిమాటికిని చాటు నది మన శాస్త్రములుమాత్రమే. ఇవి ధీరోక్తులు, సాహ సోక్తులు: నిజమేకాని, అందులోని ప్రతిధ్వనియు, ప్రతి అక్షరమును సంపూర్ణముగా యథార్థము. మతభావముల ననుభూతము చేసికోవలెను; వినినమాత్రమున నేమియు ఉపయోగములేదు. ఏదో యొక సిద్ధాంతము చిలుకవలె పలుకనేర్చుకొనిన చాలదు. మన బుద్ధి కది సమ్మతముగా నుండుట చాలదు. అంతమాత్రమున నేమియు జరుగదు. అది మనలో చేరిపోవలెను. కావుననే ఈశ్వరుడు కల డనుటకు మనకుగల మహోత్కృష్టనిదర్శనము అది యుక్తి సమ్మతముగా నుండుట కాదు; పూర్వకాలపువారును, ఇప్పటి కాలపువారును అతనిని దర్శించి రనుట. మనము ఆత్మ కల దని నమ్ముట దాని యునికికి ప్రబలనిదర్శనము లుండుటచేత మాత్రమే కాదు; అందుకు ముఖ్యకారణము మన దేశములో ననేకులు తమ ఆత్మలను అనుభూత మొనర్చుకొన్నవా రుండుటే. అట్టివారు పూర్వకాలమున వేనవేలుగా నుండిరి; ఇప్పుడును అట్టివా రనేకులు కలరు; భవిష్యత్కాలమున గూడ అట్టివారు వేనవే లుందురు. మఱియు ఈశ్వర సాక్షాత్కృతి పడసిన గాని, ఆత్మానుభూతి నొందిన గాని, మానవుడు మోక్ష మొందజాలడు. కావున మన మన్నిటి కన్న ముఖ్యముగా ఈ సత్యమును గ్రహింతుముగాక. దానిని మన మెంత చక్కగా గ్రహింతుమో, అంతగా మన మత కలహములును, శాఖాభేదములును తఱిగిపోవును. ఏలయన ఆస్తికధర్మపరు డను పేరు ఈశ్వరానుభూతి నొంది, ఈశ్వర

సాక్షాత్కారసిద్ధి వడసినవానికిమాత్రమే చెల్లును. ఆ పరా త్పరుని — సమీపవస్తువు లన్నిటిలో నత్యంతసమీపస్థుడును. దూరవస్తువు లన్నిటిలో నత్యంతదూరస్థుడును అగు ఆ పురుషుని — దర్శించినవానికి గాని హృదయగ్రంథులు విచ్ఛిన్నములుకావు; వానికి గాని సంశయము లన్నియు అంతరింపవు: వాడు గాని కర్మఫలానుభూతినుండి విముక్తుడు కాడు. వట్టి వదరుబోతుమాటలను మతసత్యములుగాను, కేవలవైజ్ఞానికవక్తృత్వసౌరభములను మహోన్నత పార మార్థికసిద్ధులుగాను, మన మెన్నోసార్లు భ్రమింతుము. అను భూతికిమాత్రమే ఆస్తికధర్మనామము చెల్లునని మన మెప్పుడు గ్రహింతుమో, అప్పుడే మన హృదయపరిశోధన మొనర్చు కొని, మతసత్యానుభూతి దెస మన మెంతదూరము సాగినది కనుగొనగలుగుదుము; మనమే చీకటిలో చిక్కి, కన్నులు గానక తడవులాడుచున్నా మనియు, ఆ చీకటిలోనికే ఇత రులనుకూడ తీసికొనివచ్చి, వారుకూడ తడవులాడున ట్లొనర్చు చున్నా మనియు మన మప్పుడు గ్రహింతుము. అప్పటికి గాని మతభేదములు పెట్టుకొనుటయు, కలహించుటయు, యుద్ధములొనర్చుటయు మనము మానుకొనము. మత కలహప్రారంభము చేయజూచువాని నిట్లు ప్రశ్నింపుము: ''నీవు భగవంతుని చూచితివా? ఆత్మను చూచితివా? లేనిచో ఈశ్వరనామమును బోధింప నీ కెట్టి యధికారము కలదు? చీకటిలో జిక్కి తడవులాడు నీవు నన్నుకూడ అదే చీకటి లోనికి లాగ జూచుచున్నావా? గ్రుడ్డివాడు మఱొక గ్రుడ్డి

వానికి క్రోవ చూప సాగినచో, ఇరువురును గోతిలో పడుదురుగదా!''

కావున ఇతరులను తప్పుపట్టులోపల చక్కగా ఆలోచించుకొనుము. తమ హృదయములందు పరమార్థమును అనుభూత మొనర్చుకొనుటకై పాటుపడువారిని వారి త్రోవనే నడువనిమ్ము. ఆ అత్యద్భుతానందమును — హైందవఋషులందఱును, సత్యానుభూతి నొందినవా రందఱును, పొందితిమని పల్కు ఆశ్చర్యకరానుభవమును — ఆ అవ్యయ సత్యమును ప్రత్యక్షముగా చూచినప్పుడు వారుకూడ పొందుదురు. అప్పుడు వారి హృదయములలోనుండి ప్రేమమయవాక్కులుమాత్రమే వెలువడగలవు. ఏలయన ఆ ప్రేమ స్వరూపుడే ఆ హృదయములను స్పర్శించెనుగదా. అప్పుడు మతకలహము లన్నియు అంతరించును — అప్పటికిగాని అవి అంతరింపనేరవు. అప్పుడు హిందూశబ్దము మన కర్థమగు స్థితి లభించును. అప్పు డాశబ్దమును — ఆ పేరు దాల్చు ప్రతివానిని — మన హృదయములయొద్దకు తెచ్చుకొని, ఆలింగన మొనర్చుకొని, వారియెడ అపార ప్రేమ చూపుదుము. హిందూశబ్దము విన్నంతనే అపారబలోదగ్రమగు విద్యుత్తరంగప్రఘాతము నిన్నెప్పుడు కదల్చివేయునో, అప్పుడుగాని నీవు హిందువ వనిపించుకొనవు. హిందు వని చెప్పుకొనువాడు — అత డేదేశములోనైన నుండనిమ్ము; మనభాషనైన, మ తే యితరభాషనైన, మాటలాడనిమ్ము — ప్రతివాడును ఆ క్షణముననే నీ కత్యంతసన్నిహితుడును, అత్యంతప్రియుడును ఎప్పు డగునో, అప్పుడుగాని

నీవు హిందువ వనిపించుకొనవు. హిందూనామము ధరించినవా డెవ్వడేని ఆపదలపాలై యున్నచో, ఆ ఆపదలు నీ హృదయము నావరించి, అవి నీ కుమారునే పీడించుచున్న ట్లెప్పుడు నీకు తోచునో, అప్పుడుగాని నీవు హిందువ వనిపించుకొనవు. ఈ ఉపన్యాసారంభమున నే నుదాహరించిన ఆదర్శమూర్తి, మహోన్నతగుణాన్వితుడు, మీ గురుగోవిందసింగువలె హిందువులకొఱకు సర్వహింసలను భరించుటకు నీ వెప్పుడు సంసిద్ధుడ వగుదువో అప్పుడుగాని నీవు హిందువ వనిపించుకొనవు. దేశము నుపద్రవముపాలు చేయుచున్న మ్లేంఛ గణముతో పోరాడుచు, హిందూమతసంరక్షణార్థమై తన శరీర రక్తము నర్పించి, యుద్ధభూమియందు తన కొమాళ్లు వధింపబడుట కోర్చి, దేశమునుండి తఱుమగొట్టబడి, తన రక్తమును, అత్యంతప్రియులగు తన స్వకీయుల రక్తమును ఎవరికై అర్పించెనో వారుసైతము తన్ను పరిత్యజించినను, ఆ కృతఘ్నులనుగూర్చి యొక్క దూషణవాక్యమునైనను పలుకక, ఆ మహామహుడు వ్యథితసింహామువలె దక్షిణాపథమున కరిగి అచట ప్రశాంతతతో కాలధర్మము నొందెను. ఆ మహాపురుషుడు మీ కాదర్శమూర్తి యగుగాక! మీలో స్వదేశహిత మొనర్పగోరు ప్రతివాడును ఒక గోవిందసింగు కావలెను. మీ దేశీయులలో వేనవేలు దోషములు మీకు కాన్పింపవచ్చును. కాని వారిలో హిందూరక్తము ప్రవహించుచున్నమాట మాత్రమే మీ దృష్టిపథమున నుండవలెను. మీకు వారు సర్వవిధములగు అపకారములు చేయుచున్నను, మీరు ప్రథమమున అర్చింపవలసిన దేవతలు

వారే. వారిలో ప్రతివాడును మిమ్ము శాపములపాలొనర్చినను, మీరు మాత్రము వారిని ప్రేమమయవాక్కులతో ఆదరింపవలెను. వారు మిమ్ము వెడలగొట్టివైచినచో, ఆ పురుషసింహు డగు గోవిందసింగునవలె మాఱుమాటాడక మరణించుటకై వెడలిపొండు. అట్లు ప్రవర్తింపగలవానికే హిందూనామము చెల్లును. మన కెప్పుడును ఇట్టి యాదర్శము ఉండవలెను. మన కలహముల నన్నిటిని భూగర్భమున పాతిపెట్టుదుము గాక! మహోదాత్త మగు ఈ ప్రేమతరంగమునే సర్వదిశలకు ప్రవహింప జేయుదుముగాక!

హిందూదేశ పునరుజ్జీవనమునుగూర్చి ఎవ రేమి పల్కినను, యావజ్జీవము దేశసేవకై వినియోగించుచున్న — లేక వినియోగింప బ్రయత్నించుచున్న — నేను చెప్పు మాట నొకదానిని మీ రాలకింపుడు : మీరు పారమార్థికత సాధించిన గాని హిందూదేశ మెన్నటికిని పునరుజ్జీవనము గాంచ జాలదు. అంతే కాదు, అఖిలప్రపంచాభ్యుదయము కూడ దీని మీదనే ఆధారపడి యుండును. ఏలయన, పాశ్చాత్య నాగరికతాసౌధ మిప్పు డామూలాగ్ర మసియాడు చుండుట సత్యము. ఎంత మహాబలిష్ఠము లగు సౌధము లైనను అదృఢములగు ఇసుకపునాదులను బోలు అనాత్మభావముపై నిర్మింపబడినచో, వాని కేదో యొకనాడు చేటు కలిగియే తీఱును; అవి ఏదో యొకనాడు క్రక్కదలి కూలిపోయియే తీఱును. ప్రపంచచరిత్రమే యిందుకు సాక్షి. మానవుడు కేవలభౌతికపదార్థరాశి యని చాటుచు, తమ యున్నతి కంతయు అనాత్మవాదమునే ఆధారముచేసికొని యుండిన

జాతు లనేకములు — ఒకదాని వెనుక నొకటి — ఉప్పతిల్లినవి. పాశ్చాత్యభాషలో మానవుడు విడనాడునది తన జీవుని (Ghost); మన భాషలో నతడు విడనాడునది తన శరీరమును. పాశ్చాత్యుడు తా నొక శరీర మనియు, తనకొక ఆత్మ * కలదనియు తలచును; మనభావమున మానవుడు ఆత్మస్వరూపుడు, వాని కొక శరీరము కలదు. ఈ భావములకు అపారమగు భేదము కలదు. కావున భౌతికసుఖము మున్నగు ఇసుకపునాదులపై నిర్మింపబడిన నాగరికతలన్నియు కొలదికాలముమాత్రమే నిలిచి ప్రపంచమునుండి అదృశ్యమైనవి. కాని హిందూదేశముయొక్కయు, హిందూదేశమును శుశ్రూషించి ప్రబోధమొందిన జపాన్ చైనా దేశములయొక్కయు నాగరికతలు నేటికిని సజీవమై యుండుటేగాక నూతనోజ్జీవనలక్షణములుకూడ చూపుచున్నవి. పాశ్చాత్యపురాణవాఙ్మయములో పేర్కొనబడిన ఫీనిక్స్ (Phoenix) పక్షివలె నివి వేయి తడవలు మృతినందినను, మరల మరల పూర్వమునకన్న నధికదివ్యతేజోవైభవోపేతములై ప్రాదుర్భావము నొందుటకు సంసిద్ధములై యుండును. కాని అనాత్మభావోత్పన్న మగు నాగరికత, ఒక్క తడవ కూలిపోయెనేని, మరల నెన్నటికిని తల యెత్తనేరదు. ఆ సౌధము కూలుటతోడనే ''తునాతునుక''లై పోయి శాశ్వతనాశము నొందును. కావున ఓర్పుతో వేచియుండుడు. భావికాలమున మనకు మహాదశ రానున్నది.

---

* పాశ్చాత్యుల ''Soul'' (ఆత్మ) మన ''మనస్సు'' వంటిది.

—క. మ.

వేగిరపడ బోకుడు. ఇతరుల ననుకరించి ప్రవర్తింప జూడకుడు. మనము జ్ఞప్తియందుంచుకొనవలసిన ముఖ్య విషయములలో ఇది యొకటి: అనుకరణము నాగరికత కానేకాదు. నేనొక ప్రభువు వేషమును ధరింపవచ్చును. కాని అంతమాత్రముననే నేను ప్రభువ నగుదునా? గాడిద సింహపుచర్మమును ధరించిన మాత్రముననే సింహము కానేరదు. అనుకరణము — పిఱికితనమునకు చిహ్నమగు అనుకరణము — పురోగమనసాధకము కాదు. నిజమున కది మానవుడు భయంకరరూప మగు అధోగమనము పొందుచుండుటను సూచించును. అవును, మానవుడు తన్ను తాను ద్వేషించుకొన నారంభించెనేని వాడిక కోలుకొనుట కల్ల. మానవుడు తన పూర్వులకై లజ్జింప నారంభించెనేని, వాని కిక ఆశ లేదు. ఇచ్చట నిలిచియుండు నేను హిందూజాతిలో గల అల్పులలో నొకడను. కాని నా జాతికై నేను గర్వింతును, నా పూర్వులకై నేను గర్వింతును. హిందువుడ నని నేను సగర్వముగా చెప్పుకొందును. మీ సేవకుడ నని చెప్పుకొనుటకుకూడ అనర్హుడ నగు నేను మీ సేవకుడ నని గర్వించుచున్నాను. జ్ఞానసిద్ధుల వంశములోనివారలగు — ప్రపంచమున నుద్భవించిన జనులందఱిలో మహోత్కృష్టులగు ఋషుల వంశములోనివారలగు — మీ దేశస్థుడ నని చెప్పుకొనుటకు నేను గర్వించుచున్నాను. కావున ఆత్మవిశ్వాస మలవఱచుకొనుడు, మీ పూర్వులకై గర్వింపుడు, వారికై లజ్జింపకుడు. అనుకరించు అలవాటును విసర్జింపుడు. అనుకరించుటనే వదలివేయుడు.

ఇతరుల యధీనములో జిక్కినవారికి స్వతంత్రత నశించును. పారమార్థికవిషయములలో నైనను, ఇతరుల ఆజ్ఞానువర్తులై ప్రవర్తించువారికి క్రమక్రమముగా శక్తి తఱిగిపోవును, చింతనాశక్తికూడ నశించును. స్వప్రయత్నములచే మీలో గల సత్త్వమును బైటికి దైకొనిరండు. ఇతరుల ననుకరింపవలదు. కాని వారిలోగల గుణమును గ్రహింపుడు. మన మితరులయొద్ద నేర్చుకొనవలయును. మనము భూమిలో విత్తనము నుంతుము ; దానికి వలయు మట్టిని, గాలిని, నీటిని దానికి సమకూర్తుము ; ఆ విత్తనము మొక్కయై, పిదప మహావృక్షమైనప్పుడు అది మట్టిగా కాని, గాలిగా కాని, నీరుగా కాని అగునా? తనకు సమకూర్పబడినదాని నంతయు గ్రహించి అది తన స్వధర్మానుసార మగు గొప్ప మొక్కగా, గొప్ప వృక్షముగా, అగును. మీరును అట్లే ప్రవర్తింతురు గాక. మన మితరులయొద్దనుండి నేర్చుకోవలసిన దెంతో కల దనుటకు సందేహములేదు. అవును, అట్లు నేర్చుకొనక నిరాకరించువాడు మృతుడనియే చెప్పవలయును.

మన మనువు ఇట్లు పలికియున్నాడు : "ఆదదీత పరాం విద్యాం ప్రయత్నాదవరాదపి। అన్త్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి॥" (హీనకులురాలైనను స్త్రీరత్నమగుదానిని భార్యగా దైకొనుము; పరావిద్యను హీనకులునైనను సేవించి నేర్చుకొనుము; పరమధర్మమును చండాలునైనను సేవించి గ్రహింపుము). శ్రేయస్కర మగుదాని నంతయు ఇతరులయొద్ద నభ్యసింపుడు; దైకొనివచ్చి, మీ స్వధర్మానుసారము దానిని మీలో నిముడ్చుకొనుడు. కాని

ఇతరులుగా మాఱవలదు. హైందవజీవితమార్గమునుండి మి మ్మెవ్వరును తొలగదీయ కుండునట్లు చూచుకొనుడు. హిందువు లందఱును మఱొక జాతివారి వేషమును, భోజన వైఖరిని, ప్రవర్తనమును అనుసరించినచో హిందూదేశము బాగుపడు నని ఒక క్షణమాత్రమైనను భావింపవలదు. కొలది సంవత్సరములుగా ఏర్పడిన అలవాటునే విడనాడుట ఎంత కష్టమో మీ రెఱుగుదురు. మన రక్తములో ఎన్ని వేల సంవత్సరము లిమిడియున్నవో దేవునికే ఎఱుక! ఎన్ని వేల సంవత్సరములుగా మన జాతియొక్క ప్రత్యేకజీవిత విధానము ఒకే త్రోవనుబట్టి ప్రవహించుచున్నదో దేవునికే ఎఱుక! దాదాపు సముద్రసంగమము నొందనున్న ఈ మహా ప్రవంతీప్రవాహ మిప్పుడు మరల హిమాలయపర్వత తుషారాగ్రములను చేరగల దనియేనా మీ విశ్వాసము! అది అసంభవము! అట్లు చేయు ప్రయత్నమే దానిని ధ్వంస మొనర్చును. అంతయే. కావున జాతియొక్క జీవసప్రవాహ మున కడ్డుపడక తొలగి నిలువుడు. ఈ మహాప్రవాహపురో గమనమున కడ్డుపడుచున్న కట్టలను తీసివేయుడు; దాని మార్గమును పరిశుభ్ర మొనర్పుడు; నీటిలోని నాచు మున్నగు వానిని తొలగింపుడు. అప్పు డది స్వశక్తిచేతనే ముందుకు దుముకులాడుచు పరుగిడ నారంభించును. జాతి వేగముగా పురోగమించును.

హిందూదేశమునందు పారమార్థిక కార్యాచరణమును ఈ మార్గములలో సాగింపవలె నని నా సూచన. ఇంకను ఎన్నియో మహాసమస్యలు కలవు గాని వ్యవధి చాలమిచే

వానిని నేఁటి కై కొనజాలను. అద్భుతమగు కులసమస్య ఆ సమస్యలలో నొకటి. ఆ సమస్యయందుగల సాధక బాధకములను గ్రహించుటకు నేను చిన్ననాటినుండియు పాటుపడుచున్నాను. మన దేశపు సమస్త ప్రాంతములలో నివసించు సర్వకులములవారితో నేను కలసిమెలసి కాలముగడపితిని. ఈ విషయమును అర్థముచేసికొని గ్రహించు ప్రయత్నమే నాకు దిగ్భ్రమకలిగించుచున్నది. దానిని గ్రహించుటకు నేను చేయు ప్రయత్న మధిక మగుకొలది నా దిగ్భ్రమ మధిక మగుచున్నది. కాని చివర కిప్పుడు ఒకింత వెలుగు కానిపించుచున్నది — దాని యర్థ మొకించుక తోపనారంభించుచున్నది. పిదప అన్నపానములనుగూర్చిన మహా సమస్య యొకటి కలదు. అది నిజముగా మహాత్తర సమస్యయే. మనము సామాన్యముగా తలచునంత వ్యర్థ విషయముకా దది. అన్నపానములనుగూర్చి మన మిప్పుడు కల్పించిన నియమములు మిక్కిలి విపరీతమైన వనియు, ఇవి శాస్త్రవిధులకు ప్రత్యక్షవిరుద్ధము లనియు, అనగా అన్నపానపారిశుద్ధ్యమునుగూర్చిన శాస్త్రవిధుల నవలంబింపమిచే మనకు హాని కలుగుచున్న దనియు, శాస్త్రనియమములలో గల మూలభావమును మనము గ్రహింపలే దనియు నా నిశ్చితాభిప్రాయము.

ఇంకను పెక్కు సమస్యలనుగూర్చి మీకు తెలుపవలెననియు, వాని పరిష్కారమార్గములు సూచింపవలెననియు, ఆ మార్గముల నాచరణరూపమున బెట్టు విధము నెఱిగింపవలెననియు నాకు కోరిక కలదు; కాని నేటి సభ నొక

ప్రోవకు తెచ్చి ప్రారంభించుటకే చాలసేపు పట్టెను. కావున మిమ్ము నింకను ఇచ్చట ఆపుట నా కిష్టములేదు. కులమును గూర్చియు, ఇతరవిషయములనుగూర్చియు నా భావములను మీకు తెలుపుట కింకొక అవకాశము చూచుకొందము.

ఇంకొకమాట చెప్పి ఈ పారమార్థికభావవిషయములను ముగింతును. ఎంతో కాలమునుండి మన దేశములో ఆస్తికధర్మము స్థితిశీలమై (Statical) యున్నది. దాని నిప్పుడు గతిశీలము (Dynamical) చేయవలయును — అది ప్రతిమానవుని జీవితములో ప్రవేశించునట్లు చేయవలెనని నా సంకల్పము. పూర్వకాలమున సర్వదా జరుగుచుండి నట్లు అది రాజభవనములందును నిఱుపేదకాపుగుడిసెలందును నిలిచియుండవలెను. ఈ ఆస్తికధర్మ మనెడు సంపద మన దేశమున పూర్వార్జితమై సర్వజనులకును సమానాధికారముతో సంక్రమించినది. అది ప్రతిమానవునికిని "జన్మహక్కు". కావున దానిని ప్రతియింటికిని కొనిపోయి "ఉచితముగా" పంచిపెట్టవలెను. ఈశ్వరసృష్టిలోని గాలివలె అది కూడ ప్రతివానికిని అందుపాటులో నుండునట్లు చేయవలెను. మన దేశమున ఇట్టి ఉద్యమమును మనము కల్పింపవలెను. భావభేదములనుగూర్చి నిరంతరకలహములతో ప్రొద్దుపుచ్చుకొనెడు చిన్న చిన్న తెగల నేర్పఱచినచో ఈ ఉద్యమము నెఱవేఱదు. మన కందఱకు ఏకీభావము గల విషయములను బోధింతము. అభిప్రాయభేదములను తమంతట తామే సరదుకొననిత్తము. మనవారికి నే నెన్నియోసార్లు చెప్పుచున్నట్లు శతాబ్దాంతరములనుండి చీకటిగుహగా

నున్నచోటికి పోయి "అయ్యో, చీకటి! చీకటి!" అని విలపింపసాగినచో ఆ చీకటి నశించునా? దీప మొకటి తెచ్చితి వేని, చీకటి వెంటనే మాయమగును. మానవులను సంస్కరించి బాగుపఱుపఁగోరువారికి సత్యము నెఱుగవలెను. ఉన్నతతరములగు విషయములు వారికి తెలుపుడు. ప్రథమవిషయము మానవునందు మహనీయత కలదని నమ్ముడు. మానవుడు పతితు డనియు, అధోగతి నందినవా డనియు ఏల ముందుగనే ఊహింతురు? మానవునందు — అధమాధమునందు సైతము — నా కెన్నడును విశ్వాసము నశింపలేదు. ఆ విశ్వాసము — ఒక్కొక్కసారి మొదట అంత ఆశాజనకముగా తోపకపోయినను — చివరకు విజయము నందుచునే వచ్చినది. మానవునందు — అతడు మిక్కిలి విద్యాధికుడుగా తోచినను, కేవల విద్యావిహీనుడుగా తోచినను — విశ్వాసముంపుడు. దేవతాతుల్యుడుగా తోచినమానవునందును, రాక్షసతుల్యుడుగా తోచిన మానవునందును, కూడ విశ్వాసముంపుడు. అతడు మానవుడు గనుక, వెంటనే అతనిని విశ్వసింపుడు. పిదప అతడు పొరపాట్లు పడినచో, అతనియందు లోపము లున్నవని గ్రహింపుడు; కేవల అపరిపక్వభావములను, కేవల నీచభావములను అవలంబించినచో, అవి అతని యథార్థతత్త్వమునుండిగాక, ఉత్తమాదర్శలోపమువలన ఉత్పన్నమైన వని నమ్ముడు. అసత్యము దెస కేగువాడు సత్యము లభింపమిచే అట్లొనర్చెనని ఎఱుగుడు. కావున అసత్యాభిముఖత్వమును సరిపఱుచుట కొక్కటే మార్గము కలదు — సత్యపదార్థము నతని కంద జేయుట.

ఇది చేసి, రెంటికిని గల తారతమ్యమును నిర్ణయించుకొను కార్యము నతనికే వదలివేయుడు. సత్యపదార్థము నందజేయుటతో మీ కర్తవ్యము పూర్తియైనది. దీనిని తనయందప్పటి కుండినదానితో అతనినే పోల్చిచూచుకొననిండు. మీ రిచ్చినది నిజముగా సత్యపదార్థమే ఐనచో — నా మాట నమ్ముడు — అసత్యము అదృశ్యమైతీఱును; వెలుతురు చీకటిని పటాపంచలు చేసితీఱును; సత్య మతనిలో గల యోగ్యతను బయటకు తెచ్చితీఱును. దేశమును పారమార్థికముగా బాగుపఱుపగోరువా రవలంబింపవలసిన మార్గమిది కాని, వారితో కలహించుట కాదు; మీ రిప్పుడు చేయునది తప్పు అని వారికి చెప్పుటకూడ కాదు; యోగ్యవస్తువును వారికి ప్రదర్శింపుడు, దానిని వా రెంత ఆతురతతో గ్రహింతురో చూడుడు; మానవునం దెల్లప్పుడును, అనశ్వరమై నిలిచియుండు దివ్యత్వము వెంటనే మేల్కాంచి, శ్రేయస్కర మగుదాని నంతను, భవ్యమగుదాని నంతను, కైకొనుట కెంత ఆసక్తితో చేయిచాపునో చూడుడు.

మన జాతిని సృజించి, ప్రపంచమున నిలిపి సంరక్షించుచుండు నతడు: మన పూర్వులచే విష్ణునామముననో, శివనామముననో, శక్తినామముననో, గణపతినామముననో, కీర్తింపబడుచు; సగుణుడుగనో నిర్గుణుడుగనో; సాకారుడుగనో, నిరాకారుడుగనో, ఆరాధింపబడుచు ఉండిన ఈశ్వరుడు: ''ఏకం సద్విప్రా బహుధా వదన్తి''(కలది ఒకే పదార్థము: సిద్ధులు దానికి పెక్కు పేళ్లు పెట్టుదురు) అని మన

పూర్వులచే పలుకబడినవారు: తన అపారప్రేమతో మనలో ప్రవేశించుగాక! తన కృపావృష్టిని మనపై కురిపించుగాక! మన మొకరినొకరము గ్రహించు శక్తిని ప్రసాదించుగాక! మన మొకరికై యొకరము యథార్థప్రేమతో, సత్యమునం దపారప్రీతితో, పరిశ్రమించునట్లొనర్చుగాక! ఈ హైందవ పారమార్థిక పునరుజ్జీవనమహాకార్యమునందు స్వకీర్తికాంక్ష గాని, స్వప్రతిష్ఠాకాంక్షగాని, స్వలాభకాంక్షగాని అణుమాత్రమైన మనలో ప్రవేశింపకుండుగాక!



# హిందూమతము: అందలి తత్త్వవిచారము*

ప్రాచీనకాలములో ప్రప్రథమమున కానిపించు ఆస్తిక ధర్మభావసముదాయ మంతటియందును — ఆ నామమున కనర్హములగు క్షుద్రభావములుకాక గణనీయములైనవి — ఆవేశభావరూపములు (**inspiration**), ఈశ్వరవాగ్రూప (**Revealed**) గ్రంథములు, మున్నగునవి కలవు. అవి ఈశ్వర భావము—'మనకిచట కానిపించు జగత్తున కొక కర్తకలడు. ఈ జగత్తులో గల దంతయు అతనిచే సృజింపబడినదే' అను భావ ము—తో ప్రారంభించును. కొంతకాలము పిదప ఈ యీశ్వర భావము కాక ఆత్మభావ మొకటికూడ కానిపించును: ఈ శరీరము కాక, దీనిలో అశరీరపదార్థ మొకటికూడ కలదు. ఆస్తికధర్మమునకు మన మెఱిగిన అత్యంతప్రాచీనరూప మిదియే. ఈ భావము నవలంబించువా రొక కొలదిమంది హిందూదేశమున కలరు కాని, ఇది అనతికాలముననే పరిత్యజింపబడెను. హైందవమతమూలములం దొక ప్రత్యే కత కలదు. ఎంతో నిశితపరిశీలనము, ఎంతో గణనా పరిశ్రమము, ఎంతో వితర్కవ్యాయము, చేసినగాని హైందవ మతములం దట్టి మూలదశ యొకటి యుండె నని మనము తలచుటకే శక్యముకాదు. మనకు గోచరించు దశ మొట్ట మొదటిది కాదు, ఆ పిదపది. ప్రప్రథమకాలమున సృష్టిని

* పాశ్చాత్యఖండమున నొసగబడిన ఉపన్యాసము.

గూర్చిన భావము మిక్కిలి అపూర్వ మైనదిగా నుండెను. భగవదిచ్ఛచే అది శూన్యములోనుండి కల్పింపబడె నని అప్పటి భావము: ఈ జగ త్తేమియు లేకుండెను; ఆ అభావ ములోనుండి ఇదంతయు ఉత్పన్నమైనది. తదనంతర కాలమున ఈ భావము సంశయిత మయ్యెను. "నాస్తిత్వములోనుండి అస్తిత్వ మెట్లు రాగలదు?" అను ప్రశ్నము వేదాంతవిచార ప్రారంభముననే బయలువెడలెను: 'శూన్యములోనుండి ఏదియు, ఎన్నడును, ఉత్పత్తి యగుటలే దని అందఱెఱుగుదురు. కావున ఈ జగత్తు దేనిలోనుండియో వచ్చియుండును. లేనిచో అది ఉనికి దాల్చియుండుటయే అసంభవము. మానవహస్తకృతములగు సర్వకార్యములకును సాధనసామగ్రి కావలసియుండును. ఇండ్లు నిర్మించినను, నావలు నిర్మించినను, ఉపకరణములు నిర్మించినను, వాని నిర్మాణమునకు వలయు మూలపదార్థము లంతకుముందు ఉండియేతీఱవలెను. అవి ఉండబట్టియే ఆ నిర్మాణములు సాధ్యమైనవి'. కావున ఈ జగత్తు శూన్యములోనుండి నిర్మింపబడె ననెడు ప్రాథమిక భావము త్యజింపబడెను. ఈ నిర్మాణమును సాధ్యపఱచిన మూలపదార్థ మెద్ది అనెడు ప్రశ్న బయలువెడలెను. ఆధ్యాత్మికవిచారచరిత్ర మంతయు ఈ మూలపదార్థాన్వేషణారూపమైనదే. ఈ అఖిలము దేనిలోనుండి సృజింపబడినది? ఈ జగత్తునకు నిమిత్తకారణము ఈశ్వరుడు, ఆయనయే దీనిని సృజించెను, అను విషయమటుండగా, ఏ సామగ్రితో ఆయన ఈ సృష్టి యొనర్చెను అను గాఢాతిగాఢ మగు సమస్య యొకటి పరిష్కరింపవలసి

యుండెను. తత్త్వశాస్త్రము లన్నియు ఈ సమస్యమీదనే పరిభ్రమించుచున్న వని చెప్పవచ్చును. ప్రకృతి, ఈశ్వరుడు, ఆత్మ : ఈ మూడును నిత్యవస్తువు లనియు, అవి శాశ్వత గమనముగల సమాంతర రేఖలవంటి వనియు, అందు ఈశ్వరుడు స్వచ్ఛందసత్యమనియు, తక్కినవి అస్వచ్ఛంద సత్యము లనియు ఒక మతమువారి పరిష్కారము : ప్రతి ఆత్మయు — ప్రతి భౌతికాణువువలె — కేవలము భగవదిచ్ఛమీదనే ఆధారపడియుండును. మొదట ఆత్మవిషయమును కై కొందము. ఈ విషయమున మన వేదాంతమతము లన్నిటికిని పాశ్చాత్యతత్త్వశాస్త్రమునకును ఒక మహత్తర భేదము కానిపించుచున్నది. వేదాంతమతము లన్నియు ఒకే మనస్తత్త్వశాస్త్రము (**Psychology**) నంగీకరించును. ఆ మతములకు పరస్పరభేదము లెన్నియున్నను, హిందూదేశపు ప్రాచీన సాంఖ్యమానసికశాస్త్రమే వాని యన్నిటికిని సామాన్యము. ఈ సాంఖ్యసిద్ధాంతప్రకారము శబ్దాది భూత గుణతరంగములు మొదట బాహ్యేంద్రియములను తాకును, అచటనుండి అంతరింద్రియములకును, వానినుండి మనస్సునకును, మనస్సునుండి బుద్ధికిని, బుద్ధినుండి ఆత్మ యనుపేర బరగు నొక అసంయుక్తవస్తువునకును చేరుట వలన బోధము (**Perception**) కలుగును. ఇక ఆధునికశరీరశాస్త్రమునకు వత్తము. ఇంద్రియబోధము లన్నిటికిని అది కేంద్రస్థానములను కనిపట్టినది. ఇందు కొన్ని క్రిందితరగతివి, కొన్ని పైతరగతివి. వీనినే మనవారు అంతరింద్రియము లనియు మనస్సనియు చెప్పునది. కాని ఈ కేంద్రము లన్నిటిని

పరిపాలించి ఏకసూత్రబద్ధముచేయు మూలకేంద్రమును ఈ ఆధునిక శాస్త్రజ్ఞులు కనుగొనలేదు. అనగా వీని నన్నిటి నైక్యపఱచున దేదియో వారు చెప్పజాలరు. ఈ కేంద్రము లన్నియు ఎక్కడ ఐక్యమందును? మెదడులో నుండు ఇంద్రియ కేంద్రము లన్నియు భిన్నములు. వీని నన్నిటి నేకసూత్రబద్ధముచేసి పరిపాలించు మూలకేంద్ర మేదియు లేదు. కావున ఈ విషయమున హైందవమన స్తత్త్వసిద్ధాంత మున కెదురాడున దేదియు లేదు. ఈ ఏకీకరణ ముండితీఱ వలెను — ఈ విభిన్నబోధస్పర్శము లన్నియు ప్రతిఫలించి సమష్టిరూపము నొందదగు మూలకేంద్ర మొకటి యుండ వలెను. అట్టి దొకటి లేనిచో, మిమ్మునుగూర్చి యొక భావముగాని, రూపచిత్రముగాని,మఱేదిగాని,నాయం దేర్పడ జాలదు. అట్టి ఏకీకరణవస్తువు లేనిచో, మనకు చూచు టొకసారి, పిదప కొంతసేపటికి ఊపిరిపీల్చుట, పిదప వినుట, ఇట్లే వేర్వేఱు వ్యాపారములే సాధ్యపడును. ఒకని మాటలు వినబడునప్పుడు నేనతనిని చూడజాలను. కేంద్రము లన్నియు వేర్వేఱుగనే నిలిచియున్నచో, ఇట్లే జరుగును.

శరీరము అణువులతో నిర్మింపబడినది. ఆ అణువులు భౌతికపదార్థ మనబడుదానికి సంబంధించినవి. ఈ భౌతిక పదార్థము మూఢమును, జడమును. వేదాంతులు సూక్ష్మ శరీర మనునదికూడ ఇట్టిదే. ఈ సూక్ష్మశరీరముకూడ భౌతి కమేగాని, పారదర్శకము (**Transparent**) అనియు, అత్యంత సూక్ష్మాణుకములతో — ఎట్టి శక్తిమంతమగు సూక్ష్మదర్శని

కిని (**Microscope**) కానిపింపనంత సూక్ష్మము లగువానితో —అది నిర్మింపబడి యుండుననియు వారు చెప్పుదురు. దాని వలని ప్రయోజన మేమి? సూక్ష్మశక్తుల కది నిలయము. అనగా సూక్ష్మశరీరము సూక్ష్మశక్తు లుండుచోటు. స్థూల శరీర మెట్లు స్థూలశక్తుల కాశ్రయమో, అట్లే సూక్ష్మ శరీరము సూక్ష్మశక్తులకు — మనోవ్యాపార మనబడుదాని వివిధరూపములకు — ఆశ్రయము. మొదట శరీరము కలదు. అందు స్థూలభౌతికపదార్థమును, స్థూలశక్తియును కలవు. శక్తి భౌతికపదార్థాధారము లేనిది ఉండజాలదు. దానియునికికి కొంత భౌతికపదార్థము ఉండితీఱవలెను. కావున స్థూలతరశక్తులు అందుండును; ఆ శక్తులే సూక్ష్మతరము లగును. ఏ శక్తి స్థూలరూపమున ప్రవర్తించుచున్నదో, ఆ శక్తియే సూక్ష్మరూపప్రవృత్తి నంది చింతనగా మాఱును. ఆ రెంటికిని భేదమే లేదు. ఒకే వస్తువుయొక్క స్థూలరూప మొకటి, సూక్ష్మరూప మొకటి. ఇట్లే స్థూలసూక్ష్మశరీర ములకుకూడ భేద మేమియు లేదు. సూక్ష్మశరీరముకూడ భౌతికమే. కాని అందలి భౌతికపదార్థము సూక్ష్మతర మైనది. స్థూలశరీర మెట్లు స్థూలశక్తిప్రదర్శనసాధనమో అట్లే సూక్ష్మశరీరముకూడ సూక్ష్మశక్తిప్రదర్శనసాధనము. ఈ శక్తు లన్నిటికిని మూల మెద్ది? వేదాంతతత్త్వశాస్త్ర ప్రకారము ప్రకృతియందు రెండు పదార్థములు కలవు. ఇం దొకదానికి ఆకాశ మని పేరు. అది సూక్ష్మాతిసూక్ష్మమగు భౌతికపదార్థము. రెండవదానికి ప్రాణ మని పేరు. ఇదియే శక్తి. నీవు చూచున దంతయు, స్పృశించున దంతయు, వినున

దంతయు — గాలి, భూమి మున్నగున దంతయు — భౌతికము. అదంతయు "ఆకాశ" జనితమే. ప్రాణసంయోగ ప్రభావముచే ఆకాశపదార్థము క్రమాధిక స్థూలముగనో, క్రమాధిక సూక్ష్మముగనో అగుచుండును. ఆకాశమువలె ప్రాణము కూడ సర్వవ్యాపకము, సర్వాంతర్గతము. "ఆకాశమును" జలరాశితో పోల్పవచ్చును; ఆ నీటివలన పుట్టి, ఆ నీటిలో తేలియాడుచుండు మంచుగడ్డలతో లోకమునందుగల తదితరము నంతయు పోల్పవచ్చును. ఈ "ఆకాశమును" ఈ వివిధరూపము లొందజేయు శక్తియే "ప్రాణము". ప్రాణము స్థూలరూపములతో — కండర చలనము, నడచుట, కూర్చుండుట, మాటాడుట మొదలగు రూపములతో — అభివ్యక్త మగుటకు సాధనప్రాయమైనది స్థూలశరీరము. ఇది ఆకాశపదార్థకల్పితము. సూక్ష్మశరీరముకూడ ఆకాశపదార్థకల్పితమే కాని అది అతిసూక్ష్మరూప మగు ఆకాశపదార్థము. అదియు ఆ ప్రాణముయొక్క అత్యంతసూక్ష్మరూప మగు చింతనావ్యాపారము నభివ్యక్తము చేయు సాధనమే. అనగా, మొదట ఈ స్థూలశరీరము కలదు. అది దాటినపిదప సూక్ష్మశరీరము కలదు. అదియు దాటినపిదప మానవుని యథార్థతత్త్వ మగు జీవుడు కలడు. మన మెన్నియో తడవలు తీసివైచుచుండియు, మన గోళ్లు ఎట్లు మన శరీరముతో అభిన్నములై, తద్భాగములై యుండునో, అట్లే స్థూలశరీరముకూడ సూక్ష్మశరీరమునకు సంబంధించినది. మానవునకు సూక్ష్మశరీర మొకటియు, అదిగాక స్థూలశరీర మొకటియు ఉండవు. ఒకే శరీర ముండును. అందులో

చిరకాలము నిలిచియుండు భాగమునకు సూక్ష్మశరీర మనియు, అచిరకాలముననే జీర్ణించిపోవు భాగమునకు స్థూల శరీర మనియు పేళ్లు. నేను నా గోళ్ల నెన్నిసార్లైన నెట్లు ఖండించివేయగలనో, అట్లే నా స్థూలశరీరమును లక్షలాది సార్లు విడనాడగలను; కాని నా సూక్ష్మశరీరము నిలిచియే యుండును. ద్వైతమతప్రకారము జీవుడు — అనగా యథార్థమానవుడు — అత్యంతసూక్ష్మరూపుడు, అణీయుడు. ఇప్పటికి మన మెఱిగిన దిది: మానవు డనగా నొక స్థూలశరీరమును (ఇది శీఘ్రకాలముననే విచ్ఛిన్న మగునది), ఒక సూక్ష్మశరీరమును (ఇది యుగయుగాంతరములు నిలిచియుండునది), ఒక జీవుడును కూడియుండు నొక ప్రాణి. వేదాంతతత్త్వశాస్త్రప్రకార మీ జీవుడు ఈశ్వరుని వలెనే నిత్యుడు; ప్రకృతికూడ నిత్యమే కాని, మాఱుపు లొందుచు నిలిచియుండునది. ప్రకృతికి మూల మగు ప్రాణాకాశరూపపదార్థము నిత్యమైనదే కాని అది సర్వదా వివిధరూపములుగా మాఱుచుండును. జీవాత్మమాత్రము "ఆకాశము"తోగాని, "ప్రాణము"తోగాని నిర్మింపబడినది కాదు. అది భౌతికవస్తువే కాదు. కావున అది శాశ్వతము. అది ప్రాణాకాశసంయోగమువలన కలిగినది కాదు. అసంయుక్తపదార్థమునకు నాశము ఉండజాలదు. ఏలన, నాశ మనగా మూలవస్తువులుగా చీలిపోవుటయే. స్థూలశరీరము ప్రాణాకాశసంయోగఫలము. కావున దానికి వియోగము సిద్ధము. అట్లే సూక్ష్మశరీరముకూడ వియోగమునొందును గాని అది దీర్ఘకాలానంతరము. జీవాత్మ

అసంయుక్తవస్తువు గనుక దానికి నాశము (వియోగదశ) ఉండనేరదు. అదేకారణముచేత దానికి పుట్టువుకూడ ఉండి యుండనేరదు. అసంయుక్తవస్తువు పుట్టుటే అసంభవము. లక్షోపలక్షల ఆత్మలతో కూడియుండు ప్రకృతి యంతయు ఈశ్వరేచ్ఛాధీనమై యుండును. ఈశ్వరుడు సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, నిరాకారుడు, సర్వగతుడునై యుండుటవల్ల ప్రకృతిద్వారా పనిచేయుచుండును. ప్రకృతి యంతయు అతని ఏలుబడిలోనే యుండును. అతని ప్రభుత్వము ఆద్యంత రహితమైనది. ఇది ద్వైతుల సిద్ధాంతము. ఈ సిద్ధాంత మున నొక ప్రశ్న కవకాశము కలదు: ఈ లోకమునకు ఈశ్వరుడే పరిపాలకు డైనచో అత డిట్టి దుష్టప్రపంచమును — ఇంత వ్యథామయమగు దానిని — ఏల సృజించెను? ఈ వ్యథలకు ఈశ్వరుడు బాధ్యుడు కాడని వారు బదులు చెప్పుదురు; మన వ్యథలకు మన పాపములే కారణభూత ములు; మనలను ఈశ్వరు డేమియు శిక్షించుటలేదు. మాన వుడు నిఱుపేదగనో, గ్రుడ్డిగనో, మ ఱేవిధముగనో పుట్టును. ఇందుకు కారణ మేమి? అట్లు జన్మించుటకుపూర్వ మత డేమియో చేసియుండెను. జీవుడు అనాదిసిద్ధుడు, అజుడు (పుట్టుకలేనివాడు). ఈ కాలమంతయు అతడు సర్వవిధ కర్మము లొనర్చుచున్నాడు. మన కర్మఫలము నంతయు మన మనుభవింపవలెను. సత్కర్మముచే సుఖమును, దుష్క ర్మముచే దుఃఖమును ప్రాప్తించును. కావుననే జీవుడు సుఖ దుఃఖము లనుభవించుచు, సర్వవిధకర్మము లొనర్చు చుండును.

మరణానంతర మేమి సంభవించును? జీవాత్మ స్వత
స్సిద్ధముగా పరిశుద్ధ మని వేదాంతతత్త్వజ్ఞు లందఱును
అంగీకరింతురు. కాని దాని యథార్థతత్త్వము అవిద్యచే కప్ప
బడియుండు నందురు. దుష్కర్మఫలముగా దానికి అవిద్యా
చ్ఛాదన మెట్లు లభించినదో, అట్లే సత్కర్మఫలముగా
స్వతత్త్వజ్ఞానము మరల లభించును. అది నిత్యమైనట్టి
నైసర్గికముగా పరిశుద్ధముకూడ. సర్వభూతములును నైస
ర్గికముగా పరిశుద్ధములే.

సత్కర్మఫలముగా జీవాత్మయొక్క సమస్త పాపము
లును, దుష్కర్మములును కడిగివేయబడినపిదప అది మరల
పరిశుద్ధ మగును. అట్లైనప్పు డది దేవయాన మనబడు
చోటికి పోవును. దాని వాగింద్రియము మనస్సులో ప్రవే
శించును. మాటలు లేనిది మనము ఆలోచింపజాలము.
ఆలోచన కలచోట నెల్ల మాట లుండితీఱవలెను. వాక్కు
మనస్సులో ప్రవేశించినట్టే, మనస్సు ప్రాణములోను,
ప్రాణము జీవాత్మలోను లీనమైపోవును. అంతట జీవాత్మ
సత్వరగతితో శరీరమును విడనాడి సూర్యలోకమునకు
నిష్క్రమించును. జగత్తులో ననేకలోకములు కలవు. ఈ
ధాత్రి భూలోకము. దీనియందు చంద్రసూర్యనక్షత్రలోక
ములు కలవు — భూలోకముపైని సూర్యలోకము, దాని
పైని చంద్రలోక మనబడునదియు. చంద్రలోకముపై
బ్రహ్మలోక మనబడునది కలదు. జీవాత్మ అచటి కరిగి
నప్పుడు అప్పటికే పరిపూర్ణత గన్న మఱొకజీవాత్మ దాని
నచట కలసికొని లోకము లన్నిటిలో మహోన్నత మగు

బ్రహ్మలోకమునకు తోడ్కొనిపోవును. అచట చేరిన జీవాత్మ కిక జననమరణము లుండవు. అచట అది అనంత కాలము జీవించును; అనంతసుఖ మనుభవించును; సృజనాశక్తి యొక్కటితప్ప సర్వవిధశక్తులు కలిగియుండును. జగత్పరిపాలకపదవి ఈశ్వరు డొక్కనికితప్ప మఱెవ్వరికిని లభించునది కాదు. ఎవ్వడును ఈశ్వరుడు కాజాలడు. "నేను ఈశ్వరుడను" అని పల్కువాడు దైవనిందారూప మగు ఘోరాపచార మొనర్చుచున్నా డని ద్వైతి పల్కును. జీవాత్మకు ఆ సృజనాశక్తి యొక్కటి వినా సర్వశక్తులును చేకూరును. శరీరములు ధరించి, లోకములోని వివిధ ప్రాంతములం దేదేని కార్యము లొనర్ప గోరెనేని, అట్లు చేయుటకుకూడ దానికి సాధ్యముగనే ఉండును. వేల్పులందఱును, పితరు లందఱును, తన ప్రోలకు రావలసిన దని అది యాజ్ఞాపించినచో, వా రందఱును ఆ యాజ్ఞానుసారము వత్తురు. సర్వశక్తిసంపన్న మగుటచే దానికి దుఃఖానుభూతియే ఉండదు. శాశ్వత బ్రహ్మలోకనివాసవాంఛ కలదేని, ఆ వాంఛయు సిద్ధించును. ఈశ్వరప్రేమపూరితుడై, అస్వార్థతాపరమావధి నంది, నిరవధిక పారిశుద్ధ్యము నార్జించి, సర్వవాంఛావిదూరుడై, ఈశ్వరునికి ప్రేమారాధన లర్పించు కార్యముతప్ప ఇతర మేమియు చేయ నొల్లకుండునట్టి మహోన్నతమానవుని విషయ మిది. అంత మహోన్నతులు కాని వారి దింకొక తరగతి. వీరును సత్కర్మము లొనర్తురు కాని అవి సకామకర్మములు — వారికి ఫలాపేక్ష కొంత యుండును. "మేము బీదల కిది యిది యిత్తుము. కాని అందుకు

ప్రతిఫలముగా మాకు స్వర్గభోగము లభింపవలెను'' అని వీరు పల్కుదురు. ఇట్టి వారు మరణానంతర మే మగుదురు? వారి వాక్కు మనస్సులోను, మనస్సు ప్రాణము లోను, ప్రాణము జీవాత్మలోను లీన మైనపిదప వారి జీవాత్మ బహిర్గతమై చంద్రలోకమున కరుగును. అచ్చట అది దీర్ఘ కాలము మహాసుఖము ననుభవించును. కాని ఆ జీవాత్మ యొక్క సత్కర్మఫలము నిలిచి యుండు వఱ కే ఇట్లు జరుగునది. ఆ ఫలము వ్యయమై పోవుటతోడనే అది మరల భూలోకమునకు దిగివచ్చి తనయిచ్ఛానుసారమగు జీవితమును పొందును. చంద్రలోకనివాసకాలమున జీవాత్మకు — మనము వేలుపు అనియు; క్రైస్తవులు, మహమ్మదీయులు, దేవదూత (Angel) అనియు పేర్కొను — ఒక మహిమాన్వితస్వరూ పము లభించును. ఈ వేల్పులు కొన్ని పదవుల పేళ్లు. సురపతి యగు దేవేంద్రు నిందు కుదాహరణముగా కైకొం దము. అది యొక పదవి పేరు. వేలాదిజను లా పదవి నొందుదురు. వేదోక్తక్రతువులలో మహోత్తమ మైనదాని నొనర్చిన సత్పురుషుడు మరణించినప్పుడు అతడు దేవేంద్రు డగును. తత్పూర్వ మా పదవి నాక్రమించియున్నవా డప్ప టికి భూలోకమునకు మరల దిగి మానవరూప మందియుం డును. ఇచ్చట మన రాజులు మాఱుచున్నట్లు వేలుపులు కూడ మరణింపవలసినదే. స్వర్గలోకవాసు లందఱికిని మర ణము అనివార్యము. మరణరహితమైన — జననమరణముల కతీతమైన — ప్రదేశము బ్రహ్మలోక మొక్కటియే. స్వర్గ లోకమున కేగిన జీవాత్మ లత్యంతసుఖమునే అనుభవించు

చుందురు గాని. అప్పు డప్పుడు అసురులు వారిపై బడి తఱిమి పీడించుట గలదు. సురల నొక్కొక్కసారి హింసల పాలు సేయు అసురులు కలరని మన పురాణములలో చెప్ప బడియున్నది. సురాసురులు యుద్ధముచేయుటయు, ఒక్కొక పరి అసురులు సురల నోడించుటయు పురాణవాఙ్మయము లన్నిటియందును కానిపించును. కాని వారు సురలుచేసినన్ని దుష్కార్యములు చేసినట్లు కానిపింపదు. సురలయొక్క స్త్రీలోలత్వము నిందు కుదాహరణముగా పేర్కొన వచ్చును. పురాణవాఙ్మయము లన్నిటియందును ఈ స్త్రీ లోలత్వము వర్ణింపబడియుండును. వారి సుకృతఫలానుభూతి పూర్తియగుటతోడనే సురలు పతనమొంది, మేఘములద్వారా, జల్లులద్వారా, క్రిందపడి మానవు లాహారించు ధాన్యములోనికో మొక్కలలోనికో చేరి, అవి తినబడినప్పుడు మానవశరీరములో ప్రవేశింతురు. వారికి తగినట్టి శరీరమునకు వలయు పదార్థమును తండ్రి సమకూర్చును. ఈ పదార్థముయొక్క ఔచిత్యము చెడినప్పుడు వా రితర శరీరములను నిర్మించుకోవలసియుండును. సర్వవిధములగు ఘోరదుష్క్రియ లొనర్చు మహాపాపాత్ములు మృగములుగా పునర్జన్మ మందుదురు. అంతకన్న దుష్టులగు వారు క్షుద్రజంతువులుగను, వృక్షములుగను, శిలలుగను పుట్టుదురు.

దేవతారూపమున నున్నప్పుడు కర్మము ఉత్పన్నము కాదు. కర్మ మొనర్చునది మనుష్యుడే. కర్మ మనగా ఫలాభిసంధి గల కార్యము. మరణించి వేల్పగు మానవున

కది కేవల సుఖకాలము. ఆ కాలమున నతఁడు క్రొత్త కర్మ మును కల్పించుకొనఁడు. అది వాని పురాకృతసత్కర్మము నకు ప్రతిఫలరూపముగా లభించిన సమ్మానము. ఆ సత్కర్మ మంతయు వ్యయమైపోయిన పిదప, శేషించియుండు కర్మము ఫలానుభవరూపమునకు వచ్చును. అప్పు డతఁడు మానవశరీర మొందును. ఆ శరీరమున నతఁడు మహోత్తమ కార్యాచరణముచే పారిశుద్ధ్యము నొందెనేని, బ్రహ్మలోక మున కరుగును. అతని కింక పునరావృత్తి యుండదు.

క్షుద్రరూపములనుండి ఉత్తమరూపాభిముఖమై పరి ణామయాత్ర చేయు జీవాత్మకు తిర్యగ్జంతుశరీర మొక నడి త్రోవ మజిలీ వంటిది. కాలక్రమమున క్షుద్రజంతువు మానవు డగును. మానవుల సంఖ్య వృద్ధి యగుకొలది క్షుద్రజంతువులసంఖ్య క్షీణించుట గమనార్హ మగు విష యము. క్షుద్రజంతువులలోని ఆత్మ లన్నియు మానవు లగు చున్నవి. అనేకజాతి క్షుద్రజంతువు లిప్పటికే మానవు లైనవి. లేనిచో, అవి ఎచ్చటి కేగినవి?

వేదములలో నరక మను మాటయే కానరాదు. అనంతరకాలమున కల్పింపబడి, మన శాస్త్రవాఙ్మయములో చేరినట్టి పురాణము లనేకవిధము లగు నరకములను సృష్టిం చెను. నరకములు లేని మత మసమగ్ర మని వారి భావము. ఈ నరకములు కొన్నిటిలో మనుష్యులను రెండు ఖండము లుగా అంపములతో కోసి నిరంతరము హింసింతురు. కాని వారు మరణింపరు. ఐనను, ఈ పురాణములు దయతలచి

ఈ హింసాకాలమున కొక పరిమితి నేర్పఱచినవి. దుష్కర్మము ఆ కాలమున భుక్తమగును. తదనంతరము వారీ భూలోకమునకు మరలవత్తురు. అప్పుడు వారికింకొక అవకాశము లభించును. మానవరూపసిద్ధియే ఈ మహావకాశము. మనము మన భవిష్యద్గతిని నిర్ణయించుకొనునది ఈ శరీరమునందే గనుక ఇది కర్మశరీర మనబడును. మన మొక మహత్తర వలయాకార గమనము చేయుచున్నాము. ఆ వలయమునందు ఈ ప్రదేశమే మన భవిష్యత్తును నిర్ణయించునది. కావుననే సర్వరూపములందు మనుష్యరూపము ముఖ్యతమముగా పరిగణింపబడుచున్నది: మనుష్యుడు దేవతలకన్న అధికుడు.

ఇదియే ద్వైతమతస్వరూపము. ఇంతకన్న ఉన్నతమగు వేదాంతమత మొకటి కలదు. అది ద్వైతమతము అసంగతమని పల్కును. ఆ మతప్రకారము భగవంతుడే జగత్తునకు ఉపాదానకారణమును నిమిత్తకారణమునుకూడ. 'భగవంతుడు పరిపూర్ణుడు, ఆత్మయు పరిపూర్ణము, ప్రకృతి కూడ పరిపూర్ణము అనెడు వాదమున అనేకపరిపూర్ణ వస్తువు లేర్పడుచున్నవి. ఇది కేవల మసంబద్ధప్రసంగము; తార్కికవిచారసరణికే మూలవిచ్ఛేదకము. కావున జగత్తునకు ఉపాదానకారణమును నిమిత్తకారణమును కూడ భగవంతుడే. అతడు తనలోనుండియే ఈ జగత్తును ప్రక్షిప్తము చేయుచున్నాడు. కాని భగవంతుడీ గోడలుగా, ఈ బల్లగా, ఎట్లయ్యెను? పందిగా, హంతకుడుగా ఎట్లయ్యెను?

లోకమున నుండు దుష్టవస్తువులుగా ఎట్లయ్యెను? భగవంతుడు పరిశుద్ధు డనిగదా మన వాదము! అత డీ అధమవస్తువులుగా ఎట్లు మాఱగలడు? ఇందుకు మా సమాధాన మే మనగా: నేను ఆత్మ నయ్యును నా కొక శరీరము కలదుగదా; ఒక దృక్పథమున ఈ శరీరము నాకన్న భిన్నముకాదు గదా; అయినను, నేను — యథార్థరూపుడనగు నేను — ఈ శరీరమను కాను. నేను పసివాడ ననియో, యువకుడ ననియో, వృద్ధుడ ననియో పల్కుదును; కాని నా ఆత్మ మాఱలేదు. అది యథాస్థితియందే నిలిచియున్నది. అట్లే ఈ అఖిలజగత్తు — ప్రకృతి యంతయును, అసంఖ్యాక జీవాత్మలును చేరి యేర్పడినట్టిది — భగవంతునియొక్క అనంత శరీరముగా పరిగణింపవచ్చును. అత డీ సమస్తజగము నందును చొచ్చి సర్వాంతర్గతుడై యున్నాడు. అతడు మాత్రము అవికారుడు (మార్పు లొందనివాడు). ప్రకృతి సవికారము, ఆత్మయు సవికారమే. ప్రకృతి ఎట్లు మాఱును? దాని రూపములు మాఱును; అది వేర్వేఱు రూపములు దాల్చుచుండును. కాని ఆత్మ అట్టి మార్పు లొందజాలదు. అది జ్ఞానవిషయమున సంకోచవ్యాకోచతల నందుచుండును. దుష్కర్మములు దానిని సంకుచిత మొనర్చును. దుష్కర్మము లనగా ఆత్మకు స్వతస్సిద్ధమగు సత్యజ్ఞానమును, పరిశుద్ధతను సంకుచిత మొనర్చునవి. ఆత్మయొక్క నైసర్గిక తేజోవైభవమును గోచరరూపమునకు దెచ్చు కర్మములు సత్కర్మము లనబడును. ఈ ఆత్మ లన్నియు మొదట పరిశుద్ధములై యుండినవి. కాని ఆ పిదప అవి సంకుచితము లయ్యెను.

భగవదనుగ్రహముచేతను, సత్కర్మాచరణమూలముననను, అది మరల వ్యాకోచత నంది వాని నైసర్గిక పారిశుద్ధ్యమును మరల సాధించుకొనును. ఈ అవకాశము సర్వజనులకును కలదు. కాలపరిపాకమున నందఱకు విమోచనము లభించును. కాని ఈ జగత్తుమాత్రము అంతమొందదు. అది శాశ్వతమైనది'. ఇది రెండవసిద్ధాంతము. మొదటి సిద్ధాంతముపేరు ద్వైతము. ఈరెండవసిద్ధాంతప్రకారము భగవంతుడు, ఆత్మ, ప్రకృతి అను మూడువస్తువులు కలవు గాని, అందు ఆత్మయు ప్రకృతియు భగవంతుని శరీరము గనుక, మూడును చేరి యేకవస్తువే. ఆధ్యాత్మికవిచార పరిణామమున ఇది ఉన్నతతర మగు దశ. దీనిని విశిష్టాద్వైతమత మందురు. ద్వైతమతప్రకారము ఈ జగత్తు భగవంతుడు సాగించిన యొక మహాయంత్రతుల్యమైనది. విశిష్టాద్వైతప్రకార మది భగవదాత్మచే అంతర్నిబిడమై యుండు నొక సంఘటనము.

చివరిమతమువారు అద్వైతులు. వారి మత ప్రకారముకూడ ఈ జగత్తునకు భగవంతుడే ఉపాదాన కారణమును, నిమిత్తకారణమును. కావున భగవంతుడే ఈ యావజ్జగద్రూపము నొందినాడు. ఇది ఒప్పుకొనక తప్పదు. భగవంతుడు ఆత్మయనియు, జగత్తు శరీరమనియు, ఈ శరీరము సవికారము, భగవంతుడుమాత్రము అవికారుడు అని పల్కువారి వాద మంతయు అర్థరహిత మని అద్వైతులు చెప్పుదురు. ఆ వాదమే సరియైనచో, ఈ జగత్తునకు భగ

వంతుడు ఉపాదానకారణ మని చెప్పుటవలన ప్రయోజన మేమి? ఉపాదానకారణ మనగా కార్యరూపము నొందిన కారణము — కార్యము కారణముయొక్క రూపాంతరమే కాని వేఱుకాదు. మన కెచ్చటనేని కానిపించు కార్యము లన్నియు రూపాంతరము నొందినట్టి కారణములే. జగత్తు కార్యము, భగవంతుడు కారణము అగుచో, జగత్తు రూపాంతర మొందినట్టి భగవంతుడుగనే ఉండితీఱవలెను. జగత్తు భగవంతునియొక్క శరీరము. ఈ శరీరము సంకుచిత మును, సూక్ష్మమును అయి కారణరూప మొందుచున్న దనియు, దానిలోనుండి జగత్తు పరిణామ మొందుచున్న దనియు ఆ పక్షమువారు వాదించినచో, అద్వైతులు భగవంతుడే ఈ జగద్రూప మొందినాడు అని చెప్పుదురు. ఇప్పు డొక అత్యంతక్లిష్ట మగు ప్రశ్న బయలుదేఱుచున్నది. భగవంతుడే ఈ జగత్తుగా మాఱియున్నచో, మీ రందఱును, ఈ వస్తుజాల మంతయు ఆయనగనే ఉండవలెను. అవును, నిజమే. ఈ పుస్తకము భగవంతుడే, ఈ సర్వమును భగవంతుడే. నా శరీరము, నా మనస్సు, నా ఆత్మ : అన్నియు భగవంతుడే. 'అగుచో, ఇన్ని జీవాత్మ లెల కలవు? భగవంతు డిన్నికోట్ల జీవాత్మలుగా విభక్తమయ్యెనా? ఏకకుడగు ఆ భగవంతు డిన్నికోట్ల జీవాత్మలుగా మాఱునా? అగుచో అదెట్లు సంభవించెను? ఆ అఖండశక్తి, ఆ అఖండ వస్తువు, జగత్తులో గల ఆ యేకైకపదార్థము, విభక్త మె ట్లయ్యెను? అఖండత్వమును ఖండించుట అసాధ్యము. ఆ పరిశుద్ధు డీ జగత్తుగా ఎ ట్లయ్యెను? అతడు జగత్తుగామాఱి

యున్నచో సవికారుడుగా నుండవలెను. సవికారపదార్థ మంతయు ప్రకృతిలోనిది, ప్రకృతిగా నుండి సవికారమై యుండున దంతయు జననమరణములకు లోనయియుండును. మన భగవంతుడు సవికారుడైనచో, అత డొకనాడు మరణించితీఱవలెను. ఈ విషయమును జ్ఞప్తి పెట్టుకొనుడు. మఱొక విషయము. భగవంతునిలో ఎంతభాగము జగత్తయ్యెను? అది ఎంతభాగ మైనను, సృష్టికి పూర్వపు భగవంతునికన్న ఇప్పటి భగవంతుడు అంతభాగము కొఱవడి యుండవలెను. అనగా అతడు సృష్టికిపూర్వ ముండిన భగవంతుడు కానేరడు—ఆ కొంతభాగము జగత్తుగా మాఱినది గదా'. కావున అద్వైతు లిట్లు పలుకుదురు: "ఈ జగత్తు మిథ్య; దీనికి ఉనికియే లేదు; ఇదంతయు మాయ. ఈ జగత్తు; ఈ దేవతలు, దేవయోనులు, ఇతరభూతములు జన్మించుట, మరణించుట; ఈ అసంఖ్యాకజీవాత్మలు ఉత్పన్నమగుట, అంతరించుట: ఇవన్నియు స్వప్నసంఘటనములు". 'జీవాత్మ అనునదియే లేదు. ఇక అనేకజీవాత్మ లె ట్లుండగలుగును? కలది యొకే అఖండపరిపూర్ణపదార్థము. ఒకే సూర్యుడు అనేకజలాశయములలో ప్రతిఫలించి అనేకుడుగా కానిపించినను, కోటానుకోట్ల జలబిందువులందు కోటానుకోట్ల సూర్యబింబములు ప్రతిఫలించినను, అం దన్నియు పరిపూర్ణ సూర్యబింబములే అయ్యును, కల దొకే సూర్యబింబమైనట్టు, ఈ జీవాత్మ లన్నియు వేర్వేఱు మానసములందు దీపించు ప్రతిఫలరూపములు. ఈ విభిన్నమానసము లన్నియు విభిన్న జలబిందువులవలె ఆ ఏకవస్తువునే ప్రతిబింబించుచుండును.

ఈ విభిన్న జీవరూపములతో ఆ భగవంతుడే ప్రతిఫలించు చున్నాడు. కాని స్వప్నముకూడ నొక సత్యవస్తువుమీదనే ఆధారపడియుండవలెను. ఆ సత్యవస్తువే ఆ అఖండ పరిపూర్ణతత్త్వము. శరీరముగా, మనస్సుగా, ఆత్మగా నీవు స్వప్నమాత్రుడవే; కాని యథార్థదృష్టికి నీవు సచ్చిదానందమవు. నీవే ఈ జగత్తున కీశ్వరుడవు. నీవే ఈ జగత్తును సృజించుచున్నావు, మరల నీలోనే దానిని విలీన మొనర్చు కొనుచున్నావు'. ఇది అద్వైతియొక్క మతము. అతని మత ప్రకారము ఈ జన్మము లన్నియు, ఈ పునర్జన్మము లన్నియు, ఈ రాకపోక లన్నియు, మాయాకల్పితము లగు అసత్య విషయములు. నీవు పరిపూర్ణుడవు. నీ వెచ్చటికైన నెట్లు పోగలవు? నీ సర్వాతీతతత్త్వమున ఈ సూర్యుడు, ఈ చంద్రుడు, ఈ సమస్తజగత్తు బిందుప్రాయము లైనవి. నీ వెట్లు జన్మింపగలవు, ఎట్లు మరణింపగలవు? ఇంతకు పూర్వము నే నెన్నడును జన్మించియుండలేదు, ఇకమీదట నే నెన్నడును జన్మింపను. ఎన్నడుగాని నాకు తలిదండ్రులు, మిత్రులు, శత్రులు లేరు. ఎట్లుండగలరు? నేను అఖండ సచ్చిదానందమను. నేనే అతడను. అతడే నేను. ఈ వేదాంతమతప్రకారము మానవుని పరమగమ్య మేమి? ఈ జ్ఞానానుభూతి నొందినవారి కీజగత్తుతో ఐక్యసిద్ధి కలుగును. వారి కీస్వర్గలోకము లన్నియు — బ్రహ్మలోకసహితముగా — నశించిపోవును; ఈ స్వప్న మంతయు అదృశ్యమగును. నిత్యుడగు జగత్ప్రభుడు తామే యని వారు గ్రహింతురు. అఖండచిదానందమయు మగు వారి యథార్థతత్త్వము వారికి

సిద్ధించును. వారు విముక్తు లగుదురు. క్షుద్రవిషయములు వారి కిక సుఖము కలిగింపవు. ఈ క్షుద్రశరీరమునందే, ఈ క్షుద్రవ్యక్తిత్వమునందే, మన కిప్పుడు సుఖము కలుగు చున్నది. ఈ జగత్తంతయు నా శరీర మైనప్పుడు నా సుఖ మింతకన్న ఎన్నోరెట్లు అధిక మగునుగదా. ఒక్క శరీరమే నా కిప్పుడు సుఖము నిచ్చుచో, సర్వశరీరములు నావే యైనప్పు డా సుఖ మింక నెంత అతిశయమగునో! అప్పుడే మోక్షసిద్ధి కలుగునది. దీనినే అద్వైతవేదాంత మందురు.

వేదాంతతత్త్వవిచారము ఎక్కిన మూడు మెట్లు ఇవియే. వీని నతిక్రమించి పురోగమించుట సాధ్యము కాదు. ఐక్యమును దాటిపోవు టెట్లు? ఏ శాస్త్రమేని, ఐక్యమును సాధించినపిదప అది పోజాలదు. అఖండపరతత్త్వభావము నతిక్రమించి పురోగమించు టెట్లు?

అద్వైతవేదాంతము నందఱును చేపట్టజాలరు. అది దురవగాహము. మొదటి విషయము, దానిని బుద్ధిగ్రాహ్య మొనర్చుకొనుటయే మిక్కిలి కష్టము. అత్యంత తీవ్రబుద్ధియు, సాహసికమగు గ్రహణశక్తియు దాని కావశ్యకము. రెండవ విషయము, లోకులలో అత్యధికసంఖ్యాకుల కది జతపడునది కాదు. కావుననే ఈ మూడు మెట్లు ఏర్పడినవి. మొదటి దానితో నారంభింపుడు. దానిని చక్కగా విచారించి గ్రహించినచో, రెండవది గోచరించును. జాతి యెట్లు పురో గమించునో అట్లే వ్యక్తిగత మానవులుకూడ పురోగమింప వలెను. పారమార్థికవిచారమునందలి మహోన్నతశిఖరము

లను చేరు ఉద్యమములో మానవజాతి యేయే మెట్లెక్కెనో ఆ యా మెట్లు ప్రతిమానవుడుకూడ ఎక్కవలయును. కాని మానవజాతి యొక మెట్టునుండి రెండవమెట్టు నందుకొనుటకు ఎన్నో కోట్ల సంవత్సరములు పట్టినను, వ్యక్తిగతమానవులు ఆ యారోహణకార్యమునంతయు కొలదికాలముననే సాధింపవచ్చును. మనలో ప్రతివాడును ఈ అడుగులు వైచియే తీఱవలెను. మీలో అద్వైతులుగా నుండువారు మీకు ద్వైతమతమునందే గాఢవిశ్వాస ముండిన కాలమును జ్ఞప్తికి తెచ్చుకొనుడు. "నే నొక దేహమను, ఒక మనస్సును" అని తలచుటతోడనే ఈ స్వప్నము నంతయు పరిగ్రహింపవలసియుండును. ఒక భాగమును కైకొన్నవాడు సర్వమును కైకొనవలెను. ఈ ప్రపంచ ముండుట నిజమేగాని దేవుడు (సగుణుడు) కల డనుట కల్ల అని పల్కువాడు మూఢుడు. ఏలన ప్రపంచ మున్నచో, దాని కొక కారణభూతు డుండి తీఱవలెను. అతనినే దేవు డనునది. కారణము కలదని అంగీకరింపక కార్యము నంగీకరించుట యెట్లు? ప్రపంచ మదృశ్యమైనప్పుడే దేవు డదృశ్యుడగును. అప్పుడు నీవే దేవుడవు (అఖండపరబ్రహ్మమవు) అగుదువు; ఈ ప్రపంచము నీ కపుడు అంతరించును. 'నే నొక శరీరమను' అను స్వప్నము నిలిచియుండునంతకాలము నీవు జననమరణముల కధీనమై యున్నట్లే నీకు తోపగలదు. కాని ఆ స్వప్నము అదృశ్య మగుటతోడనే, నీకు జననమరణములు కల వను స్వప్నము, ఈ ప్రపంచ మొకటి కల దను స్వప్నము : ఈ స్వప్నములుకూడ అదృశ్యము లగును. మన కిప్పుడు

ప్రపంచముగా కానిపించు వస్తువే దేవుఁడుగా (అఖండ పర బ్రహ్మముగా) కానిపించును. ఎన్నాళ్లనుండియో మన వెలుపట నుండిన దేవుడే మన లోపల నున్నట్లును, అతడే మన ఆత్మ యైనట్లును తెలిసిపోవును.



# హిందూమతము :
# అందలి నాల్గు యోగములు*

వివిధమన స్తత్త్వముల నన్నిటిని తృప్తిపఱుచుశక్తి గల మతముగాని మానవజాతిలో నత్యధిక భాగమున కుప కరింపదు. ఆ శక్తి లోపించినచో, కల తెగ లన్నియు పాక్షిక ములు (ఒకపక్షమునకుచేరినవి) అగును. ప్రేమభావావేశ **(Love and Emotion)** బోధక మతము నవలంబించువారి యొద్ద కేగితి ననుకొనుము. వారు పాడుదురు, విలపింతురు, ప్రేమ బోధింతురు. నీవు వారితో "మిత్రమా, ఇదంతయు మంచిదే కాని, నా కింతకన్న బలిష్ఠపదార్థము — కొంత యుక్తియుక్త మైనది, తత్త్వరూప మైనది — కావలెను. నేను విషయము నొక్కొక్క మెట్టుగా, సకారణముగా, తెలిసికొన గోరెదను'' అంటివేని, వారు నిన్నచటినుండి గెంటివేయుదురు. గెంటివేయుటే కాదు; చేతనైనచో మఱొక ప్రదేశము (నరకము) నకు కూడ పడనడుతురు. అనగా ఆ మతమువారు భావావేశస్వభావము కలవారికి మాత్రమే తోడ్పడగలరు. ఇతరులకు తోడ్పడక పోవుటేకాక వారిని మట్టుపెట్టజూతురు. ఇంకను పరమహేయవిషయ మే మనగా, వారి చిత్తశుద్ధిని కూడ శంకింతురు. ఇక తత్త్వ శాస్త్రవేత్త **(Philosophers)** లన్ననో, వారు హిందూదేశము

* పాశ్చాత్య దేశమున నొసగబడిన ఉపన్యాసము నుండి.

యొక్కయు, ప్రాచ్యప్రపంచముయొక్కయు, జ్ఞానోత్కర్షమును ప్రశంసించుచు, సామాన్య జనులకు నోరుతిరుగని మాటలతో, భీకరశబ్దాడంబరముతో, ప్రసంగింతురు. కాని నావంటి పామరుడు వారియొద్దకు పోయి "ఏదైన బోధించి నాకు ఆధ్యాత్మికభిక్ష పెట్టగలరా?" అని అడిగినచో, వారు వెంటనే తృణీకారరూపమగు చిఱునగవుతో ఇట్లందురు: "నీ బుద్ధివికాసము మాదానికన్న ఎంతో తక్కువ. ఆధ్యాత్మికవిషయములు నీకెట్లు బోధపడగలవు?" ఈ తత్త్వవేత్త లెక్కడనో అంతరిక్షమున కెగసి కూర్చుందురు. 'ఇచ్చటినుండి వెడలి పొమ్ము' అనుటయే వారు చేయు బోధ. ఇక అంతశ్శక్తిసాధకులు (Mystical sects). వారేవేవియో నిగూఢవిషయములనుగూర్చి మాటాడుచుందురు; వివిధ క్షేత్రములందు జీవించుట, మనస్సుయొక్క వివిధావస్థలు, మనోబల మేమేమి సాధింపగలిగినది, ఇట్టివి. సామాన్యజను డొకడు వారియొద్దకు పోయి "నేను చేయగల ఉపయోగ కార్య మేదైన తెలుపుడు, నాకు దీర్ఘాలోచనలు వాడుక లేదు. నా కర్హమైన దేదేని సెలవిండు" అని అడిగెనేని వారు తిరస్కారసూచకమౌ చిఱునగవుతో ఇట్లందురు: "ఈ మూఢుని మాటలు వినుము. ఇతడు కేవలము అజ్ఞుడు, నిరర్థక జీవి". లోకమందంతయు ఇట్లే జరుగుచుండును. ఈ భిన్నమతములలో గల వైతండికాగ్రణుల నొక గదిలో వేసి బిగించి, వారి అపహాస్యరూపమందహాసముల (చిఱునగవుల) యొక్క ఛాయాచిత్రము నొకదానిని తీసికొనవలెనని నా కుతూహలము!

ఇప్పటి మతస్థితి, లోకస్థితి, ఇది. నేను వ్యాప్తి కొందింప దలచినది అన్ని విధములగు మనస్సులకు సమసమ్మత ముగా నుండు మతము : ఎంత వేదాంతపరమో, అంత భావావేశానుకూలము, ఎంత అంతశ్శక్తిసాధకక్రియమో, అంత కార్యాసక్తయోగ్యము. కలాశాలలనుండి వచ్చు శాస్త్రవేత్తలు,భౌతికతత్త్వజ్ఞులు, అగు అధ్యాపకులకు హేతువాదము కావలెను. వారిని తనివితీర చర్చింపనీయవలెను. కొంత దూరము సాగినపిదప హేతుత్వమును విడనాడినగాని సాగుట అసాధ్యమని వారికే తోచును. "ఈ యీశ్వర భావము, మోక్ష భావము, మూఢవిశ్వాసజనితములు. వానిని విడనాడుడు" అని వారందురు. నే నందుకు "తత్త్వజ్ఞ శేఖరా, ఈ నీ శరీరము అంతకన్న మూఢవిశ్వాస జనితము. దీనిని విడనాడుము. భోజనమున కింటికి గానీ, నీ అధ్యాపకపీఠమునకు గాని, పోవలదు. నీ శరీరమును పరిత్యజింపుము. అట్లు చేయజాలవేని నావాదబలమునుకూడ అంగీకరించి కూరుచుండుము" అని బదులు చెప్పుదును. ఈ లోక మంతయు ఏకవస్తువు, జగత్తులోనుండున దొకే వస్తువు, అనెడు తత్త్వశాస్త్రబోధ ననుభూత మొనర్చుకొన సహాకరింప జాలిన దానినే కదా "బ్రహ్మవిద్య" (Religion) అనదగును. అంతశ్శక్తిసాధకుడు వచ్చినచో, అతనికి స్వాగతమర్పించి మనః పరిశీలన విధులు చెప్పుటే కాక, అవి అతనియెదుట నను ష్ఠించిచూపవలెను. భావావేశస్వభావము గలవాడు వచ్చె నేని, మనమును ఈశ్వరభావావిష్టులమై అతనితోకూడ నవ్వ వలెను, ఏడ్వవలెను; "ప్రేమ మధువును గ్రోలి ఉన్మత్తులము

కావలెను". కార్యదీక్షాపరుడు వచ్చెనేని, అతనితో కూడి మనమును మన పరిపూర్ణశక్తితో పనిచేయవలెను. ఇట్టి సంయోగమందు విశ్వమతమున కత్యంతసన్నిహితరూపమగు ఆదర్శము కానిపించును. ఈ నాల్గు అంగములును సమ పరిమాణములతో, పరిపూర్ణరూపమున, ప్రతిమనస్సునందును ఉండునట్లు మానవజాతి నిర్మింపబడియున్న ఎంత చక్కగా నుండెడిదో! ఇది మానవపరిపూర్ణత్వమునుగూర్చిన నా ఆదర్శము. ఈ అంగములలో ఏ యొకటి రెండు మాత్రమే కలవారిది పాక్షికస్వభావమని నా అభిప్రాయము. ఈ లోక మంతయు ఇట్టి పాక్షికస్వభావము గలవారితోనే నిండి యున్నది. వారు నడుచు మార్గ మొక్కటే వా రెఱిగినది. తదితరము లన్నియు వారికి ఘోరములు, అపాయకరములు. ఈ నాల్గుమార్గములందు సమస్థితి కలిగియుండుటే నా మతా దర్శము. మా హిందూదేశమున "యోగము" (కూడిక) అనబడుదాని ద్వారా అట్టి ఆదర్శమతము సిద్ధింపగలదు. కార్యశూరు డీ యోగముచే మానవునకును మానవ లోకమునకును కూడిక సాధించును. అంతశ్శక్తిసాధకుడు దీనిచే తన పరాప్రకృతికిని అపరాప్రకృతికిని కూడిక సాధించును. ప్రేమసాధకుడు దీనిచే తనకును ప్రేమమయుడగు ఈశ్వరునికిని కూడిక సాధించును. వేదాంతి ఇందుచే అస్తిత్వ మంతటియొక్క కూడికను సాధించును. ఈ నాలుగు యోగ మార్గములకు సంస్కృతమున వేర్వేఱు పేళ్లు కలవు. ఇట్టి కూడికను సాధించువానిని "యోగి" యందురు. కార్య శూరుడు 'కర్మయోగి', ప్రేమమార్గానుసారి 'భక్తియోగి',

అంతశ్శక్తిసాధకుడు 'రాజయోగి', తత్త్వమార్గసాధకుడు 'జ్ఞానయోగి'. యోగి యను మాట యీ అందఱి కన్వయించును.

ఇప్పుడు మొదట రాజయోగమును కైకొందము. రాజయోగ మనగా — మనస్సును స్వాధీనపఱచుకొనుటనగా — ఏమి? యోగశబ్దమునకు మీ దేశములో నెన్నో విధముల పిశాచములతోడి సంబంధము కల్పింపబడినది. అది కేవలము నిరాధార మని ఎఱుగుదురు గాక! ఈ యోగములలో దేనిలోను స్వబుద్ధిని పరిత్యజింపవలసిన అవసరము లేదు; ఇతరులచేత మోసపోవ నవసరము లేదు; మీ బుద్ధిని ఎట్టి మతాచార్యులకుగాని స్వాధీనపఱుప నవసరము లేదు; ఒక మానవాతీతునికి లొంగియుండ నవసరము లేదు. ప్రతి దానియందును మీరు మీ బుద్ధిమీదనే ఆధారపడియుండవలెను. దాని నేమాత్రము విడువక అంటిపట్టుకొనియుండవలెను. సర్వభూతములకును మూడు తెఱగుల జ్ఞానోపకరణములు కలవు. మొదటిది సహజజ్ఞానము (Instinct). ఇది జంతువులం దత్యంతపరిణతరూపమున కానవచ్చును. జ్ఞానోపకరణము లన్నిటిలో ఇది అధమమైనది. రెండవది సకారణ విచారశక్తి (**Reasoning**). ఇది మానవులందు పూర్ణపరిణతరూపమున కానవచ్చును. సహజజ్ఞానము మిక్కిలి అసమగ్రరూపమైనది. జంతువుల కార్యాచరణావరణము మిక్కిలి పరిమితము. ఆ పరిమితావరణమందే సహజజ్ఞానము వర్తింపగలదు. మానవునిలో ఈ సహజజ్ఞానము చాలవఱకు విచారశక్తిరూపము నొందియుండును.

అతని కార్యాచరణావరణముకూడ విశాలత నొందియుండును. కాని ఈ విచారశక్తికూడ మిక్కిలి అసమగ్రప్రభావముకలదే. అది యొక్కింత దూరమువఱకే పోగలదు. ఆ మీాద పోజాలక నిలిచిపోవును. ఆ హద్దును మీాఱి దానిని సాగింప జూచినచో, ఎంతో గందరగోళము కలుగును. విచారము సంగతముగా నుండక అసంగతరూపమును దాల్చును. తార్కికమార్గము తిన్నగా సాగక వలయాకృతిని ధరించి మరలమరల మొదటికే వచ్చుచుండును. మన విషయజ్ఞానమునకు మూలమగు వస్తువులను — భౌతికపదార్థమును, శక్తిని — ఇందు కుదాహరణముగా కైకొందము. భౌతిక పదార్థ మనగా నేమి? శక్తి తన బలమును దేనిపై ప్రయోగించునో అది. శక్తి యనగా నేమి? భౌతికపదార్థముపై నేది తన బలమును ప్రయోగించునో అది. ఈ చిక్కు చూచితిరి గదా — ఈ అరఘట్ట (ఏతము) చలనమును. ఒక భావమున కింకొక భావ మాధారము. దానికి మరల మొదటి దాధారము! కార్యకారణరూపవిచార మొక దాటరాని మహాప్రతిబంధము నెదుర్కొనును. అప్పు డది గత్యంతరము లేక ఆగిపోవును; కాని ఆవల నుండు అనంత పరతత్త్వ క్షేత్రమును చేరవలెనని ఆతురపడుచుండును. అనంత పరిపూర్ణ మందలి యొక చిన్నపిసరు మానవచైతన్యవీథికి ప్రక్షిప్తమై మన మింద్రియములతో చూచు, మనస్సుతో భావించు, ఈ ప్రపంచముగా కానిపించుచుండును. చైతన్య మనెడు వలలో తగుల్కొనియున్న ఆ పరిమితావరణము లోపలనే, మన సకారణవిచారముయొక్క ప్రచారము. మన

మూ ఆవరణమును దాటిపోవుట కేదో సాధన ముండవలెను. ఆ సాధనమునే ఈశ్వరప్రేరితజ్ఞానము (Inspiration)* అందురు. అనగా మనకు గల జ్ఞానసాధనములు మూడు: సహజజ్ఞానము, యుక్తియుక్తవిచారము, ఈశ్వరప్రేరితజ్ఞానము. ఇందు మొదటిది జంతువులది, రెండవది మానవులది, మూడవది దివ్యపురుషులది. కాని యీ మూటి అంకురములు కొద్దిగనో గొప్పగనో వికసించి, ప్రతి మానవునందును కానవచ్చును. ఇవన్నియు అంకురరూపమున నుండిననే గదా పరిణతరూపము నందగలవు? మఱియొక విషయము కూడ జ్ఞప్తి పెట్టుకోవలెను. ఇం దొకదాని పరిణతరూపమే మఱొకటి. కావున నవి పరస్పరవిరుద్ధములు కావు. యుక్తి యొక్క పరిణతరూపమే ఈశ్వరప్రేరితజ్ఞానము. కావున నిది దానిని సంపూర్ణత నొందించును గాని ఖండింపదు. యుక్తికి అందని విషయములను ఈశ్వరప్రేరితజ్ఞానము బయలు పఱచును. అవి యుక్తికి విరుద్ధములుగా నుండవు. వృద్ధదశ శిశుదశకు పరిణతరూపమా, విరుద్ధరూపమా? కావున అపరిపక్వరూపసాధనమును పరిపక్వరూపసాధనముగా భ్రాంతి నొందు అవకాశము కలదు. ఇది మఱచిపోక జాగ్రత్తగా నుండవలెను. సహజజ్ఞాన మెన్నియో సార్లు దివ్యప్రేరిత జ్ఞానముగా లోకము నెదుట ప్రదర్శింపబడును. భవిష్యద్విషయ జ్ఞానకటనలు ఈ మూలమునుండియే ఉద్భవిల్లుచున్నవి. మూఢులు, చిత్తచాంచల్యపీడితులు, తమ బుద్ధివైకల్య మంతయు దివ్యజ్ఞానమని భ్రమించి మానవులు తమ్మను సరింపవలె ననుకొందురు. పరస్పరవిరుద్ధములును, అసంగత

ములును, అగు అర్థరహితబోధ లీ లోకములో చేయబడు చుండుటకు మూలము మతిభ్రష్టు లాడు అసంబద్ధప్రలాపము లను దైవప్రేరితములుగా ప్రదర్శింప జూచుటే.

యుక్తివిరుద్ధము కాకుండుటే సత్యబోధకు మొదటి తార్కాణ. ఈ మూలసూత్రము ననుసరించియే యీ యోగము లన్నియు నిర్మింపబడినవి. మనస్సు ద్వారా యోగసిద్ధి పడయు రాజయోగమును కై కొందము. ఇది అపారవిషయము గాన దీనిలోని కేంద్రభావమును మాత్రమే నే నిప్పుడు సూచింపగలను. మనకుగల జ్ఞానార్జనమార్గ మొక్కటే. అధమాధమమానవుడు మొదలు మహాయోగీంద్రునివఱకు, అందఱికి ఆ యేకైకమార్గమే కలదు. దీనిని ఏకాగ్రత (Concentration) యందురు. పరిశోధనాలయములో పనిచేయు రసాయనశాస్త్రజ్ఞుడు తన మానసిక శక్తు లన్నిటిని కేంద్రీకరించి తనయెదుటి భౌతికపదార్థములను ఆ యేకాగ్రబుద్ధితో పరిశీలించును. వెంటనే ఆ పదార్థముల తత్త్వము బహిర్గతమై అత డర్థించుచుండిన జ్ఞాన మలవడును. ఖగోళశాస్త్రజ్ఞుడుకూడ ఇట్లే తన మానసికశక్తుల నన్నిటిని కేంద్రీకరించి దూరదర్శని (Telescope) ద్వారా వస్తువుల నేకాగ్రతతో పరిశీలించును. నక్షత్రములును, గ్రహమండలములును, ముందుకువచ్చి తమతమ రహస్యముల నతనికి వెల్లడించును. జ్ఞానసాధనకై యత్నించు ప్రతివాని యొక్క — బాలురకు బోధించు అధ్యాపకునియొక్క, పాఠములు చదువు బాలకునియొక్క — విషయ మిట్టిదే.

మీరు నా మాటలు వినుచున్నారు. వానియందు మీ కాసక్తి కలిగినచో, మీ బుద్ధి వానిపై కేంద్రీకరింపబడును. అప్పుడు గడియారము గంట కొట్టినచో మీ కది వినరాదు. మీ ఏకాగ్రత ఎంత అధికమో అంత చక్కగా నా భావము మీకు తేటపడును. నా ప్రేమను, నా మానసికశక్తులను, నేను కేంద్రీకరించు కొలది, నా భావములను మీకు విశదీకరించు శక్తి యెక్కువగుచుండును. ఈ కేంద్రీకరణశక్తి యధికమగుకొలది, జ్ఞానార్జన మధిక మగుచుండును. ఏలన, జ్ఞానార్జన కిదియే ఏకైకమార్గము. అతిస్వల్పుడు కూడ — పాదరక్షలకు రంగువేయువాడు కూడ — మనశ్శక్తిని తన పనిపై కేంద్రీకరించినచో, దానిని మిక్కిలి బాగుగా చేయ గలుగును. వంటచేయువాడు బుద్ధిని కేంద్రీకరించినచో, మామూలుకన్న బాగుగా వంట చేయును. ధనార్జనమం దైనను, భగవదారాధన మందైనను, మఱి యే యితర కార్యమం దైనను, ఏకాగ్రత అధికమగు కొలది, కార్య మెక్కువ చక్కగా నిర్వహింపబడుచుండును. ప్రకృతి తన తలుపులు తెఱచి కాంతిపూరములు వెలువరింపవలె నన్నచో, పిలువవలసిన పిలుపు ఇదియే, తట్టవలసిన తలుపు ఇదియే. జ్ఞానధనాగారమును తెఱవగల తాళ మీ కేంద్రీకరణశక్తి యొక్కటే. రాజయోగ శాస్త్రమునందు వివరింపబడిన విషయ మించుమించుగా ఇది యొక్కటియే అని చెప్ప నొప్పును. మన ప్రస్తుత శరీరస్థితిలో మనలను కలవరపెట్టు కార్యము లెన్నియో యుండును. మన మానసికశక్తులు నూఱు తెఱగులుగా చీలి వ్యర్థమగుచున్నవి. నా తలపులను

స్వాస్థపఱచి ఏదో ఒక్క ముఖ్యవిషయముపై బుద్ధిని కేంద్రీ
కరింప జూచితినేని, నా కక్కఱలేని ప్రేరణలు, తలపులు,
వేనవేలుగా బుద్ధిలోనికి చొరబడి దానిని కకావికలు
చేయును. దీనిని ప్రతిఘటించి మనస్సును స్వాధీనములోనికి
తెచ్చు మార్గమునే రాజయోగము నేర్పునది.

ఇక కర్మయోగమును — కర్మాచరణము ద్వారా
భగవంతునితో కూడు మార్గమును — కైకొందము. ఏదో
యొక కార్యాచరణముకొఱకే జన్మించినట్టుండువారి
నెందఱనో మన మీ లోకములో చూచుచుందుము. వారి
బుద్ధి భావక్షేత్రమున నిలువనే నిలువదు. ప్రత్యక్షరూపమున —
చూడదగిన, తాకదగిన, రూపమున — కానిపించు కార్య
కలాపమే వారి మనస్సునంతయు ఆక్రమించుకొనియుండును.
ఇట్టివారి జీవితముల కుపకరించు శాస్త్రముకూడ ఒకటి
ఉండవలెను కదా. మన మందఱ మేదో యొక కర్మ
మొనర్చుచునే యుందుము. కాని కర్మరహస్య మెఱుగక
ఎందఱెందఱమో మన జవసత్త్వములను చాలవఱకు వ్యర్థ
పఱచుకొనుచుందుము. కర్మయోగ మీ రహస్యమును
బోధించును. ఎచ్చట, ఎట్లు, కర్మ మొనర్పవలసినది, చేత
బూనిన కార్యమును సాధించుటకు మన శక్తిలో నత్యధిక
భాగమును — అత్యధికఫలముకలుగునట్లు — వినియోగించు
టెట్లో, అది బోధించును. ఈ రహస్యమును నేర్చుకొనుచో
కర్మాచరణమునకు గల యొక గొప్ప ఆక్షేపమునుకూడ
మనము గమనింపవలెను. కర్మాచరణముచే క్లేశము కలుగు

చుండు ననుచే ఈ యాక్షేపము. మనశ్శరీరములకు కలుగు క్లేశము లన్నిటికి సంగమే కారణము. కర్మ మొనరించుట నా కిష్టము. ఒకనికి మేలు చేయగోరెదను. కాని అత డా మేలును మఱచి నా కపకారము చేయు అవకాశము లత్యధికముగా గలవు. అట్లు జరిగినచో నాకు మనః క్లేశము కలుగును. క్లేశము కలుగునన్న ఈ భీతి కర్మాచరణమున కడ్డుతగిలి మానవుల కార్యోత్సాహమును, కార్యశక్తిని, చెఱచుచుండును. నిస్సంగబుద్ధితో, ఎవరికి తోడ్పడుచున్నది ఏల తోడ్పడుచున్నది విచారింపక, కర్మముకొఱకే కర్మ మొనర్పు మని కర్మయోగము బోధించును. కర్మయోగి కార్యాచరణమగ్నుడై యుండుటకు కారణమేమి? అది అతని నైజముగనుక; తన కది హితమని అతనికి తోచును గనుక. అంతయే. అతనికి ఉద్దేశ మేదియు లేదు. అత డెప్పుడును ఇచ్చుచుండు వాడే. పుచ్చుకొనుట అను మాటనే అత డెఱుగడు. కావున అతడు క్లేశమునకు అతీతుడు. మనకు కలుగు క్లేశ మంతటికిని సంగమే మూలకారణము.

ఇక భక్తియోగము — ఇది భావావేశస్వభావముగల వాని, ప్రేమపూరితహృదయుని, మార్గము. భగవంతుని తన ప్రేమపదముగా చేసికొనవలెనని అతని సంకల్పము. అందుకై అత డేవేవో కర్మకలాపము లవలంబించును; పరిమళ పుష్పధూపములు, సుందరమందిరములు, మనోజ్ఞాకృతులు, మున్నగువాని నాధారము చేసికొనును. వారిది సరియైన మార్గము కాదందురా? మీ కొక విషయ మిచట తెలుప

వలసియున్నది. పురాణవాఙ్మయసమృద్ధి, కర్మకలాపసమృద్ధి, అపారముగా గల మతములందుండియే లోకములోని ఆధ్యాత్మిక మహాపురుషు లందఱు నావిర్భవించి రని మీరు — ముఖ్యముగా ఈ దేశపువారు—జ్ఞప్తి పెట్టుకొనుట మంచిది. భగవద్రూపరహితముగా, ఉపచారరహితముగా, ఆరాధన మొనర్పఁజూచిన శాఖలన్నియు, మతములలోఁగల సుందర వస్తువులను, మహనీయవస్తువులను, కటిక ఱెందములతో అణఁగద్రొక్కి వైచినవి. కన్నుగానని మూర్ఖవిశ్వాసమే వారి మతము. అది కేవలశుష్కరూప మైనది. ప్రపంచ చరిత్రమే ఇందుకు ప్రబలసాక్షి. కావున ఈ కర్మకలాపము లను, పురాణములను, తూలనాడకుఁడు. వాని నుండనిండు. వానియందు అక్కఱగలవారి కవి ఉపకరించుఁగాక! వారిని చులుకఁజేసి వెడనగవుతో "మూఢులు! పాపము వారి కవి యుండనిండు!" అనఁబోకుఁడు. అది మహాప్రమాదజనిత మగు అనుచితచర్య. నేను చూచినవా రందఱిలో మహోన్నతులు, అత్యద్భుతమగు ఆధ్యాత్మికపరిపూర్ణత నొందినవారు, అందఱును ఈ కర్మకలాపశిక్ష నొందినవారే. వారి పాదము లంటి కూర్చుండుటకుకూడ నే ననర్హుఁడను. అట్టి నేను — వారి నాక్షేపించుటయా! మనుష్యమానసములపై ఈ భావముల ప్రభావ మెట్టిదో, వానిలో వేని నాదరింపవలెనో, వేనిని నిరాకరింపవలెనో, నా కెట్లు తెలియును? ప్రపంచములో ప్రతివారిని అకారణాక్షేపములపాలు చేయుట మన కలవాటు. జనులకు ఇచ్చవచ్చినన్ని పురాణము లుండుఁగాక! అవి కల్పించు మనోహరప్రేరణలు వారికి లభించుఁగాక!

భావోద్రేకస్వభావము గలవారికి సత్యముయొక్క తత్త్వరూప నిర్వచనములు రుచించునా? భగవంతుడు వారికి స్పర్శవేద్యుడు (తాకి చూడదగినవాడు), ఏకైకయథార్థవస్తువు. వారి కన్నుల కాయన కనిపించును, చెవులకు వినిపించును, మనస్సునకు తోచును. వారి కాయన ప్రేమపదము. కావున వారి దేవుడు వారి కుండు గాక! మీ హేతువాది వారికి కథలోని మూఢునివలె తోచును. ఆ మూఢు డొక చక్కని విగ్రహమును చూచి, అది దేనితో చేయబడెనో చూచుటకై దానిని పగులగొట్ట సంకల్పించెనట! భక్తియోగము వారికి ప్రేమమార్గమును బోధించును : 'ఉత్తరోత్తర లాభము లపేక్షించి ప్రేమింపరాదు. భగవంతుని, సత్పురుషులను, ప్రేమించుట మంచిది గనుక ప్రేమింపవలెను. స్వర్గప్రాప్తి, పుత్రప్రాప్తి, ధనప్రాప్తి, మున్నగు వానిని కోరి ప్రేమింపరాదు.' ప్రేమకు ప్రేమయే మహోత్తమరూపప్రతిఫల మనియు, భగవంతుడు ప్రేమస్వరూపుడే అనియు, అది బోధించును. సృష్టికర్తగా, సర్వగతుడుగా, సర్వజ్ఞుడుగా, సర్వశక్తిసమేతుడగు ఈశ్వరుడుగా, తల్లిగా, తండ్రిగా, ఇట్లనంతకల్యాణగుణపరిపూర్ణుడుగా, భగవంతుని కీర్తింపు మని దాని బోధ. భగవంతుని వర్ణించు నత్యున్నతవాక్కు, అతనినిగూర్చి మానవబుద్ధి కల్పించుకోగల అత్యున్నత భావము, అతడు ప్రేమస్వరూపు డనియే. ప్రేమ ఎచట నున్నను, అది అతడే; భగవంతు డచట నుండును. "భార్యను భర్త పెట్టుకొను ముద్దులో నతడు కలడు. తల్లి బిడ్డను పెట్టుకొను ముద్దులో నతడు కలడు. మిత్రు లొండొరుల

చేతులు జోడించుకొనునప్పు డాయన ప్రేమరూపుడై అందుం డును. మానవజాతిని ప్రేమించు మహాపురుష డొకడు వారి కుపకార మొనర్పజూచునప్పు డతడు తన ప్రేమామృతమును మానవలోకమునకు ధారాళముగా పంచిపెట్టుచున్నాడు. హృదయ మెప్పుడెప్పుడు ఉదార మగునో, అప్పు డత డచ్చట ప్రసన్నుడై యుండును. ఇదియే భక్తియోగబోధ.

చివరకు జ్ఞానయోగి కడకు వత్తము. ఇతడు వేదాంతి, తత్త్వవిచారపరుడు, దృశ్యలోకమును దాటిపోవు కుతూ హలము కలవాడు. ఈ లోకములోని క్షుద్రవస్తువు లతనిని తృప్తిపఱుపజాలవు. నిత్యకృత్యములగు భోజనమజ్జనాదుల నతిక్రమించి పోవలెనని అతని భావము. వేనవేలు గ్రంథము లలో గల బోధ యంతయు అతనిని తృప్తిపఱుప జాలదు. అవి చేయగలిగిన మహాకార్య మీ లోకము నతని యెదుట నిలుపుటే గదా. అతని నింకేది తృప్తిపఱుపగలదు? లక్షోప లక్షల ప్రపంచమండలములేని అతనికి లెక్కలేదు. అస్తిత్వ మను మహాసముద్రములో అవి యన్నియు అతని కొక బిందువుగా తోచును. వీని నన్నిటి నతిక్రమించి అస్తిత్వము యొక్క మూలకేంద్రములోనికి పోవుట కతని ఆత్మ ఉవ్విళ్లూరు చున్నది. పరమసత్యమును యథార్థస్వరూపముతో చూడ వలెను; దానిని సాక్షాత్కరించుకోవలెను; తాను అదియే కావలెను; ఆ సర్వమయత్వముతో తా నైక్య మొందవలెను. అట్టివాడు వేదాంతి. తండ్రి, తల్లి, సృష్టికర్త, రక్షకుడు, మార్గదర్శి, మున్నగు భావములు దేవుని సూచించుటకు కేవలము అసమర్థములని అతని తలంపు. భగవంతు

కతని ప్రాణమునకు ప్రాణము. అతని ఆత్మకు ఆత్మ. తన ఆత్మయే భగవంతుడు. భగవంతుడు కాని వస్తు వితర మేదియు లేదు. వేదాంతవిద్యామహాప్రఘాతములచే (సమ్మెట పోటులచే) అతనిలోని నశ్వర (నశించు) భాగము లన్నియు పిండియై తుడిచివేయబడినవి. చివర కతనిలో నిజముగా మిగిలియున్నది భగవంతుడు మాత్రమే.

ఒకే చెట్టుపై రెండు పక్షులు నిలిచియున్నవి : ఒకటి చిట్టచివర కొమ్మమీద, రెండవది క్రింది కొమ్మమీద. పై పక్షి ప్రశాంతముగా, మౌనముగా, గంభీరముగా, స్వప్రభావమగ్నమై, యున్నది. క్రింది పక్షి తీయని పండ్లను చేదుపండ్లను తినుచు, ఒక కొమ్మనుండి మఱొక కొమ్మమీది కెగురుచు, సుఖాసుఖముల ననుభవించుచున్నది. కొంత సేపటి కీ క్రిందిపక్షి మఱియు మిక్కిలి చేదుపం డొకటి తిని, విసుగు చెంది, తల యెత్తి ఆ పై పక్షిని చూచును. బంగరు ఈకలు గల ఆ అద్భుతపక్షి తీయని పండ్లు గాని చేదు పండ్లు గాని తినుటలేదు. దానికి కష్టానుభూతి గాని సుఖానుభూతి గాని లేదు. ప్రశాంతముగా, ఆత్మస్థమై, తన ఆత్మను తప్ప వేఱేమియు చూడక, కూర్చుండి యున్నది. ఆ స్థితి నొందుటకై క్రింది పక్షి తీవ్రముగా వాంఛించునుగాని, అచిరకాలముననే మఱచి మరల ఫలభక్షణ మారంభించును. కొంతసేపటికి మఱియొక మిక్కుటపు చేదుపండు తిని, మిక్కిలి ఖేద మొంది, మరల పైకి చూచి, పై పక్షిని సమీపింప జూచును. కాని మరల మఱచి, మఱికొంత సేపటికి పైకి చూచి, ఇంకొక పై కొమ్మ కెగురును. అట్లు పై పైకి ఎగిరిఎగిరి, చివర కా

చక్కని పక్షిని మిక్కిలి సమీపించును. అప్పుడా పై పక్షి యొక్క ఱెక్కల కాంతి ప్రతిఫలించి తన శరీరము నంటి ప్రకాశించుచున్నట్లు అది కన్గొనును. దాని కేదో మారొ్పకటి తోచును. తాను కరగిపోవుచున్న ట్లనిపించును. అంత నది ఇంకను సమీపమునకు వచ్చును. ఇప్పుడు తానంతయు కరగిపోవుచున్నది. చివర కీ అద్భుతపు మార్పు దానికి తెలిసిపోవును. క్రింది పక్షి ప్రత్యేకవస్తురూపమున తోచినను, అది పై పక్షియొక్క నీడయే. నిజమునకు తానెప్పుడును ఆ పై పక్షియే. ఈ తినుట, ఈ తీయని పండ్లు, ఈ చేదుపండ్లు, ఈ క్రింది చిన్నపక్షి, ఒకసారి సుఖించుట, ఒకసారి దుఃఖించుట — ఇదంతయు వట్టి భ్రమ, స్వప్నము. మొదటినుండియు, నిజమైనపక్షి ప్రశాంతముగా, మౌనముగా, గంభీరముగా, వైభవోపేతముగా, ఖేదాతీతమై, పరితాపాతీతమై, పై కొమ్మమీదనే ఉండెను. పై పక్షి భగవంతుడు, జగదీశ్వరుడు; క్రిందిది జీవాత్మ : లోకములోని తీయనిపండ్లను చేదుపండ్లను తినుచున్నది. జీవాత్మ కప్పుడప్పు డొక బలీయమగు దెబ్బ తగులును. తినుట కొంతతడవు మాని అజ్ఞాతుడగు భగవంతుని దెస కేగును. అప్పు డొక కాంతిపూరము కానిపించి, ఈ జగ త్తొక నిస్సారమగు మిథ్యాదృశ్య మను భావము కలుగును. కాని ఇంద్రియములు మరల క్రిందికి లాగును. మరల ఈ ప్రపంచములోని తీయని పండ్లను, చేదు పండ్లను, తిన నారంభించును. మరల నొక అత్యంత బలిష్ఠమగు దెబ్బపడును. హృదయము మరల వికసించి, ఆ దివ్యకాంతి పూరముచే దీప్తమగును. ఇట్లతడు క్రమ

క్రమముగా భగవంతుని సమీపించుచుండును. సమీపించు కొలది, తన తొల్లిటి ఆత్మ కరగిపోవుచున్నట్లతడు కన్గొనును. బాగుగా సమీపించినప్పుడు తానే ఆ భగవంతు డని గ్రహించి, "ఈ జగత్తునకు ప్రాణమని; అణువులందును, సూర్యులందును, చంద్రులందును, ఉండు వాడని; నే నెవ్వని వర్ణించి చెప్పియుంటినో అతడే మన ప్రాణమునకు ప్రాణము, మన ఆత్మకు ఆత్మ — అంతే కాదు, నీవే అతడవు" అని హర్షాశ్చర్యములతో కేకవేయును. జ్ఞానయోగబోధ యిది. "నీవు వస్తుతః భగవంతుడవే" అని అది మానవులకు తెలుపును. పారమార్థికదృష్టికి సర్వభూతము లొకే వస్తువనియు, మనలో ప్రతివాడును భూలోకమున రూపెత్తిన భగవంతుడే యనియు, అది మానవకోటికి నిరూపించును. మన మందఱము—మనపాదముల క్రింద ప్రాకు చిఱు కీటకము మొదలు మనల నాశ్చర్యచకితుల నొనర్చు మహాపురుషుల వఱకు — ఆ యేకైకదైవముయొక్క వ్యక్తరూపులమే.

ఇంకొక్క చివరమాట. ఈ యోగము లన్నిటిని అనుభవసిద్ధములుగా చేసికొనవలెను. ఇది అత్యంతముఖ్యము. బుద్ధిగ్రాహ్యము లొనర్చుకొనుట చాలనే చాలదు. అది నిష్ప్రయోజనము. మొదట వానినిగూర్చి వినవలెను, పిదప మననము చేయవలెను. హేతుబద్ధముగా వానిని గూర్చి ఆలోచింప వలెను. వానిని మన మనస్సులలో నాటుకొన జేయవలెను. వానినిగూర్చి ధ్యానింపవలెను. వాని ననుభూత మొనర్చుకోవలెను : చివరకు అవి మన సర్వజీవితరూప మొందవలెను. ధర్మము (Religion) అప్పుడు

9

భావసముదాయముగా, సిద్ధాంతసముదాయముగా, బుద్ధి సమ్మతవస్తువుగా, నుండుట మాని మన ఆత్మలోనికే ప్రవేశించును. నేడు బుద్ధిసమ్మతములుగా నున్న అనేక వస్తువులు రేపు వెట్టిమొట్టివని యెఱిగి మనము అభిప్రాయము మార్చుకొనవచ్చును. కాని సత్యధర్మ (**True Religion**) భావ మెన్నటికిని మార్పు నొందదు. అది అనుభూతి, వట్టి మాటలు కాదు. ఇ వెంత మనోజ్ఞములుగా నున్నను, సత్యధర్మము కానేరవు. అది స్థితి (ఉండుట), సిద్ధి (అగుట): వినుట, సమ్మతించుట, కాదు — ఆత్మ యంతయు తన విశ్వాసానుసారముగా మాఱుట. అదియే ఆస్తికధర్మము.



# హిందూమతము :
# అందలి ముఖ్యాంశములు

## హిందూశబ్దపు ఉత్పత్తి

మన మిప్పుడు హిందువుల మని చెప్పుకొనుట ఆచార మైపోయినది. కాని ఈ మాట కిప్పు డేమియు అర్థములేదు. మొదటిలో ఈ మాటకు "సింధూనదికి ఆవలివైపువాడు" అని యర్థ మైయుండెను. ప్రాచీనపారసీకులు ఈ "సింధూ" శబ్దమును భ్రష్టమొనర్చి "హిందు"గా మార్చిరి. సింధూ నదికి ఈవల నుండువారి నందఱను వారు హిందువు లని పేర్కొనుచుండిరి. అదియే మన హిందూనామమునకు మూలము. మహమ్మదీయపరిపాలనాకాలమున మనమే ఆపేరును కైకొని వాడుకొన నారంభించితిమి. ఆ పేరును వాడుటలో చెఱుపేమియు లేదు గాని, నే నిప్పటికే చెప్పి నట్లు అది యిప్పుడు అర్థశూన్య మైపోయినది. ఏలయన ఆ ప్రాచీనకాలమునందువలె గాక యిప్పుడు సింధూనది కీవలి యొడ్డున వివిధమతములవారు — హిందువులేకాక మహమ్మదీయులు, క్రైస్తవులు, జైనులు మున్నగువారు — కూడ నివసించుచున్నారుగదా. కావున ఈ హిందూ శబ్దము నుపయోగించుట నా కిష్టములేదు. అది కాకపోయినచో, మ ఱే శబ్దమును మన ముపయోగింపవలెను? వైదికులు (వేదమతావలంబులు) అను శబ్దము సముచితముగనే

యుండును. వేదాంతులు (వేదాంతమతావలంబులు) అను శబ్దము అంతకన్న శ్రేష్ఠము.

## వేదములు

లోకములో గల మహామతములం దనేకములు కొన్ని గ్రంథములను ప్రమాణములుగా అంగీకరించి, వాని ననుసరించుచుండును. అవి ఈశ్వరవాణి యనియో, మానవాతీతులగు మహాపురుషుల వాణి యనియో, ఆయామతములవారు విశ్వసింతురు. ఆ గ్రంథములే వారి మతమునకు మూలాధారములు. అట్టిగ్రంథములన్నిటిలో హిందువుల వేదములే ప్రాచీనతమములని ఇప్పటి పాశ్చాత్యవిద్వద్వరేణ్యు లందఱును అంగీకరించుచున్నారు. కావున వేదముల విషయము మన మొకించుక కనుగొనియుండుట ముఖ్యము. వేదములనెడు పేర బరగు వాఙ్మయమున నుండునవి మానవభాషితములు కావు. వాని రచనాకాల మింతవఱకును నిర్ణయింపబడలేదు, ఇకమీదట కూడ నిర్ణయింపబడజాలదు. మన మవి సనాతనము లనియు, ఆద్యంతరహితము లనియు విశ్వసింతుము. ఈ సందర్భమున మీ రొక ముఖ్యవిషయమును జ్ఞప్తి పెట్టుకోవలయును. లోకములో గల తక్కిన మతము లన్నియు తమ ప్రామాణికత కాధారముగా అందలి సందేశము నొక సాకారదైవమో, కొందఱు మహాపురుషులో, దేవయోనులో, ఈశ్వరునిచే ఈ కార్యమునకై నియుక్తులైన సందేశహరులో, కొందఱ కందజేసి రని పల్కును. హిందువు లట్లుకాక వేదముల ప్రామాణికత మానవులపై ఆధారపడినది కా

దనియు, అవి సనాతనములు — ఈశ్వరజ్ఞానమయములు — అగుటచే స్వయంప్రామాణికములు అనియు చెప్పఁదుడు. అవి యెన్నడును రచింపబడలేదు, ఎన్నడును సృష్టింపబడ లేదు. అవి కలకాలము ఉండియే యున్నవి. సృష్టి యెట్లు అపారము, శాశ్వతము, ఆద్యంతరహితమో, అట్లే ఈశ్వర జ్ఞానముకూడ ఆద్యంతరహితము. వేదములు (విద్ = ఎఱుగుట) అనగా ఈ జ్ఞానమే. వేదాంతనామమున బరగు జ్ఞానరాశిని కొందఱు మహాపురుషులు దర్శించి ప్రకటించిరి. ఆ మహాపురుషులకు ఋషు లని పేరు. ఋషి యనగా మంత్రద్రష్ట — ఒక భావమును చూచినవాడు. అనగా ఆ భావ మతని స్వకీయముకాదు. వేదములలో గల ప్రకరణ మేదేని యొక ఋషికి ఆరోపింపబడినప్పుడు, దాని నతడు రచించెననిగాని, అది యతని స్వబుద్ధికల్పిత మనిగాని, తలప రాదు. ఆ భావ మంతకు పూర్వముననే కలదు. జగత్తునం దది అనాదిసిద్ధమై యున్నది. దాని నతడు చూచెను. ఋషులు పారమార్థికసత్యద్రష్టలు.

ఈ వేదవాఙ్మయములో రెండుప్రధానభాగములు కలవు : కర్మకాండము, జ్ఞానకాండము — కర్మకలాప భాగము, పారమార్థికజ్ఞానభాగము. కర్మకాండములో వివిధ క్రతువులు పేర్కొనబడియున్నవి. ఆ క్రతువులలో అత్యధిక భాగ మిప్పటి స్థితిగతులందు ఆచరణసాధ్యములుకావని విడనాడబడినవి. కాని తక్కిన వీనాటికిని ఏదో యొక రూపమున నిలిచియేయున్నవి. కర్మకాండములోని ముఖ్య

భావము లగు మానవధర్మములు — బ్రహ్మచర్య, గృహాస్థ, సన్న్యాసాశ్రమ ధర్మములు, వివిధపదవీధర్మములు — నేటికిని కొంతకొంత అనుసరింపబడుచునే యున్నవి. మన మతముయొక్క పారమార్థికభావములు రెండవభాగమున, అనగా జ్ఞానకాండమున, కలవు. ఇదియే వేదాంతము — వేదాగ్రము, వేదసారము, వేదపరమార్థము. వేదవిజ్ఞానసార మగు ఈ వేదాంతమే ఉపనిషద్వాఙ్మయము. హిందూ దేశమున గల వివిధశాఖలు — హిందూమతావలంబుల మని చెప్పుకొన సాహసించు సంప్రదాయములు — ద్వైతులు గాని, విశిష్టాద్వైతులుగాని, అద్వైతులుగాని; లేక, శైవులుగాని, వైష్ణవులుగాని, శాక్తులుగాని, సౌరులుగాని, గాణపతులుగాని, వేదోపనిషత్ప్రమాణము నంగీకరించియే తీఱవలెను. ఎవరి యిచ్ఛప్రకారము వా రా యుపనిషత్తులకు వేర్వేఱు అర్థములు చెప్పుకొనవచ్చును; వారి కా విషయ మున పరిపూర్ణ స్వేచ్ఛ కలదు; కాని వాని ప్రామాణికత నంగీకరింపకుండు స్వేచ్ఛ లేదు. కావుననే మనము హిందూ శబ్దమునకు మాఱు వేదాంతిశబ్దము నుపయోగింపగోరుట. ఆస్తికమతావలంబు లగు హైందవతత్త్వవేత్త లందఱును వేదాంతప్రమాణబద్ధులే. ఈ కాలమున వ్యాప్తిలోనుండు మతశాఖ లన్నియు — అవి ఎంత అపరిపక్వములుగా కానిపించినను, వాని ఉద్దేశము లెంత దురవగాహాముగా తోచినను — సావధానముగా చదివి పరిశీలించినచో, వానికి ఉపనిషద్భావములే మూలము లని తెలియవచ్చును. హైందవమతశాఖాసంప్రదాయములలో, కేవల మపరిపక్వ

రూపము గలవై, ప్రతిమాప్రతీకారాధనలను* విధించువానిని పరీక్షించి చూచినను, వారు ఉపనిషద్భావముల యొక్క మూర్తరూపములనే ఆరాధించుచున్నారను విచిత్రసత్య మొక్కొక్కతడవ గోచరించును. మన జాతి లోనికి ఉపనిషత్తు లంత పూర్తిగా దిగబడి పోయినవి. కావుననే విగ్రహాదిరూపములందుకూడ అవి ఆరాధింపబడుచున్నవి. నేడును మన యిండ్లలో గృహదేవతా రూపము లంది మహోన్నత తాత్త్విక, పారమార్థికరూపములగు ఉపనిషద్భావములు అర్చింపబడుచున్నవి. వేదాంతమునందు ఉపమానరూపమున కానవచ్చు భావము లనేకములు ప్రజావ్యాప్తి నంది ప్రతిమాప్రతీకరూపమున మన నిత్యజీవితముతో అవినాభావసంబంధ మేర్పఱచుకొని శాశ్వతముగా నిలిచిపోయినవి. మన జాతియం దిప్పుడు గల ప్రతిమాప్రతీకము లన్నియు ఈ విధముగా ఉత్పత్తియైనవే. అవన్నియు ఉపనిషద్భావములనే తెలుపునవి.

## మత భేదములు

హిందూదేశములో నేడు గల మతశాఖ లన్నిటిని ద్వైతము, అద్వైతము అను రెండు ప్రధానశాఖలుగా విభజింపవచ్చును. తమ తమ భావములందు గల స్వల్పభేదములకు ప్రాముఖ్య మిచ్చి శుద్ధాద్వైత మని, విశిష్టాద్వైత మని భిన్ననామములు కల్పింతురుగాని, ఈ భేదములు అంత ముఖ్యములుకావు. సమష్టివిభజనలో వారు ద్వైతగణము

* ప్రతిమ = విగ్రహము; ప్రతీకము = చిహ్నము, గుఱుతు.

ననో అద్వైతగణముననో చేరుదురు. నేడు కానవచ్చు శాఖాంతరములలో కొన్ని కేవలము వినూత్నములు, తక్కినవి అత్యంతప్రాచీనశాఖలయొక్క మాఱురూపములు. నేను పేర్కొన్న రెండు ప్రధానశాఖలలో నొకదానిని శ్రీ రామానుజాచార్యుని మత, జీవితరూపముననను, రెండవ దానిని శ్రీ శంకరాచార్యుని మత, జీవితరూపముననను మీకు ప్రదర్శింతును. ప్రాచీనకాలానంతరము హిందూదేశ మున ప్రఖ్యాతిగాంచిన ద్వైతమతప్రబోధకులలో శ్రీ రామానుజులవారే ముఖ్యులు. తక్కిన ద్వైతశాఖ లన్నియు — ప్రత్యక్షముగనో, పరోక్షముగనో — ఆయన బోధనే అనుకరించినవి. వాని బోధనసార మదియే, సంప్రదాయ వ్యవస్థీకరణముకూడ — సూక్ష్మాతిసూక్ష్మాంశము లందును — అదియే. శ్రీ రామానుజుని, అతని మతప్రచారమును, హిందూదేశములో గల తక్కిన ద్వైతవైష్ణవసాంప్రదాయ కులతో పోల్చిచూచినచో, వానియందు — వ్యవస్థానిర్మాణ మార్గముననను, బోధనవైఖరిలోను, ప్రచారవిధానముననను— ఆశ్చర్యకర మగు పోలిక కానవచ్చును. దక్షిణదేశమున మధ్వాచార్యుడును, ఆయన చేసిన తత్త్వబోధనే ఆధారము చేసికొని వంగదేశమున మతప్రచారము గావించిన చైతన్య మహాప్రభువును, ఈ సందర్భమున పేర్కొనదగుదురు. దక్షిణదేశమున విశిష్టద్వైతశైవాది సంప్రదాయములను కొన్నింటిని కూడ పేర్కొనవచ్చును. దక్షిణదేశమునందలి కొన్ని ప్రాంతములలోను, సింహళద్వీపముననను, తప్ప హిందూదేశమం దంతటను శైవులు ప్రాయికముగా అద్వై

తులే. కాని వారు (అద్వైతులుకానట్టి శైవులు) కూడ ఆత్మనుగూర్చిన సిద్ధాంత మొక్క-దానివిషయమునతప్ప సర్వ విధముల — విష్ణుస్థానమున శివు నుంచు — రామానుజ మతస్థులే యని చెప్పవచ్చును. రామానుజానుచరులు ఆత్మ 'అణువు' — నలుసువలె అత్యంతస్వల్పమైనది — అందురు. శంకరానుచరు లది 'విభువు' — సర్వవ్యాపి — అందురు. అద్వైతసంప్రదాయశాఖ లెన్నియో గలవు. ప్రాచీనకాల మున నుండిన అట్టి శాఖలలోని భావములను కైకొని, వాని నన్నిటిని ఇముడ్చుకొనియే, శంకరుడు తన మతసిద్ధాంతమును నిర్మించినట్లు కానవచ్చుచున్నది.

ఈశ్వరుడు, ఆత్మ, ప్రకృతి : ఈ మూడును నిత్యము లని రామానుజుని సిద్ధాంతము. ఆత్మ లన్నియు నిత్యములు ; వాని అస్తిత్వ మట్లే కలకాలము నిలిచియుండును ; ఎప్పటికిని అవి వేర్వేఱుగనే యుండును ; వాని వ్యక్తిత్వ మెప్పటికిని చెక్కు-చెదరకుండును. రామానుజసిద్ధాంతప్రకారము మన అందఱి ఆత్మలును అనంతకాలము భిన్నములుగనే ఉండును ; ఆత్మయొక్క ఉనికియు ఈశ్వరునియొక్క ఉనికియు ఎట్లు సత్య ములో, అట్లే ఈప్రకృతియును సత్యమై కలకాలము భిన్న ముగనే నిలిచియుండును. ఈశ్వరుడు ఆత్మలలోపల నంతయు నిండి వానికి సారభూతుడై యుండును. అతడు అంతర్యామి. ఈ యర్థమున ఈశ్వరుడు ఆత్మతో ఐక్యముకలిగి, ఆత్మకు సారభూతుడై యుండువా డని రామానుజు డొక్కొక్కసారి తలంచును. ప్రళయకాలమందు ప్రకృతి సంకుచిత మగు ననియు, అప్పు డీ ఆత్మలుకూడ సంకుచితత్వము నొంది

అజ్ఞేయములై, కొంతకాల మట్లే యుండుననియు ఆయన పల్కెను. నూత్నకల్పారంభమున అవన్నియు వాని పూర్వకర్మానుసారము వెలువడి తమతమ కర్మఫలముల ననుభవించును. ఆత్మకుస్వతస్సిద్ధమగు పారిశుద్ధ్యమును, పరిపూర్ణతను సంకుచిత మొనర్చు కర్మము లన్నియు దుష్కర్మము లనియు, వానిని వెలువఱచి వికాసమంద జేయు కర్మము లన్నియు సత్కర్మము లనియు ఆయన చెప్పెను. ఆత్మవికాస హేతువు లగున వన్నియు మంచివి, ఆత్మసంకోచ హేతువు లగున వన్నియు చెడ్డవి. ఈశ్వరకృపచే మోక్షము సిద్ధించువఱకును ఆత్మ యిట్లే సంకోచవ్యాకోచముల నందుచుండును. ఆ ఈశ్వరకృప పరిశుద్ధములై కృపాసిద్ధికై పాటుపడు ఆత్మ లన్నిటికిని ప్రాప్తించు నని రామానుజుని బోధ.

హిందూదేశపు ద్వైతమతశాఖలవారు జీవాత్మల యొక్క వ్యక్తిత్వము సర్వదా నిలిచియేయుండు ననియు, ఈశ్వరుడు జగత్తునకు నిమిత్తకారణముమాత్రమే యనియు, దాని ఉపాదానకారణరూపమగు పదార్థ మప్పటికే యుండెననియు, దాని నుపయోగించి యతడు సృష్టికార్య మొనర్చె ననియు చెప్పుదురు. కాని అద్వైతు లతడు నిమిత్తకారణముమాత్రమే కాక ఉపాదానకారణముకూడ నందురు: సృష్టికార్య మొకటిమాత్రమే చేయుట కాదు, తనలో నుండియే జగత్తును సృష్టించును. ఈశ్వరు డీ జగత్తును తనలోనుండియే సృజించెనుగాని, అతడును అదియును కలకాలము వేర్వేఱుగా నుండుననియు, సర్వమును ఈశ్వరుని శాశ్వతాధీనములో నుండుననియు పలుకు అపరిపక్వరూప

ద్వైతశాఖలు కొన్ని కలవు. ఈశ్వరుడీ జగత్తును తనలో నుండియే సృజించె ననియు, జీవాత్మలు కాలపరిపాకమున నిర్వాణ మొంది తమ అపరిపూర్ణతను విసర్జించి పరిపూర్ణత నందుననియు పలుకు శాఖలుకూడ కొన్ని కలవు. కాని ఈ శాఖ లన్నియు అంతరించిపోయినవి. ఈ కాలమున హిందూ దేశములో గల అద్వైతు లందఱును శంకరానుచరులే. జగత్తున కీశ్వరుడు ఉపాదానకారణమును, నిమిత్తకారణ మును కూడ — కాని ఇది యథార్థముగా కాదు, మాయా మూలముననే — అని శంకరుని సిద్ధాంతము. ఈశ్వరుడే జగత్తుగా మాఱలేదు. జగత్తు అసత్యము, ఈశ్వరుడు సత్యము. ఈ అద్వైతవేదాంతమున గ్రహింపవలసిన అత్యు న్నత విషయములలో ఈ మాయాభావ మొకటి.

## 'వేదాంతము' అనగా అద్వైతవేదాంత మొకటియే కాదు

'వేదాంతము' అనగా 'అద్వైతవేదాంత మొక్కటియే' అని అనేకులు మన దేశములో ఈ కాలమున భావించు చున్నారు. ఇది పొరపాటు. మన మతసిద్ధాంతముల నవగాహనపఱచుకొన జూచువారి కందఱకును ప్రస్థాన త్రయములో గల ప్రతిదియు ముఖ్యమే అను సత్యమును మన మెన్నడును మఱవరాదు. ఈ ప్రస్థానత్రయములో మొదటిది ఈశ్వరవాణి యగు శ్రుతులు, అనగా ఉపనిషత్తులు. రెండవది వ్యాసుని బ్రహ్మసూత్రములు. అంత వఱకు ప్రతిపాదింపబడిన తత్త్వసిద్ధాంతము లన్నిటియొక్క పరమస్వరూపము వానిలో కలదు గనుక ఈ సూత్రములకం

తత్త్వవాఙ్మయమందు అత్యంత ప్రాముఖ్యము కలిగినది. ఆ పూర్వసిద్ధాంతములు పరస్పరవిరుద్ధములు కావు. అందు ప్రతిదియు తత్పూర్వసిద్ధాంతములపై ఆధారపడి నిలిచి వానిని మఱింత విస్తృతపఱచుచు వచ్చినవి. వ్యాససూత్రములలో వానికి పరిపూర్ణ స్వరూపము సిద్ధించినది. ఉపనిషత్తులకును, వేదాంతమందు గల మహాద్భుతసత్యములకు నియమబద్ధ స్వరూపము కల్పించిన వ్యాససూత్రములకును, సమస్త వేదాంతమునకు ఈశ్వర నిర్మిత వ్యాఖ్యానరూప మగు శ్రీ భగవద్గీత కలదు. ఆస్తికమతము లని చెప్పఁగొను హైందవమతము లన్నియు — ద్వైతముగాని, విశిష్టాద్వైతముగాని, అద్వైతముగాని — ఉపనిషత్తులను, వ్యాససూత్రములను, భగవద్గీతను ప్రమాణములుగా అంగీకరించుచున్నవి. వారి కందఱికిని ఈ ప్రస్థానత్రయమే ఆధారము. నూత్నసిద్ధాంతము నొకదానిని ప్రతిపాదింప సంకల్పించినవా రందఱును — శంకరుడుగాని, రామానుజుడుగాని, మధ్వాచార్యుడుగాని, వల్లభాచార్యుడుగాని, చైతన్యుడుగాని, అట్టివా రందఱును — ఈ ప్రస్థానత్రయమున కింకొక భాష్యము రచింపవలసి వచ్చెను. కావున ఉపనిషత్తుల యాధారముపై నిర్మింపబడిన ఒక్క సిద్ధాంతమునకుమాత్రమే వేదాంతశబ్దము వర్తించు నని భావించుట కేవలము పొరపాటు. ఇవన్నియు వేదాంతమతములే. 'వేదాంతి' నామమును వహించుటకు అద్వైతి కెంత యధికారము కలదో అంత యధికారము విశిష్టాద్వైతికికూడ కలదు. ఇంతే కాదు. 'హిందూ'శబ్దము వాడునప్పుడు మనకు గల

యథార్థభావమును, వేదాంతిశబ్దమును వాడునప్పుడు గల యథార్థభావమును ఒక్కటియే యనికూడ నేను చెప్పుదును.

## స్మృతులు

వేదాంతమునకు పిదప స్మృతులు వచ్చును. అవియు ఋషివిరచితములే. కాని వేదాంతమున కుండునంతటి ప్రామాణికత స్మృతులకు లేదు. స్మృతులకును మనకును గల సంబంధము తక్కిన మతములవారికిని వారి శాస్త్రములకును గల సంబంధమువంటిదే. వారి శాస్త్రము లెట్లు మహాపురుషనిర్మితములో అట్లే మన స్మృతులుకూడ మహాపురుషనిర్మితములే యని మన మంగీకరింతుము. వీనికిని వానికిని గల సామ్య మిదియే. ఈ స్మృతులు పరమ ప్రమాణములుకావు. వీనిలో గల వేదాంతవిరుద్ధభావములన్నియు త్రోసివేయవలసినదే; వాని ప్రామాణికత అంతటితో నశించినది. మఱియు ఈ స్మృతులు కాలక్రమమున మాఱుచువచ్చినవి. ఒక స్మృతి కృతయుగమునను, ఒక స్మృతి త్రేతాయుగమునను, కొన్నిస్మృతులు ద్వాపరయుగమునను, కొన్ని స్మృతులు కలియుగమునను ప్రామాణికములై యుండవలయు నని చెప్పబడియున్నది. కాలగతులు మాఱగా, పలుతెఱగు లగు క్రొత్త సందర్భములు జాతి నెదుర్కొనగా, జాతియొక్క ఆచారమర్యాదలు మార్పు చెందవలసివచ్చుచుండెను. తదనుసారముగా ఈ స్మృతులను కూడ — అవి ముఖ్యముగా జాతియొక్క ఆచారమర్యాదా వ్యవహారములను గూర్చినవే గనుక — అప్ప టప్పటికి

మార్చుచుండుట అవసర మయ్యెను. మీఁద ముఖ్యముగా జ్ఞప్తి పెట్టుకొనవలసిన విషయ మిది. వేదాంతమునందు గల ఆస్తికధర్మసూత్రములు సుస్థిరములు, మార్చ నశక్య మైనవి. ఏల యనగా, అవెల్ల మానవునియొక్కయు ప్రకృతి యొక్కయు నిత్యధర్మములపై ఆధారపడియుండునవి. అందు వలననే అవి మార్పుల కతీతమైనవి. ఆత్మనుగూర్చిన భావములు, స్వర్గమున కేఁగుటనుగూర్చిన భావములు, మఱియు ఇట్టి ఇతరభావము లెన్నటికిని మాఱునవి కావు. వేలాదిసంవత్సరములకు మున్ను అవి ఎట్లుండెనో, నేఁడును అట్లే యున్నవి, ఇంక భవిష్యత్కాలమునగూడ — ఎన్ని కోట్ల సంవత్సరములు జరిగినను — అట్లే యుండును. కాని మన మతాచారమర్యాదలు మన సాంఘికస్థితిమీఁదను, ఇతరసంఘములతో మనకుగల పరస్పరసంబంధములమీఁదను మాత్రమే ఆధారపడి యేర్పడిన వగుటచే, సాంఘికస్థితితో పాటు అవి మార్పు లొందియే తీఱవలెను. అవి యొక్కకాల మున సముచితములై, అనుకూలములై యుండియు మఱొక కాలమున అట్లుండవు. కావుననే ఒక కాలమున విధింప బడిన ఆహార మింకొకకాలమున నిషేధింపబడియుండును. ఆ కాలమున అది అర్హమైయుండెను. కాని దేశపు శీతోష్ణ స్థితియు ఇతరవిషయములును మాఱుపునొందుటచేతను, నూత్నస్థితిగతు లెన్నియో యేర్పడుటచేతను, ఆ మార్పుల కనుకూలముగా స్మృతి ఆహారవిషయమందును ఇతర విషయములందును మాఱుపులు విధించెను. దీనినిబట్టి ఈ ఆధునికకాలానుసారముగా మన సంఘమునకు మార్పు

లవసర మయ్యెనేని, అవి చేసియే తీఱవలె నని యేర్పడు చున్నది. ఆ మార్పులు చేయవలసిన విధానము నేర్పఱచు మహాపురుషు లవతరింతురు. కాని మన మతధర్మములందు మాత్ర మణుమాత్రపు మాఱుపేనియు ఉండబోదు. అవి చెక్కు చెదరక నిలిచియే యుండును.

## ఇతర శాస్త్రములు

ఇక పురాణములు కలవు. "పురాణం పఞ్చ లక్షణమ్" అందురు. అనగా అందు చారిత్రక సంబంధము లైనవి, సృష్టిక్రమ సంబంధము లైనవి, తాత్త్విక సిద్ధాంతములను విశదీకరించు (కథాది) సాంకేతికోదాహరణరూపమైనవి, ఎన్నెన్నియో విషయము లుండును. వేదమతమును ప్రజాసామాన్యమున కర్థమగురూపమునప్రదర్శించుటకై యివి రచింపబడెను. వేదభాష అత్యంత ప్రాచీనరూపమైనది. మహా విద్వాంసులలో కూడ ఏ కొలదిమందియోమాత్రము వీని రచనాకాలమును కనుగొనగలరు. పురాణములు ఆ కాలపు జనసామాన్యము వాడుచుండిన భాషలో వ్రాయబడినవి. మన మిప్పుడు ఆధునికసంస్కృత మనుపేర వ్యవహరించు భాషయే అది. అవి యప్పుడు విద్వాంసులకొఱకు గాక సామాన్యప్రజకై ఉద్దేశింపబడినవి. వీరు తాత్త్వికభావములను గ్రహింపజాలరు గనుక నే ఇట్లొనర్పబడెను. కావున ఆ భావములకు రూపకల్పన మొనర్చి, మహాపురుషుల యొక్కయు, రాజన్యులయొక్కయు, సుప్రసిద్ధ పురుషుల యొక్కయు జీవితరూపమునను, జాతిజీవితములో కలిగిన చరి

త్రాత్మక సంఘటనల రూపమునను, ఇట్టి యితర స్థూల రూపములందును అవి ప్రదర్శింపబడెను. హిందూమత సనాతనధర్మముల కుదాహరణరూపముగా వర్తించుటకై ఋషులీ విధముగా వానిని నిర్మించిరి.

## మతభేద కారణము

ఇప్పుడు పేర్కొనబడిన గ్రంథము లన్నిటిని చేర్చి హిందూశాస్త్రము లందురు. ఎన్నో వేల సంవత్సరములుగా తాత్త్వికపారమార్థిక విషయ విచారమున తమ శక్తిలో సత్యధిక భాగమును వినియోగించి యింత అపారమగు శాస్త్ర వాఙ్మయమును నిర్మించినజనులందును, జాతియందును శాఖాంతరము లెన్నియో యేర్పడియుండుట చిత్రముకాదు. ఇవన్నియుకాక ఇంకను వేనవేల శాఖలు లేకపోవుటయే చిత్రమని కూడ చెప్పనగును. కొన్ని విషయములం దీ శాఖల కపారమగు పరస్పరభేదములు కలవు. వానికి గల భేదము లన్నియు, వానియందలి పారమార్థికభావవిశేషము లన్నియు, గ్రహించుటకు మన కిప్పుడు వ్యవధి చాలదు. కావున ఈ యన్నిటిలో గల సర్వసమ్మతభావములను, వాని యన్నిటికిని మూలసూత్రములై యుండువానిని — అనగా, హిందు వగు ప్రతిమనుష్యుడును అంగీకరించి విశ్వసించి తీఱవలసినవానిని — నే నిప్పుడు కైకొందును.

## సృష్టిక్రమ సిద్ధాంతము

ఇందు మొదటిది సృష్టినిగూర్చినది : ఈ సృష్టి, లేక ప్రకృతి, లేక మాయ, అనాదియు అనంతమును అనునది.

ఈ జగత్తు మున్న నొకనాడు కల్పింపబడినది కాదు. ఈశ్వరు డొకడు వచ్చి దానిని కల్పించి ఆ పిదప నిద్రించుచున్నా డని కాదు. అట్లగుట అసంభవము. సృజనాశక్తి ఇప్పటికిని, సక్రియారూపముననే యున్నది. ఈశ్వరుడు సర్వదా సృష్టించుచునే యుండును. అతనికి విశ్రాంతియే లేదు. "ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్" (నేను కర్మముల నాచరింపనిచో, ఈ లోకములు వినాశము చెందును) అను శ్రీకృష్ణభగవానుని గీతావాక్యమును జ్ఞప్తి పెట్టుకొనుడు. మనచుట్టును నిరంతరము, అహోరాత్రము, పనిచేయుచున్న ఆ సృజనాశక్తి క్షణకాల మాగిపోయినచో సర్వము కూలిపోవును. ఆ శక్తి లోకమందంతటను సక్రియారూపమున నుండని కాలమే లేదు. కాని 'కల్ప' నియమము (ప్రళయము) ఒకటి కలదు. "సృష్టి" యను మన సంస్కృత శబ్దమునకు సరియైన ఇంగ్లీషుమాట "Projection" (ప్రక్షేపము) కాని "Creation" (పుట్టించుట) కాదు. ఏలయన "Creation"(క్రియేషన్)అను మాటకు ఇంగ్లీషులో 'శూన్యములోనుండి ఉత్పత్తి', 'నాస్తిత్వములోనుండి నిర్మాణము', 'అభావము భావముగా మాఱుట' అను అత్యంతఘోరమును, అపరిణతమును అగు అర్థ మెట్లో దురదృష్టవశమున నేర్పడినది. ఆ ఘోరభావమును విశ్వసింపు డని నేను మిమ్ము నడుగజాలను. అట్లడుగుట మిమ్ము నవమానించుటగదా! కావున మనము Creation (క్రియేషన్) కు బదులు Projection (ప్రొజెక్షన్) అను మాటను కైకొందము. ఈ ప్రకృతియంతయు నిలిచియే యుండును. కాని అది సూక్ష్మరూ

పమునంది అడగియుండును. విశ్రాంతి గైకొనుచున్నదోయన అట్లు కొంతకాల ముండి, అంతయు మరల ప్రక్షేప మొంది, మరల పూర్వపు సంయోగమే, పూర్వపు వ్యాకోచమే, పూర్వపు దృశ్యమే గోచరించును. ఈ 'క్రీడ' (యనదగినది) కొంతకాలము సాగును. కాని మరల అది విచ్ఛిన్నమై, క్రమసూక్ష్మత నంది చివరకు సర్వమును అడగిపోయి, మరల వెలువడును. ఇది యిట్లే ముందుకు వెనుకకు, తరంగ గమనవైఖరిని, కలకాలము వచ్చుచు పోవుచు ఉండును. దేశ కాల నిమిత్తత లన్నియు ఈ ప్రకృతిలోనివే. కావున ప్రకృతి కొక ఆది కల దనుట అర్థరహితప్రసంగము. దాని ఆద్యంతములనుగూర్చిన సమస్యయే ఉండజాలదు. కావున మన శాస్త్రములం దెచ్చటనేని 'ఆది', 'అంతము' అను శబ్దములు వాడబడియున్నప్పు డవి ఆ కల్పమునుగూర్చియే వాడబడె నని జ్ఞప్తి యుంచుకోవలెను. అంతకు మించిన యర్థము వానికి లేదు.

## బ్రహ్మము

ఈ సృష్టి కేది కారణభూతవస్తువు? 'గాడ్' (ఈశ్వరుడు). 'గాడ్' అను ఈ ఇంగ్లీషుమాటను నే నే యర్థమున వాడుచున్నాను? సాధారణముగా ఇంగ్లీషులో దానికి గల యర్థమున కానేకాదు. దానికిని నా భావమునకును అపార భేదము కలదు. నా భావమును వ్యక్తపఱచు మాట ఇంగ్లీషులో వే రేదియుకూడ లేదు. కావున నేను 'బ్రహ్మము' అను సంస్కృతశబ్దమునే వాడుట మంచిది. ఈ గోచరరూప

ముల కన్నిటికిని ఆ బ్రహ్మమే సామాన్యమూల మని చెప్ప వచ్చును. బ్రహ్మ మనగా ఏమి? అతడు నిత్యుడు, నిత్య శుద్ధుడు, నిత్యజాగరూకుడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, నిరాకారుడు, నిరవయవుడు, ఈ జగత్తున కతడే సృష్టికర్త. అత డీ జగత్తును సర్వదా సృష్టించుచు, కాపాడుచు, ఉండు నను మాట రెండు సంశయముల కెడ మిచ్చును: 'ఈ జగత్తులో పక్షపాతభావము కానవచ్చును. ఒకడు సుఖియై జన్మించును, మఱొకడు అసుఖియై జన్మించును; ఒకడు భాగ్యవంతుడు, మఱొకడు దరిద్రుడు; ఇది పక్షపాతమునకు నిదర్శనము. క్రూరత్వముకూడ కానవచ్చును. ఈ లోకమున జీవ మంతయు మరణముమీదనే ఆధారపడియున్నది. ఒక జంతువు మఱొక జంతువును తుండతుండములుగా చీల్చి వేయును. ప్రతి మానవుడును తన సోదరు నణచి, పైకి రాజూచును. ఈ పోటీలు, ఈ క్రౌర్యము, ఈ ఘోరత, రేయుంబవళ్లు గుండెలను ప్రీలజేయు ఈ నిట్టూర్పులు — ఇవియే మన యీ లోకమున గల స్థితి. ఇది నిర్మించిన లోక యీశ్వరు డయ్యేనేని, ఆ ఈశ్వరుడు క్రూరాతిక్రూరుడై యుండవలెను; మనుష్యబుద్ధి యూహింపగల ఘోరపిశాచ ముల కన్నిటికన్నను అతడు అధముడై యుండవలెను'. కాని, ఈ పక్షపాతపు ఉనికికిని, ఈ స్పర్థల ఉనికికిని కారణ భూతుడు ఈశ్వరుడు కానేకాడు, అం దతని యపరాధ మేమియు లేదు అని వేదాంతము పలుకుచున్నది. అట్లగుచో, వానిని కల్పించువా రెవరు? మనమే. మేఘము అన్ని పొల ములమీదను సమముగనే వర్షించును. కాని చక్కగా

దుక్కి-చేయబడిన పొలముమాత్రమే ఆ వర్షమువలన ఉపకారము నొందును. దున్నక, బీడుగా పడవేసిపెట్టబడిన పొలమున కా ఉపకారము లభింపదు. ఇది మేఘుపు తప్పా? ఈశ్వరకృప సర్వదా ఉండునదే. దానియందు మార్పులే ఉండవు. భేదకల్పనము చేయునది మనమే. కాని కొందఱు సుఖులుగా, కొందఱు అసుఖులుగా జన్మించుట కేమి కారణము? ఈ వ్యత్యాసమును కల్పించు కార్యములు వారేమియు చేయలేదే! నిజమే. ఈ జన్మమున చేయలేదు. కాని పూర్వజన్మమున చేసిరి. ఆ పురాకృతకర్మమే ఈ భిన్నతను కల్పించినది.

## కర్మసూత్రము

మన కందఱు కేకీభావముగల రెండవ సిద్ధాంతము నిప్పుడు కై కొందము. ఈ విషయమున మన హిందువు లందఱుమే కాక, బౌద్ధులు, జైనులు కూడ అంగీకారము కలిగి యున్నారు. జీవము నిత్య మనియే మన అందఱ భావము. అది శూన్యమునుండి ఉత్పత్తి కాలేదు. అట్లగుట అసంభవము. జీవము అట్టి దైనచో, అది పనికిమాలినదై యుండును. కాలాతీతములుకానట్టి—అనగా కాలపరిమితమై, ఏదో ఒక కాలమున పుట్టిన — వస్తువు లన్నిటికిని ఏదో యొక కాలమున అంతముకూడ ఉండితీఱవలెను. జీవము నిన్ననే ప్రారంభమై యుండెనేని, రేపే అది అంతమొంది తీఱును. దానికి సమూలవినాశము సిద్ధము. జీవ మనాదియై సాగి వచ్చుచుండవలెను. ఈ సత్యము కనుగొనుటకు అంత అసాధా

రణబుద్ధికుశలత అక్కఱ లేదు. ఆధునిక శాస్త్రము లన్నియు— భౌతిక ప్రపంచపరిశీలనఫలముగా — మన శాస్త్రములలో ప్రతిపాదింపబడిన సిద్ధాంతములను క్రమక్రమముగా అంగీకరించి మనకు తోడ్పడ నారంభించినవి గదా. మనలో ప్రతివాడును, ఇప్పటికి జరిగిపోయిన అనంతకాలసంచితఫలముగా జన్మించినవాడే యని మీ రిప్పటికే యెఱుగుదురు. ప్రతిబిడ్డయు అపారపురాకృతకర్మభారము వహించియే లోకములోనికి వచ్చును; ప్రకృతి చేతిలోనుండి మెఱపు మెఱసినట్లు ఊడిపడునని వర్ణించుట కవుల కెంత ప్రీతికరమైనను, అది కేవల మసత్యము; తన పూర్వకర్మములచే కల్పించుకొనిన శుభాశుభఫలముల ననుభవించుకొనుటకే ఈ లోకములో ఆ బిడ్డ జన్మించునది. ఇదియే మానవులందు మనకు కానవచ్చు భిన్నతలకు కారణము. ఇదియే కర్మసూత్రము: మనలో ప్రతివాడును ఎవని అదృష్టమునకు వాడే కర్త. విధినిర్ణీతగతి, దైవసంకల్పము మున్నగు సిద్ధాంతముల నన్నిటిని ఈ సూత్రము కూలదన్నుచున్నది. ఈశ్వరునికిని మానవునికిని సమాధానము కుదురు మార్గము ఈ సూత్రమూలమున మాత్రమే యేర్పడుచున్నది. మనకు సంభవించు అగచాట్లన్నిటికిని మనమే కారణభూతులము. మఱెవ్వరును కారు. కార్యకారణములు రెండును మనమే. మనము స్వతంత్రులము. నే నిప్పుడు అసుఖములపాలై బాధపడుచున్నచో, అది నా స్వయంకృత కర్మఫలమే. దీనిని బట్టియే సుఖానుభూతికూడ నా చేతిలోనే కలదని — నేను సంకల్పించితినేని అదియు సాధించుకొనగలనని — స్పష్టపడు

చున్నది. నే నిప్పుడు అపరిశుద్ధుడనై యున్నచో, దానికి నేనే కారకుడను. కోరితినేని, పరిశుద్ధుడను కాగల నని దీనినిబట్టియే తెలియుచున్నది. మానవేచ్ఛ సర్వస్థితి గతులకును అతీతము. దీని ముందట—అత్యంతబలిష్ఠమును, మహత్తరమును, అనంతమును అగు మానవేచ్ఛ, మానవ స్వాతంత్ర్యము, ముందట — సర్వశక్తులును, ప్రకృతి శక్తులు సహా, శిరములువంచి, దాసోహమ్మని, సేవాసక్త ములు కావలసినదే. కర్మసూత్రఫలమే యిది.

## ఆత్మ

పిమ్మటి సమస్య "ఆత్మయననేమి?" అనునదియే గదా. ఆత్మ యనగా నేమో గ్రహించినగాని మన శాస్త్ర ములలో ప్రతిపాదింపబడిన ఈశ్వరుని మనము గ్రహింప జాలము. బాహ్యప్రకృతిని పరిశీలించుటద్వారా దానికి అతీతమగు వస్తువుయొక్క క్షణదర్శనమునైనను సాధించు కొను ప్రయత్నములు హిందూదేశమునందును ఇతర దేశము లందును చేయబడెను. ఆ ప్రయత్నము లన్నియు ఎట్లు భగ్నమై ఘోరాపజయము నొందినవో మన మందఱ మెఱుగుదుము. లోకాతీతవస్తువుయొక్క క్షణదర్శన మేనియు ప్రాప్తింపక పోవుటేగాక, ఈ భౌతికప్రపంచ పరిశీలన మధిక మగు కొలది, మనకు భౌతికదృష్టియే అధికాధికముగ పట్టువడ సాగెను. తత్పూర్వ ముండిన పారమార్థికతావేశము కూడ కోల్పోవ సాగితిమి. కావున పరమార్థజ్ఞాన మార్జించుకొను మార్గ మది కానేకాదు. అది

హృదయపరిశోధన మూలముననే, జీవాత్మపరిశోధన మూలముననే, రాగలదు. బాహ్యప్రపంచవ్యాపారము లేవియు ప్రపంచాతీతపదార్థజ్ఞానమును, అఖండపదార్థజ్ఞానమును, మన కీయజాలవు. అంతరప్రపంచ పరిశోధనమే దాని నీయగలుగును. అనగా ఈశ్వరజ్ఞాన మర్థించువారు ఆత్మను — మానవులలోని జీవాత్మను — గూర్చి విచారము సాగింపవలెను. మానవాత్మయొక్క తత్త్వమునుగూర్చి హైందవమతశాఖలకు భిన్నాభిప్రాయములు గలవు. కాని కొన్నివిషయములందు వా రందఱకును ఏకీభావము కలదు. ఆత్మలు ఆద్యంతరహితము లనియు, స్వభావసిద్ధముగనే నిత్యము లనియు, సర్వశక్తులు, ఆనందము, పారిశుద్ధ్యము, సర్వగతత్వము, సర్వజ్ఞత్వము వానిలో అంతర్హితములై నిలిచియుండు ననియు మన మందఱ మంగీకరించుచున్నాము. ఈ అద్భుతభావమును మన మెల్లప్పుడు జ్ఞప్తి యుంచుకోవలెను. ప్రతి మానవునందును, ప్రతి జంతువునందును — దుర్బలత, దుష్టత, ఉత్తమాధమతలు: ఇట్టి భేదము లేవియు పాటింపక — ఒకే సర్వవ్యాపకము, సర్వజ్ఞము అగు ఆత్మ వసించుచుండును. భేదము లేవియు ఆత్మయందలివి కావు; ఆత్మయొక్క వ్యక్తీకరణమందలివే. నాకును అతిక్షుద్ర జంతువునకును గల తారతమ్యము ఆత్మయొక్క వ్యక్తీకరణమందే. తాత్త్వికముగా మే మిరువుర మొకటియే; మేము సోదరులము; ఒకే ఆత్మ మా యిరువురందును కలదు. హిందూదేశము లోకమునకు బోధించిన సత్యము లన్నిటిలో ఇదియే అత్యంత మహనీయమైనది. లోకమం దంతటను

వ్యాప్తిలోనుండు 'సర్వమానవసౌభ్రాత్రము' అను మాట హిందూదేశమున 'సర్వజీవసౌభ్రాత్రము'గా — పిపీలికాది బ్రహ్మపర్యంత మైన సర్వజీవరాశియొక్క సౌభ్రాత్రముగా — మాఱుచున్నది. అవన్నియు మన శరీరములే. కావుననే మన శాస్త్రములో ఈ వాక్యము కలదు: "జ్ఞానసిద్ధు డగు వాడు సర్వశరీరములందును ఒకే యీశ్వరు డుండు టెఱిగి, వాని నన్నిటిని ఈశ్వరభావముతో ఆరాధించును". పేదల యెడలను, పశువులయెడలను, ప్రతివానియెడలను, ప్రతిదాని యెడలను, మిక్కిలి కారుణ్యము చూపవలెనను భావము హిందూదేశమున ఏర్పడియుండుట కిదియే కారణము. ఆత్మను గూర్చిన భావములలో సర్వశాఖాసమ్మత మైన దిది యొకటి.

మన మిక ఈశ్వరభావమునకు వచ్చుటె గదా సహజము. కాని ఆత్మనుగూర్చి ఇం కొక్క మాట. ఇంగ్లీషు భాషనభ్యసించువారు 'సోల్' (Soul), 'మైండ్' (Mind) అను మాటలు గ్రహించుటలో భ్రమ చెందుదురు. మనము 'ఆత్మ' యనునదియు వారు 'సోల్' అనునదియు భిన్నవస్తువులు. మనము 'మనస్సు' అనుదానిని పాశ్చాత్యులు 'సోల్' అందురు. పాశ్చాత్యులకు 'ఆత్మ' యను భావమే మొదటిలో లేదు. సంస్కృతతత్త్వశాస్త్రమునుండి వారి కీ భావము ఇరువదేండ్ల క్రిందట * లభించినది. మనకు కానిపించునది శరీరము. దానికి అతీత మైనది 'మనస్సు'. కాని 'మనస్సు'

* అనగా ఇప్పటికి 70, 80 ఏండ్లనాడు.

వేఱు, 'ఆత్మ' వేఱు. మనస్సునకు 'సూక్ష్మశరీరము' అని పేరు. అది మిక్కిలి సూక్ష్మము లగు భౌతికాణువులతో నిర్మింపబడినది. ఈ సూక్ష్మశరీరమునకును జననమరణములు కలవు. ఈ మనస్సున కతీతమై ఆత్మ యనునది కలదు. ఈ ఆత్మభావమును 'సోల్' అనునదిగాని, 'మైండ్' అనునది గాని తెలుపజాలదు. కావున మన యింగ్లీషులోకూడ మన 'ఆత్మ'శబ్దమునే వాడవలయును. ఇది తప్పినచో పాశ్చాత్య తత్త్వజ్ఞులు కల్పించిన 'సెల్ఫ్' (Self) అను మాటను వాడవలయును. కాని యే మాట వాడినను, మీ రొక్క విషయమునుమాత్రము స్పష్టముగా తెలిసికొని యుండ వలెను: ఆత్మ వేఱు, మనశ్శరీరములు వేఱు; మనస్సు (లేక సూక్ష్మశరీరము)తో కూడి అది (ఆత్మ) జననమరణ పరంపరలో చిక్కి సాగిపోవుచుండును. దానికి పరిపూర్ణ జ్ఞానసిద్ధి లభించి, అది పరిపూర్ణముగా అభివ్యక్తమైనప్పుడు, దాని కిక జననమరణము లుండవు. ఆ పిదప ఆ మనస్సు — లేక సూక్ష్మశరీరము — ను అది నిలుపుకొనవచ్చును, లేక, విడనాడి స్వతంత్రముగా, నిర్నిబద్ధముగా కలకాలము ఉండ వచ్చును. ఆత్మకు ముక్తియే పరమార్థము. ఇట్లు పలుకునది మన మతము మాత్రమే కాదు. మన మతమందును స్వర్గ నరకలోకములు కలవు. కాని ఆ యనుభూతి శాశ్వతము కాదు. అది శాశ్వత మైయుండుట అసంభవము. స్వర్గము లుండుట నిజమే యైనచో, అవి ఈ మర్త్యలోకముయొక్క పునఃకల్పనమాత్రములై యుండును — కాకున్న, మఱి కొంత సుఖమునకు, మఱికొంత భోగమునకు ఆస్పదములై,

మఱికొంత పెద్దవై యుండవచ్చును. అట్టి లోకములవలన ఆత్మ కపకారమే కలుగగలదు. పెక్కు స్వర్గములు కలవు. ప్రతిఫలాపేక్ష కలిగి సత్కర్మము లొనర్చువారు మరణించి నప్పుడీ స్వర్గములం దొక దానిలో ఇంద్రాది దేవతలై పుట్టుదురు. ఈ దేవతలు కొన్ని పదవుల పేళ్లు. ఆ పదవుల నాక్రమించువారు అంతకుముందు మనుష్యులుగా నుండిన వారే. సత్కర్మఫలముగా వారు దేవతలైరి. మనకు గ్రంథములందచ్చటచ్చట కానవచ్చు ఇంద్రు లందఱును ఒకరు కారు. తక్కిన దేవతానామముల విషయముకూడ ఇదియే. వేనవేలమంది ఇంద్రు లుందురు. మహారాజుగా నుండిన నహుషుడు మరణానంతర మింద్రు డయ్యెను. అది యొక పదవి. ఒక్కొక్క ఆత్మ ఉన్నతి నంది ఇంద్రపదవి నార్జించుకొనును. కాని అది యచ్చట కొంత కాలము మాత్రమే ఉండును. ఆ పిదప మరణించి, మరల మానవుడై పుట్టును. శరీరము లన్నిటిలో మానవశరీరమే ఉత్కృష్టతమ మైనది. దేవతలలో కొందఱు అంతకన్న ఉన్నతదశ నంద గోరి, స్వర్గభోగలాలసను విసర్జింతురు. కాని వారిలో అత్యధిక సంఖ్యాకులు — ఈ లోకమున జనసామాన్య మెట్లు పదవీ భోగ భాగ్య వ్యామోహమున జిక్కుదురో అట్లే — భ్రాంతులై, తమ సత్కర్మానుభూతి ముగియుటతోడనే అచటినుండి పతన మొంది మరల మానవు లగుదురు. కావున ఈ భూలోకమే కర్మభూమి. ఇచ్చటనుండియే మానవుడు ముక్తిని సాధించునది. అనగా ఈ స్వర్గలోకములు వాంఛనీయములు కావు. అగుచో, వాంఛనీయమైన దేది?

ముక్తి. అత్యున్నతస్వర్గమునకూడ మానవుడు బద్ధుడే యని మన శాస్త్రములు చెప్పుచున్నవి. ఇరువదివేలేండ్లు లోక పాలకుడవై యున్నమాత్ర మేమి ప్రయోజనము? నీ కొక శరీర ముండువఱకును, నీవు సుఖమునకు దాసుడవై యుండు వఱకును, 'దేశ' (Space) కాలములకు నివశ్యుడవై యుండువఱకును, నీవు బద్ధుడవే. కావుననే బాహ్యాంతర ప్రకృతుల నిర్బంధములనుండి విమోచన మొందవలయు నను భావ మేర్పడినది. ప్రకృతి నీకు పాదాక్రాంతము కావలెను. నీ పాదములు దాని నణచిపెట్టవలెను. నీవు ప్రకృతి కతీతుడవై, ముక్తుడవై, దివ్యతేజోవైభవమును సాధించుకోవలెను. ఆ స్థితి సాధించుకొంటివేని, నీకిక జీవము లేదు, మరణము లేదు; భోగానుభూతి లేదు, కనుక దుఃఖానుభూతి లేదు. అది సర్వాతీత మగు ఆనందము; అనిర్వచనీయానందము, అనశ్వరానందము. మన మిచట సుఖ మనునది, భవ్య మనునది, ఆ నిత్యానందముయొక్క స్వల్పాంశమాత్రములు. ఆ నిత్యానందమే మన పరమ గమ్యము.

## ముక్తి

ఆత్మయందు స్త్రీపుంవిభేదము లేదు—దానికి స్త్రీత్వ పురుషత్వము లారోపించుట కనువుపడదు. ఆ భేదములు శరీరమునకుమాత్రమే సంబంధించినవి. ఆత్మనుగూర్చి ప్రసం గించుచో, స్త్రీపురుషభావములు భ్రాంతిరూపములైనవి. శరీరమునుగూర్చిన ప్రసంగముననే వానికి స్థానము కలదు.

వయస్సు విషయముకూడ ఇంతే. ఆత్మ ముదురదు. ఈ పురాణపురుషుడు సర్వదా ఒకటిగనే ఉండును. ఆత్మ భూలోకమున కెట్లు దిగివచ్చెను? మనశాస్త్రములం దీ ప్రశ్న కొకే సమాధానము కలదు. ఈ బద్ధత్వ మంతటికిని అవిద్యయే కారణము. అవిద్యాకారణముచేతనే మనము బద్ధులమైతిమి. జ్ఞానమే దీని కౌషధము. అది మనలను అవ్వలిదరికి తీసికొనిపోగలదు. ఆ జ్ఞాన మెట్లు లభించును? ప్రేమ మూలమున; భక్తి మూలమున; ఈశ్వరారాధన మూలమున; ఈశ్వరాలయము లగు సర్వజీవులను ప్రేమించు మూలమున. వాని యన్నిటియందును అతడు నివసించు చుండును. ఈ తీవ్రప్రేమ మూలమున జ్ఞానము లభించును; అజ్ఞానము విరిసిపోవును; బంధములు తెగిపోవును; ఆత్మ ముక్తత్వ మందును. ఈశ్వరునిగూర్చి రెండు భావములు మన శాస్త్రములందు కలవు — సగుణభావము, నిర్గుణ భావము. సగుణదైవ మనగా అతడు సర్వవ్యాపియై, సర్వ మునకును సృష్టిస్థితిలయకారకుడై, జగత్తుకు తల్లియును, తండ్రియును అయి యుండువాడు. కాని మనకును, ఆత్మ లన్నిటికిని, అతడు శాశ్వతముగా భిన్నుడై యుండును. ముక్తి యనగా అతనిని సమీపించుట, అతనియందు నివసించుట. రెండవది నిర్గుణదైవభావము. అందీ విశేషణము లన్నియు అనావశ్యకములుగా, అసంగతములుగా, భావింపబడి, పరిత్యజింపబడును. అప్పుడు నిర్గుణుడును, సర్వగతుడును అగు నొక పురుషుడుమాత్రమే మిగిలియుండును. అతనిని 'జ్ఞాత' అన జెల్లదు. ఏలన జ్ఞానము మనుష్య

మానసమునకే సంబంధించినది. చింతనాపరు డన జెల్లదు; ఏలన చింతన అశక్తుల వ్యాపారము. తర్కబుద్ధి యన జెల్లదు: ఏలన తర్కము అశక్తిసూచకము. సృష్టికర్త యన జెల్లదు; ఏలన బంధమున జిక్కినవారుకాని సృజింపరు. అతనికి బంధము లేమి కలవు? కార్యాచరణ మంతయు కోర్కెలు ఈడేర్చుకొనుకొఱకే. అతనికి కోర్కె లేమి కలవు? పని చేయువా రందఱును ఏవో లోపములు తీర్చుకొనుకొఱకే. అతనికి లోపము లేమి కలవు? వేదములందు "అతడు" అను మాటయే లేదు — "అది" అనియే అతడు సూచింపబడునది. "అతడు" అనుమాట పురుషవాచక మగుటచే లేనిపోని భేదభావమును కలిగించును. నిర్గుణ సూచక మగు "అది"శబ్దము వాడబడి నిర్గుణత్వమే బోధింపబడును. ఇదియే అద్వైతమతము.

## మరణానంతర జీవితము

ధ్యానమూలమున పారిశుద్ధ్యము సాధించి జ్ఞాని యైనవాడు మరణానంతరము మొదట తేజస్సులోనికిని, పిదప పగటి లోనికిని, అందుండి శుక్లపక్షమునకును, దానిలోనుండి ఉత్తరాయణములోని ఆఱుమాసములకును, అందుండి సంవత్సరములోనికిని, అచటినుండి సూర్యునిలోనికిని, అందుండి చంద్రునిలోనికిని, అచటినుండి విద్యుల్లోకమునకును చేరును. అచట నొక అమానుషపురుషు డతనిని కలసికొని సగుణబ్రహ్మముకడకు కొనిపోవును. ఇది దేవయానము. సిద్ధపురుషులు, జ్ఞానులు, మరణించినప్పుడు వారును ఇదే మార్గ

మున నేగుదురు కాని వారు మరల రారు. ఈ మాస సంవత్సరము లన నేమో ఎవ్వరికిని స్పష్టముగా తెలియదు. ప్రతివారు నొక స్వతంత్రార్థము కల్పింతురు. కొంద ఱిది యంతయు అర్థరహిత మందురు. చంద్రలోకమున కేగుటన నేమో, సూర్యలోకమున కేగు టన నేమో, విద్యుల్లోకమున ఈ ఆత్మను తోడ్పడవచ్చు ఆ పురుషు డెవడో, ఎవరును ఎఱుగరు. చంద్రలోకమున జీవరాశి కలదని హిందువులలో నొక భావము కలదు. భూలోకపు జీవోత్పత్తికి మూలము చంద్రమండలమే యని కూడ చెప్పుదురు. జీవితకాలమున సత్కర్మము లాచ రించియు జ్ఞానసిద్ధి నొందనివారు మరణించినప్పుడు మొదట ధూమములో ప్రవేశించి, ఆ పిదప రాత్రిలోనికి, అంతట కృష్ణపక్షమునకు, దక్షిణాయనపు ఆఱుమాసములలోనికి, ఆ పిదప పితృలోకమునకు, అంతట ఆకాశమునకు అచటినుండి చంద్రలోకమునకు చేరుదురు. అచట దేవతల కాహారమై దేవతాజన్మ మెత్తి తమ సత్కర్మఫల మంతయు వ్యయ మగువఱకు దేవతలుగా నుందురు. తదనంతరము వారదే త్రోవను భూలోకమునకు వత్తురు. మొదట ఆకాశరూప మంది, అంతట గాలియై, పొగయై, పొగమంచై, మేఘమై, వర్షబిందురూపమున భూమిపై పడుదురు. ఆ ద్వారమున ఆహారపదార్థములలో చొచ్చి వాని నారగించు మానవులకు బిడ్డలై పుట్టుదురు. మిక్కిలి సత్కర్మములొనర్చినవారు ఉత్తమకుటుంబములందు జన్మింతురు. దుష్కర్మము లొన ర్చినవారు హీనజన్మము లందుదురు; జంతువులై కూడ పుట్టు

దురు. క్షుద్రజంతువు లెన్నియో భూమిపై నెప్పుడును జన్మించు చుండును; ఎప్పుడును భూలోకమును విడిచిపోవుచు కూడ నుండును. కావుననే మన భూమి నిండి పొంగలి పోవక, వట్టిపోవక, ఒకే విధముగా నుండుట.

స్వర్గలోకమునుండి తిరిగివచ్చు విధానమును తెలుపు రెండవభాగము మొదటిభాగమునకన్న స్పష్టతరముగా నున్నదని చెప్పవచ్చును. కాని దీని యంతటిలో గల ముఖ్య భావము భగవత్సాక్షాత్కారసిద్ధి నొందనివారికి పునరావృత్తిరహిత మగు పుణ్యలోకప్రాప్తి యుండనేర దనుటయే యని తోచుచున్నది. భగవత్సాక్షాత్కార మందక సకామ రూప మగు సత్కర్మ మొనర్చినవారు మరణించినప్పుడు ఎచ్చు టెచ్చుటికో పోయి చివరకు స్వర్గలోకమును చేరి అక్కడ దేవతలకు బిడ్డలై — మన మిచట పుట్టినట్లే — పుట్టి, వారి సత్కర్మానుభూతి ముగియువఱకచట నుందురు. నామరూపాత్మక మగు సర్వము అనిత్యము అనునట్టి వేదాంతమూలభావము నిది స్థిరపఱచుచున్నది. నామ రూపాత్మక మైనది గనుక ఈ భూమి అనిత్యము. స్వర్గములు కూడ నామరూపాత్మకములే గనుక అవియును అనిత్యములు గనే ఉండవలెను. శాశ్వతస్వర్గ మను మాటలో విరుద్ధభావ సమ్మేళనము గలదు. ఏలన నామరూపములు గల సర్వము కాలపరిమితముగనే ఉండవలెను. ఆ పరిమితిలోపలనే వాని యొక్క పుట్టుక, ఉనికి, అంతము ఉండితీఱవలెను. ఇవి సుస్థిర వేదాంతసిద్ధాంతములు. కావున స్వర్గలోకములు పరిత్యజింపబడినవి.

## గురువు

ప్రతి ఆత్మకును పరిపూర్ణత నందుటయే విధి. ప్రతి ప్రాణియు చివరకు పరిపూర్ణత నందియేతీఱును. మన ప్రస్తుతస్థితి మన పూర్వజన్మకర్మములయొక్కయు భావముల యొక్కయు ఫలము. మన భవిష్యత్స్థితి మన యిప్పటి కర్మములయొక్కయు, భావములయొక్కయు ఫలమై యుండును. అనగా మన అదృష్టమునకు మనమే కర్తలము. అయినను మన అదృష్టనిర్మాణకార్యమున మన మితరుల సాహాయ్యము నొందరాదను నిషేధమేమియు లేదు. ఏ కొలదిమందికో తప్ప ఇట్టి సాహాయ్యము జనసామాన్యమందఱకును అత్యంతముఖ్యముకూడ. అట్టి సాహాయ్యము లభించినప్పుడు ఆత్మయందు ప్రచ్ఛన్నరూపముననుండు మహోత్కృష్టశక్తులు సచేతనములగును, పారమార్థిక జీవనము మేలుకాంచును, అభివృద్ధి విజృంభించును, మానవుడు చివరకు పావనత్వమును, పరిపూర్ణత్వమును పొందును.

ఈ ఉజ్జీవనశక్తి గ్రంథములనుండి రాజాలదు. ఆత్మకీశక్తి మఱొక ఆత్మనుండియే లభింపవలెనుగాని, మఱెచ్చటి నుండియు లభింపజాలదు. జీవితకాల మంతయు మనము గ్రంథావలోకనమగ్నులమై యుండవచ్చును, మన మత్యంత బుద్ధిపరిణతి నార్జింపవచ్చును, కాని చివరకు మనకు పారమార్థికాభివృద్ధి లేశమైనను ప్రాప్తించియుండదు. మహోన్నతబుద్ధిపరిపాకము సాధించిన మానవునికి తదనుః

రూపమగు పారమార్థికపరిపాకముకూడ అలవడియేయుండు ననుట అసత్యము. గ్రంథపఠనము చేయునప్పుడు మన కందుచే పారమార్థికలాభముకూడ ప్రాప్తించుచున్నదని మన మొక్కొక్కతడవ భ్రమపడవచ్చును, కాని పుస్తక పఠనఫలమును జాగ్రత్తగా పరిశీలించుకొనినచో, బుద్ధి కొంత వేళ బలము చేకూరి యుండవచ్చును గాని, ఆత్మప్రబోధ మేమియు కలుగలేదని స్పష్టపడును. పారమార్థికవిషయము లనుగూర్చి మన మందఱము అత్యద్భుతోపన్యాసము లీయ గలిగి యుండియు, యథార్థమగు పారమార్థికజీవన మవలం బించుటలో కేవలము కుంటువడియుండుటకు కారణమిదియే— పుస్తకపఠనము పారమార్థికోద్దీపనము కలిగించు విషయమున కేవల మసమర్థ మగుటయే. ఆత్మప్రబోధము మఱొక ఆత్మ నుండియే రావలెను.

ఈ ప్రబోధ మెవరి ఆత్మనుండి వచ్చునో ఆ పురుషుని గురు వందురు. అది యెవరి ఆత్మకు ప్రసాదింపబడునో, ఆ పురుషుని శిష్యు డందురు. ఈ పారమార్థికశక్తి యొకరికడ నుండి మఱొకరికి లభింపవలె నన్నచో, అది వెలువడు ఆత్మకు ప్రదానసమర్థతయు, కైకొను ఆత్మకు ప్రతిగ్రహ ణార్హతయు ఉండుట అత్యావశ్యకము. విత్తనము ప్రాణ వంతమై యుండవలెను ; చేను దున్ని చల్లకమునకు సిద్ధపఱచి యుండవలెను. ఈ రెండును సమకూడెనేని, యథార్థమగు పారమార్థికసస్యాభివృద్ధి అత్యద్భుతరూపమున వెలువడును. నిజమగు మతబోధకు డత్యద్భుత ప్రభావవంతుడుగా నుండ

వలెను. శ్రోతయు బుద్ధికుశలత గలవాడై యుండవలెను — "ఆశ్చర్యోవక్తా కుశలోఽస్య లబ్ధా". ఇరువురును ఆశ్చర్య మైనవారుగను, అసాధారణమైనవారుగను ఉన్నచో తత్ఫల ముగా మహోత్కృష్టపారమార్థికోజ్జీవనము కలుగును. కానిచో అట్టిది కలుగుట అసాధ్యము. అట్టివారే నిజమగు గురువులు, అట్టివారే నిజమగు శిష్యులును, సాధకులును. తక్కినవారు చేయునది పారమార్థికభావములతో చెర లాటము లాడుటయే — వారి కది యొక వినోదక్రీడా మాత్రము. అదేమియో యొకింత తొంగిచూత మను కుతూహలము, ఒకింత బుద్ధిగ్రాహ్యము చేసికొంద మను కోరిక, వారికి కలిగినది. అంతయే. పారమార్థికజీవనక్షేత్రపు వెలుపటి పొలిమేర చిట్టచివరను వారు నిలిచియున్నారు. కాని, దీనియందుకూడ కొంత గుణము కలదు నిజమే. కాల క్రమమున దానినుండియే పారమార్థికజ్ఞానతృష్ణ ఉదయింప వచ్చును. అత్యంతనిగూఢ మగు ప్రకృతి ధర్మ మొకటి కలదు — క్షేత్రము సంసిద్ధ మగుటతోడనే బీజము ప్రాప్తింప వలెను; ప్రాప్తించి తీఱును. ఆత్మకు పారమార్థికధర్మతృష్ణ తీవ్రముగా కలిగినవెంటనే దాని కా తృష్ణను తీర్పగల పార మార్థికశక్తి ప్రాప్తింపవలెను; ప్రాప్తించి తీఱును. కైకొను ఆత్మయందు పారమార్థికధర్మతేజస్సు నాకర్షించు శక్తి సమ గ్రమై, బలిష్ఠమై, యుండునప్పుడు, త త్సిద్ధి కావశ్యకమగు తేజస్సు నీయగలశక్తి స్వభావసిద్ధముగనే లభించి తీఱును.

## భగవదవతరణము

సామాన్యగురువులకంటె మహోన్నతులును, మహో త్తములును అగు మఱొక వర్గపు గురువులు కలరు. వీరే ఈశ్వరుని అవతారములు. వారు పారమార్థికబలమును స్పర్శమాత్రమున, ఇచ్ఛామాత్రమునకూడ, ఇతరుల కీయ గలరు. వారి యాజ్ఞచే అధమాధములు సైతము, అధః పతితశీలురు సైతము, క్షణమాత్రమున సిద్ధపురుషు లగు దురు. వారు గురువు లందఱకును గురువులు, భగవంతుని యొక్క మానవరూపపరమావధులు. మనము మానవ రూపమునతప్ప భగవంతుని చూడజాలము. వారిని మన మారాధింపక యుండజాలము. నిజమునకు మనము ఆరాధించి తీఱవలసినది వారిని మాత్రమే.

ఈ మనుష్యావతారమూర్తులందు తప్ప మానవు డెవ్వడును ఈశ్వరుని నిజముగా సందర్శింపజాలడు. ఇతర విధములుగా నతని సందర్శింప యత్నించితిమేని, అత్యంత వికృతాకారము నొకదానిని కల్పించుకొని, అది ఈశ్వరుని సత్యరూపమునకన్న హీనమైనది కాదని విశ్వసింతుము. పామరు డొకడు శివప్రతిమను జేయ నొప్పుకొని పెక్కు దినములు పరిశ్రమించి చివర కొక మర్కటప్రతిమను నిర్మించెనట! కావున భగవంతుని అఖండపరిపూర్ణత్వమును మనము భావింప యత్నించినప్పు డెల్ల మనకు బీభత్సహాస మగు అపజయమే ప్రాప్తించుచుండును. ఏలన, మనము మానవులముగా నున్నంతవఱ కాతని మానవుని కన్న అతీ

తునిగా భావింపజాలము; మానవప్రకృతి కతీతులమై భగ వంతుని యథార్థస్వరూపమును చూడగల కాలము వచ్చును. కాని మనము మానవులముగా నున్నంతకాలము అతనిని మానవునిగనే, మానవమూర్తియందే, ఆరాధింపవలెను. ఎన్ని మాట లాడినను, ఎంత ప్రయత్నము చేసినను, మానవరూపమునతప్ప భగవంతుని మనము సంకల్పింప జాలము. భగవంతునిగూర్చియు, జగత్తులో గల సర్వవస్తు వులనుగూర్చియు అత్యద్భుతము లగు వైజ్ఞానికోపన్యాసము లీయవచ్చును, తార్కికవిఖ్యాతి గాంచవచ్చును, భగవంతుడు మానవావతారము లెత్తె నను గాథ లన్నియు అర్థరహిత ప్రలాపము లని నిరూపించుకొని సంతృప్తులము కావచ్చును. కాని సామాన్యదృష్టితో నొకించుక విచారించి, ఈ అద్భుత బుద్ధి ఏ మాత్రము జ్ఞానముపై ఆధారపడి యున్న దని పరిశీ లించుకొంటిమేని, అచట శూన్యమే, వట్టి నురుగే, కాన వచ్చును. ఈ తడవ నీవు అవతారఖండన మహోపన్యాస మును విన దటస్థించినప్పు డా యుపన్యాసకుని నిలువదీసి "సర్వగతత్వము", "సర్వశక్తిమత్త్వము" మున్నగుమాటలు — వానియొక్క వర్ణక్రమమునకు మించి — అతని కేమైన అర్థమైనవేమో అడుగుము. నిజమునకు అవి అతని కేమియు అర్థముకాలేదు. తన మానవప్రకృతిచేత పరిమితము కానట్టి భావము నత డేదియు తెలుపజాలడు. పుస్తక జ్ఞానమే లేని సామాన్యపామరజనునికన్న అతని కీవిషయమున ఏ మాత్ర మును ఎక్కువ జ్ఞానము లేదు. కాని ఆ పామరుడు మౌనము దాల్చి యూరకుండును, ప్రపంచశాంతికి భంగము కలి

గింపదు; ఈ వాచాలుడు అట్లుకాక మానవులలో సంక్షోభ మును, వ్యథను కలిగించును. ఆస్తికధర్మ మనగా నిజము నకు సత్యానుభూతిగదా. వాచాలత్వమును సత్యానుభూతిగా మన మేమాత్రమును భ్రమపడరాదు. ఆత్మయొక్క గర్భాం తరాళమున చేపడునదే సత్యానుభూతి. ఈ విషయమున సామాన్యబుద్ధికుశలతతో విచార మొనర్చుట మిక్కిలి అవ రూపము.

ప్రస్తుత సృష్టిక్రమమునందు మానవుడు స్వతస్సిద్ధము గనే ఉపాధిగతుడు. కావున మనము భగవంతుని మానవుని గనే చూడగలము. గత్యంతరము లేదు. ఎనుములు భగ వంతు నర్చింప గోరినచో వాని ప్రకృతి ననుసరించి అవి యతని నొక బ్రహ్మాండమైన యెనుముగా భావించును. చేప భగవంతు నర్చింపగోరుచో అతని నొక బ్రహ్మాండమైన చేపగా భావించును. అట్లే మానవు డతనిని మానవుని గనే భావింపవలెను. ఈ వివిధభావనలకు కారణము ఊహా ప్రచార వైపరీత్యము కాదు. మనుష్యుని, ఎనుమును, చేపను వివిధపాత్రములకు పోల్చవచ్చును. ఇవన్నియు నీళ్లు ముంచుకొనుటకై భగవత్సముద్రమునకు పోయినచో, తమ తమ ఆకారములకును పరిమాణములకును అనురూపముగనే గదా తెచ్చుకో గల్గును. మానవుడు మానవాకృతితోను, ఎనుము ఎనుముఆకృతితోను, చేప చేపఆకృతితోను తెచ్చు కొనును. కాని వీని యన్నిటిలో గలది భగవత్సముద్ర జలమే. మానవు లతనిని చూచినప్పుడు మానవునిగా

చూతురు, జంతువులు—భగవద్భావము వాని కేమైన నుండె నేని — తమ తమ రూపపరమావధి గల జంతువులుగా చూచును. కావున మనము భగవంతుని మానవునిగనే చూడగలము. అందుచే మన మతనిని మానవరూపముననే అర్చింపవలెను. గత్యంతరము లేదు.

మానవులలో రెండు వర్గములవారు మాత్రము భగవంతుని మానవరూపమున నర్చింపరు: ఆస్తికధర్మమునే యెఱుగని మానవపశు వొకడు, మానవోపాధుల నన్నిటి నతికరించి మానవప్రకృతిసిద్ధపరిమితుల కతీతుడైన పరమహంస యొకడు. అతనికి ప్రకృతి యంతయు తన ఆత్మగనే కానిపించును. అత డొక్కడే భగవంతుని యథార్థస్వరూపమున ఆరాధింప గలవాడు. ఇతరవిషయము లన్నిటియందు వలె ఈ విషయమునగూడ అగ్రతమస్థితులు రెంటికిని ఒకే రూపము కలదు. అవిద్యాపరమావధియం దున్నవారును విద్యాపరమావధియందున్నవారును ఆరాధనకృత్యము లేవియు చేయరు — అజ్ఞానకారణమున మానవపశు వవి చేయడు, జీవన్ముక్తుడు తనయందే భగవంతుడు కలడని యెఱుగును గనుక అవిచేయడు. ఈ రెండు అగ్రములకు నడుమ నుండువా డెవడైనను తాను భగవంతుని మానవరూపునిగా అర్చింప డని పలికినచో, వానిని కొంచెము జాగ్రత్తతో కనుపెట్టియుండుము. అతనిని — ఎంత మృదులవాక్కులతో వర్ణించినను — బాధ్యత నెఱుగక మాటలాడువా డనవలెను. అతని మతభావములు అస్థిర

మానసులకును, శూన్యబుద్ధులకును, మాత్రమే అర్హ మైనవి.

భగవంతుడు మానవలోపముల నెఱుగును గనుక లోకోపకారార్థమై మానవరూపమును పూనును.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥

(ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మ మభివృద్ధి యగునో అప్పుడెల్ల నేను సశరీరుడనై అవతరింతును. సాధురక్షణ కొఱకును, దుష్టవినాశము కొఱకును, ధర్మ సంస్థాపనము కొఱకును నేను ప్రతి యుగమందును జన్మించు చుందును).

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥

(నేను మనుష్యరూపమును దాల్చినప్పుడు, సర్వ భూత మహేశ్వరరూప మగు నా పరతత్త్వము నెఱుగక, మూఢులు నన్ను అలక్ష్యభావముతో చూతురు).

ఇవి అవతారములనుగూర్చి గీతలో శ్రీకృష్ణుడు పలికిన మాటలు. "సముద్రము ఉప్పెనరూపమున పొంగి వచ్చినప్పుడు చిఱువాగులును చిఱుకందకములును అప్రయ

త్నముగా నిండిపోవును. అట్లే భగవదవతారమే తెంచి నప్పుడు పారమార్థికరూప మగు ఉప్పెన యొకటి లోకముపై పొరలిపడును. వాతావరణమే పారమార్థికతాపూరితమైనట్లు మానవులకు తోచును'' అని శ్రీరామకృష్ణభగవానుడు పలికియున్నాడు.

శ్రీరామకృష్ణార్పణమస్తు

ఓం తత్సత్.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

| | | | రూ. | అ. |
|---|---|---|---|---|
| శ్రీ దొడ్డభాగవతము (మొదటి సంపుటము) | | ... | 6 | 8 |
| ,, (రెండవ సంపుటము) | | ... | 5 | 8 |
| ,, (మూడవ సంపుటము) | | ... | 7 | 8 |
| ,, మూడు సంపుటములు ఒకేపరి కొన్నచో | | | 18 | 8 |
| శ్రీరామకృష్ణ లీలామృతము | | ... | 5 | 0 |
| శ్రీమద్భగవద్గీత | | ... | 4 | 0 |
| శ్రీరామకృష్ణ బోధామృతము | | ... | 3 | 8 |
| బ్రహ్మానంద బోధనలు | | ... | 3 | 8 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | అట్ట బైండు | ... | 3 | 8 |
| ,, | సాదా ప్రతి | ... | 3 | 0 |
| పారమార్థిక సంభాషణలు | | ... | 3 | 0 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | | ... | 3 | 0 |
| నారద భక్తి సూత్రములు | | ... | 3 | 0 |
| శ్రీ శారదా ప్రసంగములు | | ... | 2 | 8 |
| ప్రబోధరత్నాకరము | | ... | 2 | 4 |
| శ్రీ శారదాదేవి చరిత్ర | | ... | 2 | 0 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | | ... | 1 | 8 |
| ,, (రెండవ భాగము) | | ... | 1 | 8 |
| జ్ఞానయోగము | | ... | 3 | 4 |
| రాజయోగము | | ... | 2 | 4 |
| కర్మయోగము | | ... | 1 | 8 |
| భక్తియోగము | | ... | 1 | 4 |
| శ్రీ శారదాదేవి | | . | 1 | 4 |
| శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర | | ... | 1 | 4 |
| అనుష్ఠాన వేదాంతము | | ... | 1 | 4 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 |
| భారతీయ మహిళ | ... | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | ... | 0 | 12 |
| గిరీశచంద్ర | ... | 0 | 12 |
| భక్తిమార్గము | ... | 0 | 8 |
| గురూపదేశములు | ... | 0 | 8 |
| శ్రీరామకృష్ణ ఉవాచ (తెలుగు) | ... | 0 | 6 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | ... | 0 | 6 |
| శ్రీ వివేకానంద శంఖారావము | ... | 0 | 6 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | ... | 0 | 6 |
| నా గురుదేవుడు | ... | 0 | 6 |
| శ్రీ అద్భుతానందస్వామి | ... | 0 | 6 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | ... | 0 | 4 |
| నవీన భారతదేశము | ... | 0 | 4 |
| తాపత్రయ చికిత్స | ... | 0 | 4 |
| పవహారి బాబా | ... | 0 | 4 |
| ముక్తిమార్గము | ... | 0 | 3 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | ... | 0 | 3 |
| శ్రీరామకృష్ణ ఆరాత్రికము | ... | 0 | 2 |
| శ్రీరామనామ సంకీర్తనము | ... | 0 | 1 |
| యతిగీతము | ... | 0 | 1 |
| నా మతము 0 0 6 డజను | ... | 0 | 5 |
| సింహగర్జన 0 0 6 ,, | ... | 0 | 5 |
| శ్రీరామకృష్ణప్రభ (ఆధ్యాత్మికమాసపత్రిక) సంవత్సరచందా | | 4 | 0 |
| ,, విడిసంచిక | ... | 0 | 6 |

శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

**Price Rs. 1-4-0** — **HINDU MATAMU**